# అపరాధ పరిశోధన

రు. 5·50 | అక్టోబర్ '82

సప్లిమెంట్ 106



అపరాధ పరిశోధన అనుబంధం—106

# నాలుగు నవలలు

(మీకోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## శాపగ్రస్థుడు

రచన : వసుంధర

## మూడు జతల వేలిముద్రలు

రచన : బొమ్మిడి అచ్చారావు

## భయంకర హత్యలు

రచన : టెంపోరావు

## కత్తిమీద గీతలు

రచన : సికిందర్

**అపరాధ పరిశోధన సప్లిమెంట్—106**
అక్టోబర్, 1982
వెల: రు. 5-50
ఏడాది చందా: 66 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
**శ్యామదామోదర్ రెడ్డి**

సంపాదక వర్గం:
**టెంపోరావ్**
**శ్యాంబాబు**
**ఏ. వీ. మోహన్రావ్**
**వసుంధర**
**విద్వాన్ పీలాదేవి**

కార్యాలయం:
**అపరాధ పరిశోధన కార్యాలయం**
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
**కాంతి ప్రెస్,**
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

# శాపగ్రస్థుడు

వసుంధర

గుబురుగా వున్న క్రోటన్స్ మొక్కల వెనుక కూర్చుని వున్నాడతను. అతడి చేతిలో కత్తివుంది.

రాఘవరావు దొడ్లో పడకుర్చీలో కూర్చుని వున్నవాడల్లా వున్నట్లుండి లేచి క్రోటన్సు మొక్కల దగ్గరకు వెళ్ళాడు.

అతడు ఊపిరి బిగబట్టాడు. కత్తివంక ఓసారి చూసుకుని—"అప్పుడే కాదు—" అనుకున్నాడు.

రాఘవరావు మొక్క దగ్గర ఆగాడు. ఓ ఆకు త్రుంచాడు. దాన్ని సగానికి మడిచి వాసన చూశాడు. క్రోటన్సు ఆకు మధ్యకు మడిచినప్పుడు చిట్లుతుంది. అప్పుడదొకరకమైన వాసన వేస్తుంది. ఆ వాసన రాఘవరావుకెంతో ఇష్టం. ఆయనా ఆకుని తీసుకొని మళ్ళీ వెళ్ళి పడకుర్చీలో కూర్చున్నాడు.

రాఘవరావు ఆకాశంకేసి చూస్తూ ఏమో ఆలోచిస్తున్నాడు.

4

"ఎప్పటికీ ఆయనక్కణ్నించి కదలదేం?" అనుకున్నాడతను. ఆయనింట్లోకి వెడితే తప్ప తనకూ అవకాశం రాదు. ఆయన చాలా సేపట్నుంచి అక్కడే కూర్చున్నాడు. అతడిలో సహనం చచ్చిపోతోంది.

చేతిలో కత్తి వుంది. కాని తను హత్య చెయ్యడానికి రాలేదు. అది కేవలం ఆత్మరక్షణకు కూడా తెచ్చుకొచ్చాడు. ఇంట్లో యెవరికంటా బడకుండా లోపలకు వెళ్ళి తాననుకున్న పని సాధించాలి. సాధిస్తే!?

రాఘవరావు లేచాడు. ఇంట్లోకి వెళ్ళాడు.

అతడికి తెలుసు. ఇంట్లో ఎవ్వరూ లేరు—ఆయన తప్ప!

ఇంట్లోకి ఎలా ప్రవేశించాలో కూడా అతడికి తెలుసు. అతడు చప్పున దొడ్లోంచి అటు పరుగెత్తి స్నానాల గది సమీపించాడు. స్నానాల గది కిటికీలోంచి అతడు లోపలకు గెంతాడు.

లోపల అంతా పొడిగా వుంది.

అతడికా యిల్లు క్షుణ్ణంగా తెలుసు. స్నానాల గదిలోంచి ఓ మూలకు వెళ్ళాడు. అక్కణ్నించి చూస్తూంటే మనిషి కనబడకపోయినా రాఘవరావెక్కడున్నదీ అలికిడి తెలుస్తుంది. రాఘవరావు ఇప్పట్లో ఇటు వచ్చేలా లేడు. అతడు చప్పున పక్కనే వున్న గదిలోకి దూరాడు.

గదిలో అతడు చూసిన దృశ్యం........

మంచంమీద రాఘవరావు....అతడి గుండెల్లో కత్తి..

కెవ్వుమని కేక వేయబోయి ఆగాడతను.

అతడి వెనుకనే ఆ గది తలుపులు మూసుకున్నాయి.

2

"నా పేరు శారద!" అన్నదా యువతి.

సీతమ్మ, రాజమ్మ వెంటనే ఆ విషయం నోట్

చేసుకున్నారు.

"శశికాంత్‌కూ నాకూ పెళ్ళి నిశ్చయమయింది—" అందామె మళ్ళీ.

వెంకన్న తమాషాగా తలూపి—"శశికాంత్ ఇప్పుడు పోలీసు కస్టడీలో ఉన్నాడు కదూ!" అన్నాడు.

"అవునండి. కానీ అతడు అమాయకుడు. అన్యాయంగా ఎవరో అతణ్ణిందులో ఇరికించారు. అతడినిప్పుడు మీరు తప్ప యెవ్వరూ కాపాడలేరు...."

"అతడు నిర్దోషి కాని పక్షంలో నేనూ కాపాడలేను" అన్నాడు వెంకన్న.

శారద నిబ్బరంగా చూసింది డిటెక్టివ్ వంక— "వెంకన్నగారూ—దోషులను కాపాడమని నేను మీకు చెప్పను. శశికాంత్ దోషి అయిన పక్షంలో అతడిని ప్రేమించినందుకు పశ్చాత్తాప పడతాను కూడా! అయితే ఈ ప్రపంచమంతా ఏకమై అతడు దోషి అని ఘోషించినా నేను నమ్మను. కానీ మీరు పరిశోధించి అదే విషయం ధృవపరిస్తే నమ్ముతాను. మీరిప్పుడు అతడిని రక్షించవద్దు. అతడి గురించిన నిజాన్ని తెలుసుకోండి—"

"శభాష్!" అన్నాడు వెంకన్న. తన అసిస్టెంట్లువంక చూసి—"ఈమె అన్న మాటలు సాహిత్యంలో ఉంచదగ్గవి. సరిగ్గా నోట్ చేశారా?" అనడిగాడు. సీతమ్మ, రాజమ్మ తలలూగించారు.

"అసలేం జరిగిందో చెప్పమంటారా?" అంది శారద.

"అవసరంలేదు. నేను చెబుతాను. అంతా సావధానంగా విని — నా కథలో లోపాలుంటే నువ్వు చెప్పు—" అన్నాడు డిటెక్టివ్ వెంకన్న.

శారద ఆశ్చర్యంగా అతడివంక చూసింది. అతడు చెప్పనారంభించాడు.

* * *

శశికాంత్ రాఘవరావు మేనల్లుడు. బియ్యే ప్యాసయ్యాడు. మేనమామ కోరికమీద ఆయనకు ఆస్తి వ్యవహారాల్లో సాయపడడానికి ఆర్నెల్ల క్రితం ఈ ఊరు వచ్చాడు. రాఘవరావు కతడు నచ్చాడు. తన కూతుర్నిచ్చి పెళ్ళి చేయాలనుకున్నాడు. అతడంగీకరిస్తాడన్న నమ్మకంతో శశికాంత్ పేరున లక్షరూపాయల ఆస్థి రాశాడు. రాఘవరావు కొక్కగానొక్క కూతురు.

ఈ ఊరొచ్చిన నెలరోజుల్లోనే శశికాంత్ కి శారదతో పరిచయమైంది. అతడామెనీ, ఆమె అతడినీ ప్రేమించడం జరిగింది. శారద ఇంటర్మీడియేట్ ప్యాసై తర్వాత చదువు మానేసింది. ఆమె రోజూ పార్కుకి వస్తూంటుంది. అక్కడే శశికాంత్ ని కలుసుకుంటూండేది చాలా తరచుగా.

రాఘవరావుకి శశికాంత్, శారదల వ్యవహారం తెలియడానికి కొద్ది నెలలు పట్టింది. తెలియగానే ఆయన తన మనసులోని ఉద్దేశ్యం గురించీ, వీలునామా గురించీ చెప్పాడు. వినగానే శశికాంత్ బుర్ర తిరిగిపోయింది.

లక్షరూపాయల ఆస్థి అంటే అతడికి మాటలుకాదు. చూస్తూ చూస్తూ దాన్ని వదులుకోలేడు. అయితే రాఘవరావు కూతురు అతడికి బొత్తిగా నచ్చలేదు. బహుశా ఆమె ఏ మగవాడికీ నచ్చకపోవచ్చునని శశికాంత్ అనుమానం.

అతడు నెమ్మదిగా తను శారదను ప్రేమించిన విషయం ఆయనకు చెప్పాకున్నాడు.

"అన్నీ తెలిసే నిన్ను పిలిచాను. నీ మనసు మార్చుకో గలవేమో చెప్పు. లేనిపక్షంలో నా వీలునామా మార్చు కుంటాను—" అన్నాడు రాఘవరావు.

శశికాంత్ వారంరోజుల వ్యవధి అడిగాడు. ఈలోగా రాఘవరావు కుటుంబం—బంధువుల పెళ్ళికి పొరుగూరు వెళ్ళారు.

శశికాంత్ గడువు పూర్తికావడానికి ఆఖరిరోజున రాఘవరావు చనిపోయాడు. అది మామూలు చావుకాదు. హత్య! గదిలో ఆయన పక్కన శశికాంత్ వున్నాడు. అతడి గుండెల్లో దిగబడిన కత్తిమీది వేలిముద్రలు—శశికాంత్ వి.

ఎవరో శశికాంత్ ని చూశారు. గది తలుపులువేసి పోలీసులకు ఫోన్ చేశారు.

మేనమామ వీలునామా మారుస్తాడన్న భయంతో శశికాంత్ ఆయన్ను చంపేశాడు—అని పోలీసులంటారు.

శశికాంత్ చెప్పే కథనం వేరుగా వుంది.

నాలుగు రోజుల క్రితం ఓ వ్యక్తి అతడిని కలిశాడు. రాఘవరావు ఇంటిలో అతడికి కావలసిన ముఖ్యమైన కాగితాలేవో ఉన్నాయి. అవి సంపాదించి ఇస్తే పాతిక వేల రూపాయలిస్తానన్నాడాయన. ఆ ప్రకారం పోస్ట్ డేటెడ్ చెక్కు కూడా యిచ్చాడు. బ్యాంకులో విచారించగా ఆ అక్కౌంటులో డబ్బున్నట్లు తేలింది.

శశికాంత్ ఆ కాగితాలు మేనమామ వద్దనుంచి సంగ్రహించి ఆ వ్యక్తికివ్వదలిచాడు. అయితే తనమీద మేనమామకు అనుమానం రాకూడదు. అందుకు మంచి ఉపాయం ఆ వ్యక్తి చెప్పాడు. శశికాంత్ ఆ రోజు ఊళ్ళో లేనట్లు తిరుగులేని సాక్ష్యాలు సృష్టించగలనని

చెప్పాడు. ఆ రోజు ఉదయం అతడిని మేనమామతో ఏదో ఊరు వెళుతున్నట్లు చెప్పమన్నాడు. ఆత్మరక్షణకు కత్తి ఒకటి తీసుకొని—గుర్తు తెలియకుండా ముఖానికి ముసుగు వేసుకొని రమ్మన్నాడు.

తీరా వెడితే జరిగినదిది!

* * *

"మీ కథలో లోపాలేం లేవు. కానీ పనికివచ్చే సమాచారం కొంత లేదు. ఉదాహరణకు శశికాంత్ కథ అబద్ధం కాదనడానికి-అతడు ఊళ్లో లేనట్లు సృష్టించబడిన సాక్ష్యాలున్నాయి—" అంది శారద.

"అవును—ఆ ఎలిబీ అతడు కాగితాల కోసం కాదనీ, హత్య చేయటం కోసం తనే సృష్టించుకున్నాడనీ పోలీసులు అంటున్నారు-" అన్నాడు వెంకన్న.

శారద నిట్టూర్చి — "అదీ నిజమే! అయితే అతడు చెప్పేదేమిటంటే—తనను పిలిచి పోస్టు డేటెడ్ చెక్కు ఇచ్చిన వ్యక్తి తెలివిగా తనని హత్యలో ఇరికించాడని! ఆ వ్యక్తి శశికాంత్ కి నాలుగైదు కత్తులు చూపించి—వాటిలో ఒకటి ఎంచుకొమ్మన్నాడట. అప్పుడు తను చాలా కత్తులు తాకాననీ—ఆ విధంగా తన వేలిముద్రలు కత్తిమీదకు వెళ్ళిపోయాయనీ అతడంటున్నాడు. తనవద్ద వున్న కత్తి ఉపయోగించనే లేదుకదా!" అంది.

"దానికేముందీ? అతడివద్ద రెండు కత్తులుండి వుండవచ్చు—"

"మీరు కూడా పోలీసులకు వలెనే ఆలోచిస్తున్నారు—" అంది శారద దీనంగా.

"నువ్వలా కంగారుపడకు. హతుడి కత్తిమీది వేలిముద్రలు శశికాంత్ ని హంతకుడిని చేయవు. నేనోసారి

అతణ్ని కలుసుకొని మాట్లాడితేకానీ ఏ విషయమూ చెప్పలేను. ఇంతకీ నువ్వు నాకేమైనా ఫీజు ఇచ్చుకో గలవా?" అన్నాడు వెంకన్న.

శారద పర్సు తెరిచింది. పది వందరూపాయల నోట్లు వెంకన్నకు అందించి—"ప్రస్తుతానికి ఇంతే ఇచ్చుకో గలను—" అంది.

వెంకన్న ఆశ్చర్యంగా — "ఎక్కడిది నీకీ డబ్బు?" అన్నాడు.

"నా చేతికి ఉన్న బంగారు గాజులు తాకట్టు పెట్టాను. ఇంటిలో వాళ్ళకి అనుమానం రాకుండా అలాంటివే నకిలీవి కొన్నాను—" అందామె.

వెంకన్నా వెయ్యి రూపాయలూ ఆమెకు తిరిగిచ్చేసి మరో పదిరూపాయల నోటు కూడా ఆమెకు అందించి— "ఈ పదిరూపాయలూ పరిహారం చెల్లించి ఆ వెయ్యి రూపాయలూ వెనక్కిచ్చి నీ గాజు తెచ్చుకో. చాలా కేసుల్లో అవసరానికిమించే నాకు దొరుకుతోంది. శశికాంత్ విడుదలయ్యేక డబ్బు అతడి దగ్గర్నుంచి తీసు కుంటాను. ఇలా గాజులు తాకట్టు పెట్టి నా ఫీజు తీసుకు రావటం నాకు అవమానం—" అన్నాడు.

శారద గంభీరంగా—"దీన జనోద్ధరణ కోసమే మీరు ఇక్కడ బల్లకట్టి ప్రాక్టీసు పెట్టినట్లయితే త్వరలో నే మీరూ వాళ్ళలో ఒకరు కావాల్సొస్తుంది—" అంది.

"దీన జనోద్ధరణ నా ధ్యేయంకాదు. అలాగని సాయం పేరుతో వాళ్ళను దోపిడీ చెయ్యటం నావల్లకాదు—" అన్నాడు వెంకన్న.

అప్పుడే అతడి బల్లమీద ఫోన్ మ్రోగింది.

"డియర్! నేను వంటింటిలోంచి మాట్లాడుతున్నాను.

మీరు నాకు చాలా నచ్చారు. ఒక్కసారి లోపలకు వస్తే మంచి బహుమతి ఇస్తాను—" అంది పద్మావతీదేవి.

వెంకన్న ఫోన్ క్రెడిల్ చేసి-"నువ్వింక వెళ్ళొచ్చు-" అన్నాడు. శారద అతడికి నమస్కరించి వెళ్ళిపోగానే వెంకన్న లేచాడు.

"బహుమతి అంటే ముద్దే కదూ?" అంది సీతమ్మ.

"నా స్వంత ఫోన్ వినవద్దని ఎన్నిసార్లు చెప్పాలి మీకు?" అన్నాడు వెంకన్న కోపంగా. అది నిజమైన కోపం కాదని పదునెనిమిది వత్సరాల ప్రాయపు అసిస్టెంట్సిద్దరకూ తెలుసు. అందుకని వారతడి కోపానికి భయపడినా అది నటన మాత్రమే!

"బాస్! నేనెప్పుడూ మీ స్వంత ఫోన్ వినను. ఈ సీతమ్మకు బుద్ధి లేదు. అయినా వెళ్ళేది వంటింటిలోకేనా అని అడగడానికి బదులు—బహుమతి అంటే ఏమిటని అడగడమెందుకూ?" అంది రాజమ్మ.

"మీరు కేసు గురించి నోట్సు తయారుచేయండి. నేను పదినిమిషాల్లో వస్తాను—" అంటూ లోపలకు వెళ్ళాడు డిటెక్టివ్ వెంకన్న.

## 3

మర్నాడుదయం డిటెక్టివ్ వెంకన్న పోలీస్ స్టేషన్లో శశికాంత్‌ని కలుసుకొని అతడి కథనమంతా విన్నాక ఇన్‌స్పెక్టర్‌తో మాట్లాడేడు. అందులో ఒక విచిత్రం బయటపడింది.

పోస్టుమార్టం రిపోర్టు ప్రకారం హాతుడు మధ్యాహ్నం మూడు గంటలకు చంపబడ్డాడు. శశికాంత్ పాదల మాటున సాయంత్రం నాలుగూ నలభై అయిదు నుంచి గంటసేపున్నానంటున్నాడు. ఆ సమయంలో

అతడు రాఘవరావుని చూశానంటున్నాడు. యెలా సాధ్యం?

"అదంతా కట్టు కథ. మీరు నమ్మకండి-" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"అది సరే — హంతకుడినంత ధైర్యంగా గదిలో బంధించిన ఆ మనిషి ఎవరు? అతడక్కడికి ఎప్పుడు, ఎలా చేరుకున్నాడు?" అన్నాడు వెంకన్న.

"అవన్నీ మనకు అనవసరం. దొరకని సాక్ష్యాల గురించి తల బద్దలు కొట్టుకోవటం మీ డిటెక్టివుల పని. దొరికిన సాక్ష్యాలు కేసును తేల్చేస్తున్నపుడు ఇవన్నీ మాకెందు చెప్పండి!" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

వెంకన్న నవ్వి — "ఎందుకో చెప్పమంటారా?" అన్నాడు. ఇన్‌స్పెక్టర్ బదులిచ్చేలోగానే—"మీ కేసు కోర్టులో నిలబడదు. మీ కథలో చాలా లోపాలు వున్నాయి. హత్య మధ్యాహ్నం మూడింటికి జరిగింది. పోలీసులకు ఫోన్ ఆరుంపావుకి వచ్చింది. హంతకుడు గదిలో ఎన్ని గంటలకు బంధింపబడ్డాడు? మూడింటికా-ఆరింటికా? మూడింటికే అయితే హంతకుడిని బంధించిన వ్యక్తి ఆరుంపావుదాకా ఎందుకు పోలీసులకు ఫోన్ చెయ్యలేదు? ఆరింటికనుకుందామా అంటే హత్య జరిగేక అంతసేపు హంతకుడక్కడేం చేస్తున్నాడు?" అనడిగాడు వెంకన్న.

ఇన్‌స్పెక్టర్ కొంతసేపు ఆలోచించి—"ఇందులో పెద్ద విశేషమేముంది? హంతకుడు తన వేలిముద్రలు కత్తి మీద ఉండిపోయుంటాయని మళ్ళీ వచ్చివుంటాడు. అతడాయింటిలోకి వెళ్ళటం చూసిన ఏ ఎదురింటాయనో అనుమానించి లోపలకు వెళ్ళి జరిగింది చూసి అతడిని

గదిలో బంధించి పోలీసులకు ఫోన్ చేసి ఉంటాడు—"
అన్నాడు.

"చాలా బాగుంది. శశికాంత్ ఆ ఇంటిలోని మనిషేనని మీరు మర్చిపోతున్నారు. అతడా ఇంటిలోకి వెడుతూంటే ఏ ఎదురింటివారూ అనుమానించరు. అనుమానించి అనుసరించినా హత్య జరిగి అప్పటికి మూడు గంటలయింది. ఇంటిలోంచి ఏ కేకా వినబడకుండానే—గదిలో అడుగు పెట్టిన శశికాంత్ ని హంతకుడిగా ఎలా అనుమానించటం జరుగుతుంది?" అన్నాడు వెంకన్న.

"అయితే ఏం జరిగిందంటారు?" అన్నాడు యిన్స్పెక్టర్ విసుగ్గా.

"జరగడానికేముంది? హంతకుడు శశికాంత్ కాదు. అతడు ట్రాప్ చెయ్యబడ్డాడు. కాస్త అనుభవమున్న నేర పరిశోధకులెవ్వరైనా ఈ విషయం గ్రహించగలరు. మీకు అనుభవం లేదని నేననను. కానీ నిర్దోషిని ఉరికంబమెక్కించే పొరపాటు జరగకూడదని ఆలోచేస్తే మీరు ఇంత త్వరగా నిర్ణయాలకు రాలేరు. మనకు కేసు తేలిపోవడం కాదు కావలసింది—దోషి పట్టుబడటం!"

ఇన్స్పెక్టర్ మాట్లాడలేదు.

వెంకన్న మళ్ళీ అన్నాడు-"ఈ కేసులో నేను మీకు సాయపడతాను. శశికాంత్ విషయంలో తొందరపడి మీరొక నిర్ణయానికి రాకండి—"

"థాంక్స్!" అన్నాడు ఇన్స్పెక్టర్—"స్పాట్లో దొరికిన వ్యక్తి హంతకుడు కాదని అనుమానిస్తూ పోతూంటే మా పోలీసులకు ఒక్క కేసు కూడా తేలదు. అయితే నేను తొందరపడనని మీకు హామీ ఇస్తున్నాను—"

వెంకన్న ఇన్‌స్పెక్టర్‌తో కరచాలనం చేసి అక్క ణ్నించి బయల్దేరాడు. అతడు తిన్నగా రాఘవరావుండే వీధికి వెళ్ళాడు. ఆ వీధిలో రాఘవరావింటికి ఎదురుగానూ, పక్కగానూ ఉండేవాళ్ళను చాలా ప్రశ్నలువేశాడు. అతడికి పనికొచ్చే సమాచారం ఓ పదేళ్ళ కుర్రాడినుంచి లభించింది.

నల్లపాంటు, తెల్లషర్టు వేసుకొని — కుచ్చుటోపీతో ఉన్న వ్యక్తి ఒకడు సుమారు ఆరుగంటల ప్రాంతంలో రాఘవరావు ఇంట్లోంచి బయటకు రావటం ఆ కుర్రాడు చూశాడుట. మనిషికి గుబురు గెడ్డం, మీసాలున్నవట. ఆ వ్యక్తిని అంతకుముందెన్నడూ తాను చూడలేదుట. ఆ వ్యక్తి సందు మొనలో రిక్షా ఎక్కాడుట.

వెంకన్న ఆ కుర్రాడిని మెచ్చుకొని అయిదు రూపాయలు బహుమతిగా యిచ్చి మళ్ళీ ఆ వ్యక్తి కన బడితే తనకు చెప్పమన్నాడు. తర్వాత అతడు సందు మొగలోకి వెళ్ళాడు. రిక్షావాళ్ళు చాలామంది ఉన్నా రక్కడ.

వెంకన్న తన జేబులోంచి పదిరూపాయల నోటుతీసి- "ఈ డబ్బు మీదే అవుతుంది—నాక్కావలసిన సమా చారం అందిస్తే!" అన్నాడు.

వాళ్ళందరూ చాలా కుతూహలపడ్డారు.

"నల్లపాంటు, తెల్లషర్టు, కుచ్చుటోపీ, గుబురుగెడ్డం, మీసాలు — ఇవన్నీ ఉన్న వ్యక్తిని మీలో ఎవరైనా నన్ను సాయంత్రం ఆరుగంటల ప్రాంతాల రిక్షా ఎక్కించు కొవటం జరిగిందా?" అన్నాడు వెంకన్న.

అక్కడున్న వారిలో ఒకడు చటుక్కున — "ఆ ఛాన్సు—అదిగో ఆ గంగన్నగాడికే వచ్చిందండి—"

అన్నాడు.

"ఏమో_నాకేం తెలియదు_" అన్నాడు గంగన్న.

తనకు సమాచారమిచ్చిన రిక్షావాడివంక చూస్తూ—

"గంగన్న చేత నిజం చెప్పిస్తే ఈ పదిరూపాయలూ నీవి. ఆపైన గంగన్న నిజం చెప్పాడంటే అతడికీ మంచి బహుమతి ఉంటుంది__" అన్నాడు వెంకన్న.

ఆ మనిషిని తను రిక్షా ఎక్కించుకున్నట్లు గంగన్నకు ఒప్పుకోక తప్పలేదు. తర్వాత గంగన్న వెంకన్నను చాటుగా తీసుకువెళ్ళి—"తన గురించి ఎవరికీ చెప్పొద్దని ఆ బాబు నాకు ఇరవై రూపాయలిచ్చాడు. ఆయన్ను నేను అన్నపూర్ణా హోటలు దగ్గర దిగవిడిచాను—" అన్నాడు.

వెంకన్న అన్నపూర్ణా హోటలుకు వెళ్ళాడు.

అటువంటి వ్యక్తి తమ హోటల్లో బసచేసినట్లు మేనేజరు ఒప్పుకున్నాడు. రూం నెంబరు పదకొండులో అతడుంటున్నాడు. అయితే రాత్రి పదిగంటలకు అతడు బయటకు వెళ్ళాడు. ఇంకా రాలేదు.

వెంకన్న తానొకసారి అతడి గదిని చూడాలన్నాడు.

అన్నపూర్ణా హోటలు ప్రొప్రయిటరు చాలా పర్యాయాలు వెంకన్నవల్ల ప్రయోజనం పొంది ఉన్నాడు. అందుకని ఆ హోటల్లో అతడికి ప్రత్యేకమైన గౌరవముంది.

మేనేజరు, వెంకన్న గదిలోకి వెళ్ళారు.

గదిలో ఆ వ్యక్తికి సంబంధించిన సామానేమీ లేదు. మంచినీళ్ళు తాగినట్లు సూచనగా ఒక గాజు గ్లాసు ఉన్నది. అయితే వెంకన్నను ముఖ్యంగా ఆకర్షించిన వస్తువొకటుంది.

అది క్రోటన్సు ఆకు!

సగానికి మడతపెట్టబడి విరిగి ఉన్న ఆ ఆకు ఇంకా పూర్తిగా వడిలిపోలేదు. వెంకన్న చటుక్కున్న వంగి అది తీసుకొని — "మీ హోటల్లో క్రోటన్సు మొక్కలున్నాయా?" అనడిగాడు.

"లేకేం — చాలా వున్నాయి సార్!" అన్నాడు మేనేజర్.

వెంకన్న ఒక్కక్షణం నిరుత్సాహ పడ్డాడు. తర్వాత నెమ్మదిగా— "ఖరీదు ఇచ్చేస్తాను. ఈ గదిలోని గ్లాసు, కూజా నేను తీసుకువెడితే మీకు అభ్యంతరమా?" అన్నాడు.

"అయ్యో—తీసుకువెళ్ళండి సార్! ఖరీదు ప్రసక్తి వద్దు—" అన్నాడు మేనేజరు వినయంగా.

"ఈ క్రోటన్సు ఆకు కూడా నేను తీసుకువెడతాను. మీకు అభ్యంతరం లేదుకదా!" అన్నాడు వెంకన్న.

"మీరు నాతో వేళాకోళమాడుతున్నారు. ఆకు ముక్కదేముంది సార్—అది తీసుకువెళ్ళడానికి అనుమతి అడగాలా?" అన్నాడు మేనేజరు.

వెంకన్న తనలో తను నవ్వుకుంటూ—"ఈ ఆకు ఓ హంతకుడిని పట్టిచ్చే ఆధారం. ఆ హంతకుడు మీ కస్టమర్. కస్టమర్సుకి కష్టం కలిగించే పనులు ఏ హోటల్ వాళ్ళూ చేయరుకదా—" అనుకున్నాడు.

"ఇంతకూ విశేషమేమిటి సార్ — ఈ గదిలో చేరిన వ్యక్తి నేరస్థుడా?" అన్నాడు మేనేజర్.

"బహుశా నేరస్థుడే అయుండవచ్చును. అతడు తిరిగి గనుక వస్తే నేనిలా వచ్చి వెళ్ళినట్లు అతడికి చెప్పకండి. కొత్త కూజా, కొత్త గ్లాసు ఇక్కడుంచండి. ఎందుకైనా

మంచిది-ఇలాంటిదే ఓ క్రోటన్సు ఆకు ఒకటి ఇదేవిధంగా మడిచి ఇక్కడ పారేయించండి. అతడు రాగానే ఫోను చేసి నాకు తెలియచెయ్యండి—" అని—"ఇంతకూ అతడు రూం ఎన్ని రోజులకు బుక్ చేసుకున్నాడు?" అనడిగాడు వెంకన్న.

"నాలుగు రోజులకు—...." అన్నాడు మేనేజర్.

వెంకన్న తృప్తిగా తలాడించి వెళ్ళిపోయాడు.

## 4

మర్నాడే పేపర్లో మొదటి పేజీలోనే ఈ హత్యా వార్త వచ్చింది.

అందులో—పోలీసులు శశికాంత్ ని అరెస్టు చేసినట్లూ వచ్చింది. డిటెక్టివ్ వెంకన్న ఈ కేసును పరిశోధిస్తున్నట్లూ వచ్చింది. డిటెక్టివ్ వెంకన్న అభిప్రాయాల గురించి ప్రత్యేకంగా ఓ పేరా వ్రాయబడింది. అందులో ఈ హత్య కేసులో ముఖ్యాధారం ఓ క్రోటన్సు ఆకు అనీ దాని గురించి వెంకన్న అన్వేషిస్తున్నాడనీ వ్రాశారు.

వెంకన్న ఆ వార్త చదువుకుని తనలో తాను నవ్వుకున్నాడు. హంతకుడీ వార్త చదువుతాడా? చదివినా అతడికి క్రోటన్సు ఆకు గురించి గుర్తుంటుందా? ఉంటే దాని గురించి మళ్ళీ హోటలుకు వెడతాడా?

వెంకన్న తన ఆఫీసులో కూర్చున్నప్పటికీ ఏదో సందేశం కోసం ఎదురుచూస్తున్నట్లు కనిపించాడు. అతడు ఎదురుచూసిన సందేశం సుమారు పదిగంటల ప్రాంతంలో వచ్చింది.

ప్రొఫెసర్ భూషణరావు నుంచి చిన్న పార్సిల్, ఓ కవరు వచ్చాయి.

ఆ రెండింటినీ తీసుకొని వెంకన్న పోలీస్ స్టేషన్‌కు వెళ్ళాడు.

ఇన్‌స్పెక్టర్ వెంకన్నను సుభావంగా పలకరించాడు.

"డియర్ ఇన్‌స్పెక్టర్! శశికాంత్ హంతకుడు కాదన డానికి తిరుగులేని సాక్ష్యం సంపాదించాన్నను—" అన్నాడు వెంకన్న.

ఇన్‌స్పెక్టర్ కళ్ళు మెరిశాయి — "ఏ మి ట ది?" అన్నాడు.

"హంతకుడు చాలా తెలివైనవాడు. అతడు ముందు శశికాంత్‌ని బుట్టలో వేసుకొని సాయంత్రం ఆరింటికి తానను కున్న చోటికి వచ్చేలా చేశాడు. అంతకుముందే తను హత్యచేసి శశికాంత్‌ని గదిలో ఇరికించి తను ఇంట్లోంచి బయటపడి పోలీసులకు ఫోనుచేశాడు. అతడు ఇంట్లోంచి బయటకు వస్తూండగా కొందరు చూశారు. ఆ తర్వాత అతడు రిక్షాలో ఓ హోటలుకు వెళ్ళాడు. బహుశా హోటల్నించే పోలీస్ స్టేషనుకు ఫోనుచేశాడు. హోటల్నించే రాత్రి పారిపోయాడు. అయితే హోటల్లో అతడి గురించి సమాచారం చాలా వుంది. అతడి వేలి ముద్రలు సంపాదించాను. ఇంకా ముఖ్యమైనది-క్రోటన్సు ఆకు...."

ఇనస్పెక్టర్ వెంకన్నను మధ్యలో ఆపి—"అవును—పేపర్లో చూశాను .... క్రోటన్సు ఆకు ప్రాముఖ్యత ఏమిటి?" అనడిగాడు.

"శశికాంత్ కథనం మీకు గుర్తులేదా?" అన్నాడు వెంకన్న—"ఆ ప్రకారం హంతకుడు ఓ క్రోటన్సు ఆకు కోసి మడిచి వాసన చూశాడు. హంతకుడు ఆకును

తర్వాత జేబులో వేసుకొని ఉంటాడు. ఆ తర్వాత హోటల్లో పారేశాడు. అది నేను సంపాదించాను...."

"కొండను తవ్వి ఎలుకను పట్టినట్లుంది. ఆ క్రోటన్సు ఆకు అదేనని ఏం చెప్పగలం?" అన్నాడు ఇనస్పెక్టర్.

"ఒకటి రెండు విశేషాలు కాకతాళీయంగా జరుగవచ్చు. కానీ అన్నీ కాకతాళీయంగా జరుగుతాయంటే నేను నమ్మలేను. ఆ ఇంటిలోంచి ఆరుగంటల ప్రాంతాల ఓ మనిషి బైటకురావటం కొందరు చూశారు. అదే రూపురేఖలతో ఉన్న వ్యక్తిని ఆ వీధి సందు మొగలోని ఒక రిక్షావాలా అన్నపూర్ణా హోటలు దగ్గర దిగవిడిచాడు. అదే రూపురేఖలుగల వ్యక్తి అన్నపూర్ణా హోటల్లో పదకొండో నెంబరు గదిలో బసచేశాడు. ఆ గదిలో ఓ క్రోటన్సు ఆకు వుంది. ఇదంతా చూస్తే మీకు శశికాంత్ కథ నమ్మాలనిపించటంలేదూ?" అన్నాడు వెంకన్న.

ఇనస్పెక్టర్ ఆరాధగా పూర్వకంగా వెంకన్న వంక చూసి—"మీ పరిశోధనా చాతురిని అభినందించకుండా ఉండలేను. అయితే నాదొక్క సందేహం. మీరు శశికాంత్ హంతకుడిని చూసినట్లు భావిస్తున్నారు. కానీ శశికాంత్ రాఘవరావుని చూశానంటున్నాడు. అతడు నిజమే చెబుతున్నాడనుకుందాం. శశికాంత్ ఆరుగంటలకు చూసిన రాఘవరావు మూడు గంటలకే ఎలా చచ్చిపడున్నాడు?" అన్నాడు.

"అలా అడగండి — చెబుతాను—" అన్నాడు వెంకన్న—"హంతకుడికి శశికాంత్ రాఘవరావు ఇద్దరూ బాగా తెలుసు. అతడు రాఘవరావుని హత్యచేశాక రాఘవరావులా కాసేపు నటించాడు. అది శశికాంత్

కోసం. శశికాంత్ నమ్మకం పెంచడం కోసమే అతడు క్రోటన్సు ఆకుని త్రుంచాడు. ఆ ఆకే తనకు ప్రాణాంతక మవుతుందని అప్పటిలో అతనికి తెలియదు—"

"మీ కథనం బాగానే ఉంది. అయితే ఈ క్రోటన్సు ఆకుతో మనమేం సాధించగలమో చెప్పండి!" అన్నాడు ఇనస్పెక్టర్.

"విజ్ఞానశాస్త్రం మారణాయుధాలను తయారుచేస్తోందనేతప్ప అది మనుషుల దుష్టత్వానికి మారణాయుధంగా ఎలా పనిచేస్తోందో మీలో చాలామందికి తెలియదు. ఈ పార్సిల్ విప్పి చూడండి. ఈ ఉత్తరంలోని వివరాలు చదవండి—" అన్నాడు వెంకన్న—ఓ కాగితాన్ని ఇనస్పెక్టర్‌కి అందిస్తూ.

ఓ పది నిమిషాలసేపు ఇనస్పెక్టర్ అవన్నీ పరీక్షించి- "బావ్ శే!" అన్నాడు.

మనుషుల చేతి వేలిముద్రలు చూడ్డానికి ఒక్కలాగునే కనబడవచ్చును. కానీ ఈ ప్రపంచంలో ఏ యిద్దరు మనుషుల వేలిముద్రలూ ఒకేలాగున ఉండవు. అది సృష్టి విచిత్రం. ప్రొఫెసరు భూషణరావు ఈ విచిత్రాన్ని మొక్కల విషయంలో పరిశోధిస్తూ చాలా విశేషాలు తెలుసుకోవడమేకాక కొన్ని కొత్త పరికరాలు కూడా కనిపెట్టాడు. ఆయన వృక్షశాస్త్ర నిపుణుడు. ఆయన పరిశోధనల గురించి ఆసక్తిగా చదివే వారిలో వెంకన్న ఒకడు.

చూడ్డానికి అన్ని ఆకులూ ఒకేలాగున ఉండవచ్చును. కానీ ఓ ఆకు ఫలానా చెట్టునుంచి త్రుంచబడిందా లేదా అన్న విషయం తెలుసుకోడానికి కొన్ని పద్ధతులున్నాయి. ఆదేవిధంగా ఆకు మొక్కనుంచి త్రుంచబడినాక దానిలో

వచ్చే మార్పులను బట్టి అది త్రుంచబడి ఎంత సేపయిందో చెప్పవచ్చును.

క్రితం రోజు ఉదయం వెంకన్న ఆ ఆకును తీసుకొని ప్రొఫెసరు భూషణరావు వద్దకు వెళ్ళి తన సమస్య చెప్పు కున్నాడు. ఈ కేసులో ప్రొఫెసరుకూ ఆసక్తి కలిగింది. ఆయన ఆ ఆకుపై పరీక్షలు జరిపి అది రాఘవరావు ఇంటిలో క్రోటన్సు మొక్కనుంచి హత్య జరిగిన రోజు సాయంత్రం అయిదుకూ, ఆరుకూ మధ్య త్రుంచబడిందని ధ్రువీకరించాడు. అందుకు తానేమేం పరీక్షలు చేశాడో వివరంగా వ్రాశాడాయన. ఆ క్రోటన్సు మొక్కకు చెందిన మరో నాలుగు ఆకులు కూడా పార్సిల్లో వున్నాయి.

"వెంకన్నగారూ—మీ పరిశోధనా సామర్థ్యానికి నా జోహార్లు. నేను పోలీసు ఉద్యోగినని చెప్పుకు నేందుకు సిగ్గుపడుతున్నాను...." అన్నాడు ఇనస్పెక్టర్.

"ఇందులో సిగ్గుపడవలసినదేమీ లేదు. ప్రభుత్వోద్యోగులకూ, ప్రయివేటు రంగం వ్యక్తులకూ ఆ తేడా ఎప్పుడూ ఉంటున్నదే!" అన్నాడు వెంకన్న.

"ఇప్పుడేం చేయాలంటారు?" అన్నాడు ఇనస్పెక్టర్.

"ఈ వేలిముద్రల కాపీ ఒకటి మీ దగ్గరుంచండి. ఇవి హంతకుడి వేలిముద్రలనడానికి ఏ మాత్రమూ సందేహం లేదు. ఇంక మనం హంతకుడిని పట్టుకోవాల్సి వుంది—" అన్నాడు వెంకన్న.

"అందుకూ ఏదైనా పథకం వేశారా?" అన్నాడు ఇనస్పెక్టర్.

"క్రోటన్సు ఆకు గురించి పేపర్లో ప్రకటించానుగదా- అతడు మళ్ళీ హోటలుకు తప్పక వెడతాడని నా నమ్మకం. అతడా గదిని తన గురించి నాలుగు రోజులు

బుక్ చేశాడు....” అన్నాడు వెంకన్న—“మీరూ వస్తే రండి—ఇప్పుడు నేను అన్నపూర్ణా హోటలుకు వెడుతున్నాను—...”

ఇనస్పెక్టర్ లేచి నిలబడి—“అఫిషియల్‌గా నాకు ఈ ఇన్వెస్టిగేషన్‌తో సంబంధంలేదు. నాకు సంబంధించినంతవరకూ ఈ హత్య కేసు తేలిపోయింది. హంతకుడు దొరికేశాడు. కానీ మీ పరిశోధన చాలా ఆసక్తికరంగా ఉన్నది. చూస్తాను—” అన్నాడు.

“యూ ఆర్ వెల్‌కం. కానీ తొందరపడి శశికాంత్ పై ఛార్జి షీట్ ఫైల్ చేయకండి. కొద్దిరోజులు వేచి చూడండి. నా పరిశోధన మన పరిశోధనగా మార్చడానికి నాకు అభ్యంతరంలేదు—” అన్నాడు వెంకన్న.

“థాంక్యూ—” అన్నాడు ఇనస్పెక్టర్.

ఇద్దరూ కలిసి అన్నపూర్ణా హోటలు చేరుకున్నారు. అక్కడ మేనేజరు వారిద్దరికీ స్వాగతం పలికాడు. వెంకన్న వంక చూస్తూ — “నమస్కారమండీ! అతను వచ్చాడు. ప్రస్తుతం రూం లోనే ఉన్నాడు—” అన్నాడు.

వెంకన్న కళ్ళు పెద్దవయ్యాయి. ఇంత సులభంగా అతడు తమకు దొరుకుతాడని అనుకోలేదు.

“ఎంతసేపయిందతడు వచ్చి?” అన్నాడు వెంకన్న.

“అయిదు నిమిషాలయింది. మీకు ఫోనుచేద్దామనుకుంటూండగా మీరే వచ్చారు—” అన్నాడు మేనేజరు.

“అయితే అర్జంటుగా వెళ్ళి అతణ్ని కలుసుకోవాలి” అన్నాడు వెంకన్న.

ముగ్గురూ బయల్దేరి రూం నెంబరు పదకొండు చేరుకున్నారు.

తలుపులు దగ్గరగా వేసి వున్నాయి.

మేనేజరు తలుపు తోశాడు. గదిలో ఎవరూ లేరు. అతడు చటుక్కున బాత్రూంలోకి వెళ్ళి చూశాడు. అక్కడా ఎవ్వరూ లేరు.

వెంకన్న వంగి పరిశీలించడం అయింది. అతడు తిరిగి వచ్చిన మేనేజరు వంక చూసి — "అతడు వచ్చిన పని అయింది. క్రోటన్సు ఆకు తీసుకుని వెళ్ళిపోయాడు. ఇప్పుడు మనం త్వరగా అతడేమైనాడో తెలుసుకోవలసి ఉంది—" అన్నాడు.

విచారించగా అతడు గది తలుపులు తెరిచిన రెండు క్షణాల్లోనే వెళ్ళిపోయినట్లు తేలింది.

"అతడు క్రోటన్సు ఆకుకోసం వచ్చాడు. మరింకేం పనీ లేదతడికి. క్షణం కూడా ఇక్కడుండటం ఇష్టంలేదతడికి. వచ్చిన వెంటనే వెళ్ళిపోతే అనుమానించడం జరుగుతుందని భయపడి మేనేజరుకు తెలియకుండా వెళ్ళిపోయాడు. అయితే వాంతకుడు తను తప్పించుకున్నాననే అనుకుంటున్నాడు. అందువల్ల అతడు కాసేపాగి మీకు ఫోనుచేసి తను గది ఖాళీ చేస్తున్నానని చెప్పవచ్చు. అతడిని పట్టుకునేందుకదే ఓ పెద్ద ఆధారం కాగలదు. నేనీరోజు మీ దగ్గరే కాపలా కాస్తాను" అన్నాడు వెంకన్న ఏదో ఆలోచిస్తూ.

ఇనస్పెక్టర్ వెంకన్న భుజం తట్టి—"అమూల్యమైన మీ కాలం వృధా చేయకండి. ఈ రోజు ఈ మేనేజరుకు వచ్చిన ఫోనుకాల్సన్నీ ఎక్కణ్నించి వస్తున్నాయో తెలుసుకునే ఏర్పాటు చేస్తాను. మనక్కావలసిన కాల్ రాగానే క్షణాలమీద ఆ మనిషిని పట్టిస్తాను—" అన్నాడు.

"చాలా థాంక్స్ మిస్టర్ ఇనస్పెక్టర్!" అన్నాడు వెంకన్న.

అయితే వారి ప్రయత్నం ఫలించలేదు. హంతకుడి నుంచి ఫోనుకాల్ రానేవచ్చింది మేనేజరుకు.

"హలో! రూం నెంబరు పదకొండులో నాకింక పని లేదు. మీరది ఇంకెవరికైనా ఇచ్చుకోవచ్చు—"

చాలా క్లుప్తంగా చేయబడ్డ ఆ కాల్ ఆ మనిషిని పట్టుకునేందుకు సహకరించలేదు. అతడిని మరి కాసేపు మాట్లాడేలా చేయాలనుకున్న మేనేజరు ప్రయత్నమూ ఫలించలేదు.

# 5

"కేసంతా మొదటికి వచ్చింది—"అన్నాడు వెంకన్న.

"బాస్ — మీరేమీ అనుకోనంటే నాదో చిన్న పాయింటు—" అంది సీతమ్మ భయం భయంగా.

"అనుకోవడమెందుకు? ధైర్యంగా చెప్పు...."

"గాఢాంధకారంలో ఏమీ కనిపించనప్పుడు ఓ అగ్గిపుల్ల వేస్తాం. అది కాసేపు వెలిగి ఆరిపోతుంది. అది ఆరేలోగా మనక్కావలసింది దొరికిందా—సరేసరి! లేని పక్షంలో ఆ అగ్గిపుల్ల ఇంక పనిచేయదు. రెండో అగ్గిపుల్ల వెలిగించక తప్పదు...." అంది సీతమ్మ.

"సరే—వెలిగించు...." అన్నాడు వెంకన్న.

"మనం హంతకుడి నాటకం తెలుసుకున్నాం. కానీ అతడి ఉద్దేశ్యమేమిటో తెలుసుకోలేదు-" అంది సీతమ్మ.

వెంకన్నకు అర్థమయింది. హత్యకు మోటివ్ ఏమిటో తెలుసుకుంటే హంతకుడి ఆకారంలోని అస్పష్టత మాసిపోవచ్చు.

శశికాంత్‌కు మోటివ్ ఉంది. కాని అతడు నిర్దోషి

అని తను నమ్ముతున్నాడు. రాఘవరావును హత్య చేయ డానికి అవసరమైన మరో కారణ మేమిటో తను తెలుసు కోవాలి.

వెంకన్న ఆ రోజంతా రాఘవరావు గురించి విచా రించాడు.

రాఘవరావు చిన్న చిన్న వ్యాపారాలు చేసి డబ్బు బాగా కూడ బెడుతున్నాడు. కానీ అతడికి ఎవరితోటీ గొడవలులేవు. తెలిసిన వాళ్ళందరూ అతడు చాలా మంచివాడనే చెబుతున్నారు. శ శి కాం త్ కూడా రాఘవరావు గురించి అదే మాటలు చెప్పాడు. ఆయన్ను హత్య చేయడానికి ఎవరికీ చేతులురావని అన్నాడతను.

అప్పుడే వెంకన్న శశికాంత్ని మరో పాయింటు అడిగాడు. మూడు గంటలకు చచ్చిపోయిన రాఘవరావుని ఆరుగంటలకు చూడటం సాధ్యపడదు కాబట్టి శశికాంత్ చూసింది రాఘవరావు వేషంలోని హంతకుడయుంటాడు.

"కాదు. మామయ్యే నాకు బాగా తెలుసు. నా కళ్లు నన్ను మోసం చెయ్యవు. ఆ కళ్ళు, ఆ మీసాలు, ఆ నడక—అన్నీ నాకు బాగా పరిచితం. నేను పొరబడను... హత్యా సమయం నిర్ణయించటంలో పోలీసు డాక్టరు ఏదో పొరపాటు చేసివుంటాడని నా అనుమానం...."

"అయితే నువ్వు గదిలోకి వెళ్ళగానే తలుపు లెవ్వరు వేసివుంటారంటావ్?"

శశికాంత్ తలపట్టుకుని-"నాకంతా అయోమయంగా ఉంది!" అన్నాడు.

"హంతకుడు నీ మేనమామకు బాగా పరిచయస్థుడు. ఆయన వేషం, నడవడికలు చక్కగా అనుకరించగల శక్తిగలవాడు—....బాగా ఆలోచించిచూడు. ఆ రోజు

సాయంత్రం నువ్వు చూసిన వ్యక్తిని మరీ మరీ గుర్తు తెచ్చుకో. మీ బంధువర్గంలో కానీ, పరిచయస్తుల్లో గానీ అతడెవరైయుండే అవకాశముందో చెప్పు. నువ్వు హంతకుడివి కావని నాకు తెలిసింది. కానీ హంతకుడెవరో తేలేదాకా నిన్ను రక్షించటం నావల్ల కాదు. నువ్వు చెప్పే సమాధానం నాకెంతో సహకరిస్తుంది....” అన్నాడు వెంకన్న.

శశికాంత్ చాలా సేపు ఆలోచించి—“ఆయన నా మేనమామ రాఘవరావు తప్ప వేరెవ్వరూ కావడానికి వీల్లేదు. ఇంతకన్నా నేనేమీ చెప్పలేను సార్! ఏం చేయను?” అన్నాడు దిగులుగా.

వెంకన్న అతడి భుజం తట్టి—“నువ్వు చెప్పేవన్నీ అబద్ధాలుగానే కనబడుతున్నాయి. కానీ అవే నిజాలని నాకు అనిపిస్తోంది. ఓ నిజం ఋజువయింది. రెండో నిజం ఋజువు చేయటం చాలా కష్టం—నా ప్రయత్నం నేను చేస్తాను. ఆపైన భగవంతుడున్నాడు—” అన్నాడు.

తర్వాత వెంకన్న రాఘవరావు కుటుంబం గురించి పూర్తి ఆరాలు తీశాడు. రాఘవరావు ఆ ఊరొచ్చి అయిదు సంవత్సరాలయింది. అంతకు పూర్వం ఆ కుటుంబం విశాఖపట్నంలో ఉండేదని తెలిసింది.

ఆ రోజే వెంకన్న విశాఖపట్నం బయల్దేరి వెళ్ళాడు.

## 6

రాఘవరావు హత్య కావించబడిన వారంరోజులకు అతడి కుటుంబం తిరిగివచ్చింది. వాళ్ళెక్కడికి వెళ్ళారో ఏ ఊళ్ళో వున్నారో తెలియక ఇన్స్పెక్టర్ అన్ని రోజులూ శవాన్ని అయిసులో భద్రపరిచి వుంచాడు.

వార్త విని రాఘవరావు భార్య సుందరమ్మ స్పృహ

తప్పి పడిపోయింది. కూతురు అలివేలు ఘొల్లుమంది. కొడుకు చంద్ర బిక్క మొహం వేసుకున్నాడు.

శవం వాళ్ళకు అప్పజెప్పబడింది. దానికి దహన సంస్కారాలు జరిగాయి. అన్ని కార్యక్రమాలూ పూర్తయ్యాక ఇన్స్పెక్టర్ తన ప్రశ్నలు మొదలు పెట్టాడు. రాఘవరావు కుటుంబం ప్రశ్నలకు ఏడుస్తూనే జవాబులిచ్చారు.

పెళ్ళికని వెళ్ళారు. అక్కణ్ణించి కొందరు తిరుపతి వెడుతూంటే తామూ వెళ్ళి వచ్చారు.

ఇంటిల్లపాదీ శశికాంత్‌ని తిట్టిపోశారు. డబ్బుకోసం అతడింత ఘోరానికి తలపడతాడని తామనుకోలేదన్నారు. వారిద్వారా ఇన్స్పెక్టర్‌కు రాఘవరావు వీలునామా చేతికందింది. అందులో లక్షరూపాయలు శశికాంత్ పేరున వ్రాయబడ్డాయి.

రాఘవరావు కుటుంబం పరిస్థితి బాగానే ఉంది. సుమారు పదిలక్షల ఆస్తి వారిది. రాఘవరావు కూతురు అలివేలు శశికాంత్ వర్ణించినంత అందవికారంగానూ లేదు. ఆస్తికోసం కాకపోయినా మామూలుగా కూడా ఆమెను వివాహం చేసుకోనవచ్చు.

"శశికాంత్ కాక వేరే ఎవరిమీదనైనా మీకు అనుమానముందా?" అనడిగాడు ఇన్స్పెక్టర్.

"అసలు శశికాంత్ మీదనే మాకు అనుమానంలేదు. ఆయన దేవుడు. చూస్తూ చూస్తూ ఆయన్ను చంపడానికా దుర్మార్గుడికి చేతులెలాగొచ్చాయో!" అంది సుందరమ్మ.

"అలాకాదు. బాగా ఆలోచించి చెప్పండి. శశికాంత్ నిర్దోషి అనడానికి కూడా కొన్ని సాక్ష్యాధారాలు లభించాయి. హంతకుడు వేరే ఎవరైనా అయితే ఈ

హత్యకు మూలకారణం పగ అయివుండాలి. హంతకుడికి ఒక్క రాఘవరావుగారి మీదనే పగ వున్నదో లేక మొత్తం కుటుంబంమీద పగ వున్నదో మనకు తెలియదు. అందువల్ల మీ అందరికీ కూడా ప్రమాదముండవచ్చు. బాగా ఆలోచించి చెప్పండి....మీ కుటుంబం పైనగానీ రాఘవరావు పైనగానీ — వ్యక్తిగతంగానో, వ్యాపార రీత్యానో పగ ఉన్న వ్యక్తులెవరైనా ఉన్నారా?"

సుందరమ్మ తల అడ్డంగా ఊపింది.

ఇన్స్పెక్టర్ అక్కణ్నించి బయటపడ్డాక దారిలో అతడికి వెంకన్న ఎదురయ్యాడు. జీపు, కారు ఒకదానికొకటి ఎదురుగా ఆగాయి.

"మీరక్కణ్నించే వస్తున్నారా? అయితే నేను మీతోనే వస్తాను. ఇంక వాళ్ళనడిగి తెలుసుకునేవేముంటాయి?" అన్నాడు వెంకన్న.

ఇద్దరూ పోలీసుస్టేషనుకు వెళ్ళారు. ఇన్స్పెక్టర్ వెంకన్నకు రాఘవరావు కుటుంబంతో తన సంభాషణ ఫలితం వివరించాడు.

వెంకన్న నిట్టూర్చి — "హంతకుడు చాలా అదృష్టవంతుడు. అతడి గురించి ఎవ్వరూ సరైన సమాచారం ఇవ్వలేకపోతున్నారు. మనకు చాలాసార్లు దొరికినట్లే దొరికి పారిపోతున్నాడు. నాకు విశాఖపట్నంలో కొంత సమాచారం తెలిసింది. రాఘవరావుమీద పగ వున్న వ్యక్తి ఒకడు అయిదు సంవత్సరాలుగా పిచ్చాసుపత్రిలో ఉంటున్నాడు. కొద్ది నెలల క్రితం అతడు హాస్పిటల్నించి పారిపోయాడు. అతడే హంతకుడని నా అనుమానం. అతడు చాలా తెలివిగా రాఘవరావుని మట్టుబెట్టాడు. ఆ కుటుంబంలో మిగతావారిని కూడా వదలడేమోనని

నా అనుమానం. బహుశా ఏ పనివాడి వేషంలోనే ఆ యింట ప్రవేశిస్తాడేమోనని నా అనుమానం. ముందుగా ఆ కుటుంబాన్ని హెచ్చరించాల్సిన అవసరముంది—" అన్నాడు.

"ఆ పని నేను చేస్తాను...." అన్నాడు ఇన్స్పెక్టర్.

"వద్దు. ఇలాంటి హెచ్చరికలు మామూలు మనుషుల ద్వారా అందడం శ్రేయస్కరం. ఇంతవరకూ హంతకుడికి తన ఆచూకీ మనకు తెలిసిందన్న విషయం తెలియదు. మనం అతడిని చాలా జాగ్రత్తగా టాకిల్ చేయాలి—" అన్నాడు వెంకన్న.

తర్వాత వెంకన్న తనకు తెలిసిన ఓ మనిషి ద్వారా ఆ యింటికి కబురంపించాడు. కబురందిన గంటకు చంద్రం వెంకన్న ఆఫీసుకు వచ్చాడు.

ముందు తానెవరో చెప్పి — "మీ మనిషి కబురు నాకందించాడండి. అది నేను రహస్యంగా అమ్మకు చెప్పేను. ఎందుకంటే పోలీసిన్స్పెక్టర్ అలా వెళ్ళగానే ఇలా మా ఇంటికో మనిషి వొచ్చాడండి. వాడి ముఖం సినిమాల్లో రౌడీలదిలాగుందండి. మా ఇంట్లో పనికావాలన్నాడు' వెంటనే ఒప్పేసుకుందమ్మ. అయితే రేపే వచ్చి పనిలో జేరతానన్నాడు. అందాకా యిల్లు సద్దివెడతానన్నాడు. ఈలోగా మీకబురొచ్చింది. భయం వేసి అమ్మకు రహస్యంగా ఈ కబురందించాను. వాణ్ని ఇంట్లోనే ఎలాగో అలా మరి కాసేపుంచమని అమ్మకు చెప్పి మీ దగ్గరకు బయల్దేరి వచ్చాను—" అన్నాడు చంద్రం.

వెంకన్న లేచాడు. వాళ్ళిద్దరు కార్లో రాఘవరావు యింట్లోకి చేరుకు నేందుకు ఎంతో సేపు పట్టలేదు.

వాళ్ళను చూస్తూ సుందరమ్మ—"ఆయన వెళ్ళిపోయా డండి—" అంది.

"ఆయనెవరు?" అన్నాడు వెంకన్న.

"అదే—మా ఇంట్లో పనికనివచ్చినాయన...." అంది సుందరమ్మ.

"మరి నేను....కాసేపు...." అని చంద్రం ఏదో అనబోయాడు.

"నువ్వేం కేమీ అనొద్దు...." అన్నాడు వెంకన్న. అతడు సుందరమ్మకు జాగ్రత్తలు చెప్పి వెళ్ళిపోయాడు.

## 7

రాజమ్మ, సీతమ్మ చాలా సేపట్నించి ఆ ఫోటోతో కుస్తీపడుతున్నారు. దాన్ని చూసి ఇద్దరూ రకరకాల బొమ్మలు గీస్తున్నారు.

వెంకన్న వంటింటిలోంచి వచ్చి—"ఏం చేశారు?" అన్నాడు.

"బాస్! ఇది చాలా విచిత్రంగా వుంది—" అంది సీతమ్మ.

"ఏమిటి?"

"ఈ ఫోటోకు రకరకాల వేషాలు వేయాలని ప్రయత్నిస్తూంటే ఇందులో రాఘవరావు పోలికలు కనబడుతున్నాయి—" అంది సీతమ్మ.

"వ్వాట్!" ఉలిక్కిపడ్డాడు వెంకన్న. ఒక్కసారి అతడి బుర్రలో ఏదో మెరుపు మెరిసినట్లయింది.

"కానీ — ఈ ఫోటోని మీరు పిచ్చాసుపత్రినుంచి పారిపోయి వచ్చిన వాంతకుడిదని చెప్పినట్లు గుర్తు—" అంది రాజమ్మ.

అందులో అబద్ధమేమీ లేదు. పిచ్చాసుపత్రినుంచి పారి

పోయిన ఆ వ్యక్తి ఫోటో వెంకన్న సంపాదించాడు. అతడే హంతకుడని వెంకన్న నమ్ముతున్నాడు. అందుకని ఆ ఫోటో సీతమ్మకూ, రాజమ్మకూ ఇచ్చాడు. హంతకుడు రకరకాల మారువేషాలతో ఊళ్ళో తిరుగుతూండవచ్చు. ఆ వేషాల నంచనా వేయడానికి రకరకాల బొమ్మలు గీయమని అసిస్టెంట్సుకు చెప్పాడు.

అంటే పిచ్చాసుపత్రినుంచి పారిపోయిన వ్యక్తే రాఘవరావా?

రాఘవరావు మూడు గంటలకు చనిపోయాడు. శశి కాంత్ రాఘవరావుని ఆరుగంటలకు చూశాడు. రెండూ నిజమేనా?

అంటే రాఘవరావు లిద్దరున్నారా?

వెంకన్న పోలీసుస్టేషనుకు వెళ్ళాడు. అతడిచేతిలో ఓ చిన్న రేడియో వుంది. అతడది ఇన్స్పెక్టర్ కు అందించాడు.

"ఏమిటిది?" అన్నాడు ఇన్స్పెక్టరు.

"నేను రోడ్డుమీదికి వెళ్ళి మాట్లాడతాను. నా మాటలు మీరు రేడియోలో వింటారు. కొద్దిరోజులపాటు మీరీ రేడియోను అలా ఆన్ లోనే ఉంచండి. చాలా విశేషాలు తెలుస్తాయి—" అన్నాడు వెంకన్న.

"చట్టరీత్యా ఇది నేరం. మీ మాటలు మరో రేడియో స్టేషనులో కార్యక్రమాలని దెబ్బతీయవచ్చు —" అన్నాడు ఇన్స్పెక్టర్ కంగారుగా.

"అలా కంగారు పడకండి ఇన్స్పెక్టర్. నేను మీకు యిచ్చినది మీడియం వేవ్ రేడియోకాదు. ఎఫ్. ఎమ్. రేడియో. మన రాష్ట్రంలో ఎఫ్.ఎమ్. కార్యక్రమాలేలేవు. అందువల్ల ఏ ఫ్రీక్వెన్సీ వాడుకున్నా పర్వాలేదు. హంత

కుణ్ని రెడ్ హాండెడ్ గా పట్టుకుందుకు ఇది చాలా అవ సరం...." అన్నాడు వెంకన్న.

"మీరిప్పుడేం చేస్తారు?" అన్నాడు యిన్స్పెక్టర్.

"రేడియోలో విని తెలుసుకోండి-" అంటూ బయటకు వడిచాడు వెంకన్న. కారు స్టార్టయిన కొద్ది క్షణాల్లోనే రేడియోలో మాటలు వినబడసాగాయి — "మైడియర్ యిన్స్పెక్టర్! నేనిప్పుడు రాఘవరావు యింటికి వెడు తున్నాను. అక్కడ మైక్రోఫోను ఫిక్స్ చేసి వస్తాను. హంతకుడు మళ్ళీ అక్కడకు వస్తాడు. అందుకని మీరు రేడియోవద్ద అను నిత్యం ఎవర్నో కాపలా ఉంచండి. అతను వచ్చిన సూచనకాగానే క్షణాలమీద వెళ్ళి బంధించండి...."

ఇన్స్పెక్టర్ ఆశ్చర్యంగా అంతా వింటున్నాడు.

కొద్దిక్షణాల్లో వెంకన్నకూ, సుందరమ్మకూ మధ్య సంభాషణ వినబడింది. యిన్స్పెక్టరు శ్రద్ధగా వింటు న్నాడు....

"మిమ్మల్ని చాలా పర్యాయాలు యిబ్బంది పెట్టవలసి వస్తోంది—"

"అయ్యో — యిబ్బంది ఏముందండీ—మా క్షేమం కోరేవారు మీరు...."

"మీవారి కుటుంబం గురించి అత్యవసరమైన సమా చారం కావాలి....మీకు తెలిసివుంటుందని నా నమ్మకం. మీవారికి ఓ అన్న ఉన్నాడు కదూ?"

"అన్న కాదు—తమ్ముడు!" అంది సుందరమ్మ.

"కవలపిల్లల్లో అన్నెవరో, తమ్ముడెవరో చూసి తెలుసుకోవడం చాలా కష్టంగదా—అందుకని అన్న అను కున్నాను...." వెంకన్న ఆగాడు.

"మీరు మా మరిదిని చూశారా, ఎప్పుడు?" సుందరమ్మ కంఠంలో ధ్వనించిన ఆత్రుత ఇంతా అంతా అని చెప్పడం కష్టం.

"మాడ్డం సంగతలా ఉంచండి. అతడికి అన్నగారి మీద అంతులేని పగ వుంది. కారణం?" అన్నాడు వెంకన్న.

సుందరమ్మ నిట్టూర్చింది—"పగ ఉన్నమాట నిజమే! అన్న సంపాదిస్తూంటే తమ్ముడు తగలేస్తూండేవాడు. అదేమనడానికి లేదు. గట్టిగా ఏమైనా అంటే నాన్న యిచ్చింది చెరిసగం చేసేయ్—నా దారిన నేను పోతాను. అనేవాడు. తమ్ముడంటే ఆయనకు పిచ్చి అభిమానం. నిజానికి తండ్రినుంచి ఆయనకు సంక్రమించినదేమీ లేదు. కానీ కొంత డబ్బిచ్చి తమ్ముణ్ని వదిలించుకుంటే అతడు పూర్తిగా చెడిపోతాడని ఆయన భయపడి అతడి ఆగడాలను భరిస్తూ తన అదుపులోనే ఉంచుకున్నారు.

అయితే రానురాను అతడి ఆగడాలు మితిమీరాయి. యింట్లోంచి డబ్బు తగలేయటం సంగతటుంచి పరువు తక్కువ పనులు చాలా చేసేవాడు. ముఖ్యంగా ఆడవాళ్ళ పట్ల అసభ్యంగా ప్రవర్తించడం. ఓసారి కాలేజీ అమ్మాయిల వెంట బడ్డాడని పోలీసులరెస్టు చేసి తీసుకునివెడితే ఆయన వారి కాళ్ళావేళ్ళాపడి ఎలాగో విడిపించి తీసుకుని వచ్చారు.

ఇంట్లో కూడా అతడి ప్రవర్తన బాగుండేది కాదు. వదినగారినన్న గౌరవం లేకుండా నా వంక అదోలా చూసేవాడు. కొన్నాళ్ళు సహించినా చివరకు ఆయనకు చెప్పేశాను. అప్పటికీ ఆయన కోపగించుకోలేదు. తనకు తెలిసిన సైకాలజిస్టుని సంప్రదించారు.

ఆయన నా మరిదిని పరీక్షించి-అతడికి పిచ్చి ఉన్నదని తేల్చారు. ఆ విధంగా అతడు పిచ్చాసుపత్రికి తరలించబడ్డాడు. తనకు పిచ్చిలేదనీ, ఇది అన్నగారు పన్నిన కుట్ర అనీ అతడు అరుస్తూండేవాడు. వారు అన్ని బాధ్యతలూ సైకాలజిస్టు మిత్రుడికి అప్పజెప్పి—తానింక ఆ ఊళ్ళో ఉండలేనని ఇక్కడకు తరలివచ్చారు—"

"చాలా తమాషాగా ఉంది-" అన్నాడు వెంకన్న—"ఇప్పుడతడి పిచ్చి తగ్గి బయటకు వచ్చాడంటారా? యింకా పిచ్చివాడుగానే ఉన్నాడంటారా? యింత తెలివిగా పథకంవేసి హత్యచేసినవాడు పిచ్చివాడంటే నాకు నమ్మకం కలగడం లేదు—"

"అతడిది మామూలు పిచ్చికాదు. అదో రకంపిచ్చి. మనుషుల్ని బాధించడం, నేరాలు చేయడం అతడికి సరదా. ఏం చేసినా ఓ పథకం ప్రకారం చేసేవాడు. పథకాలు చాలా తెలివిగానే ఉంటాయి. కానీ అది తెలివికాదు. పిచ్చి. సైకాలజిస్టు చెప్పేవరకూ మాకా విషయం తెలియలేదు...." అంది సుందరమ్మ.

"విశాఖపట్నంలోని ఆ సైకాలజిస్టు ఎవరో నేను తెలుసుకోవచ్చా?" అనడిగాడు వెంకన్న.

సుందరమ్మ తడబడింది. వెంకన్న నొక్కించడంతో ఆమె సైకాలజిస్టు పేరు, చిరునామా కూడా చెప్పింది.

అప్పుడు వెంకన్న—"ఒక్కసారి మీ యిల్లు సోదా చేయాలి. హంతకుడి ఆచూకీ తెలుసుకునేందుకు ఈ సోదా చాలా అవసరం...." అన్నాడు.

"అంటే శశికాంత్ హంతకుడని మీరు నమ్మడం లేదా?" అంది సుందరమ్మ.

"శశికాంత్ హంతకుడని మీరు నమ్మాలనుకుంటు న్నారా?" ఎదురు ప్రశ్న వేశాడు వెంకన్న. సుందరమ్మ ఏమీ మాట్లాడలేదు. గదుల సోదా పేరు చెప్పి వెంకన్న ఒకో గదీ చూసి—రాఘవరావు పడక గదిలోకి వెళ్ళాక సుందరమ్మను బైట నిలబడమని తను లోపల తలుపులు వేసుకున్నాడు. కూడా తెచ్చిన మైక్రోఫోను ఎవరూ అనుమానించనిచోట జాగ్రత్తగా ఉంచి గది తలుపులు తీసి—"మీ ఇంట్లోంచి నేనేమీ తీసుకుని పోవటంలేదు" అంటూ తన జేబులు బైటకుతీసి చూపించాడు.

"అయ్యో! పేరుమోసిన డిటెక్టివ్‌లు. మిమ్మల్ని నేనెందుకు అనుమానిస్తాను?" అంది సుందరమ్మ నొచ్చుకుంటూ.

"అయితే నేనడిగే ఒక ప్రశ్నకు నొచ్చుకోకుండా జవాబివ్వాలి మీరు. నన్ను మీ సోదరుడిగా భావించి."

"అడగండి...." అంది సుందరమ్మ.

"మీ భర్త, మరిది—ఒకే యింట్లో ఉండేవారు. మీ మరిదికి పాడు బుద్ధులున్నాయి. అతడు మిమ్మల్ని కూడా వక్ర దృష్టితో చూసేవాడు. అటువంటప్పుడు అతడు మిమ్మల్ని మోసంచేసి వశపర్చుకునే అవకాశముంది. అందులోనూ అతడు తెలివిగా పథకాలు వేసేవాడం టున్నారు. అతడు తన అన్నగా నటించి...."

"ఆగండి!" అంది సుందరమ్మ.

"ఆగుతాను. కానీ నా ఉద్దేశ్యంలో తప్పేమీ లేదు. అన్నదమ్ములిద్దరిదీ ఒక్కటే పోలిక. ఆ అవకాశాన్నతడు ఉపయోగించుకున్నాడా, లేదా...."

"తమ్ముడి గురించి ఆయనకు పూర్తిగా తెలుసు. అందుకని ఆయన నాకు కొండ గుర్తులు చెప్పారు.

ఆవేమిటో నేను చెప్పను. అయితే నా మరిది అలాంటి కొన్ని ప్రయత్నాలు చేశాడనీ, వారు చెప్పిన కొండ గుర్తుల సాయంతో నా పవిత్రతను కాపాడుకోగలిగాననీ మాత్రం చెప్పగలను....” అంది సుందరమ్మ.

“నన్ను మన్నించండి. నేర పరిశోధనలో ఒకోసారి కొందరి మనసు కష్టపెట్టవలసి వస్తుంది. అయితే ఒక నిర్దోషి ప్రాణాలు కాపాడబడుతున్నాయంటే—మీరు మనసు కష్టపెట్టుకుంటారనుకోను—” అని అక్కణ్నించి కదిలాడు వెంకన్న.

# 8

“నమస్కారం వీరేశంగారూ—నా పేరు వెంకన్న!”

“ప్లీజ్—కూర్చోండి!” అన్నాడు వీరేశం.

“కూర్చుంటాను. మీమీద ఎన్నో ఆశలు పెట్టుకుని వచ్చాను. మీరు మనుషుల మనస్తత్వాల్ని అర్థంచేసుకుని వారికి సాయపడటమే తప్ప—వారిలోని తప్పుల్ని దాచి వారిని నేరాలకు ప్రోత్సహించరన్న నమ్మకమే నన్ను మీ దగ్గరకు రప్పించింది. నేను డిటెక్టివును. ఓ హత్య కేసు విషయమై పరిశోధిస్తూ ఇక్కడకు వచ్చాను. ఆ కేసు స్వరూపం తేలిపోయే సమాచారం మీ వద్ద వున్నది—” అన్నాడు వెంకన్న కుర్చీలో కూర్చుంటూ.

వీరేశం నిబ్బరంగా వెంకన్న వంక చూసి-“నానుంచి మీరేమాశిస్తున్నారో తెలియదు. కానీ అడగండి. నాకు తెలిసింది మీకు చెబుతాను. హత్యకేసు అంటూంటే ఆశ్చర్యంగా ఉంది—” అన్నాడు.

వెంకన్న క్లుప్తంగా రాఘవరావు హత్య గురించి చెప్పి—“శశికాంత్ అనే అమాయకుడీ కేసులో ఇరుక్కున్నాడు. అతడిని మీరే రక్షించాలి—” అన్నాడు.

"ఎలా?" అన్నాడు వీరేశం.

"రాఘవరావు తమ్ముడి గురించి చెప్పండి. అతడు పిచ్చాసుపత్రినుంచి పారిపోయిన వైనం మీకు తెలిసే వుండాలి...."

వీరేశం సాలోచనగా—"డాక్టరుగా కొన్ని వ్యక్తిగత విషయాలను రహస్యంగా ఉంచవలిసిన బాధ్యత నా మీద ఉంది. ఈ కేసులో మీకు నేను సాయపడ లేనేమో!" అన్నాడు.

"మీరు సాయపడేది నాకు కాదు—ఓ, నిర్భాగ్యుడికి! మీరు సాయపడకపోతే నిష్కారణంగా అతడు ఉరికంబ మెక్కుతాడు...."

"నా కష్టమర్సు రహస్యాలు నేను దాచి ఉంచని పక్షంలో నా వృత్తి కూడా దెబ్బ తింటుంది—" అన్నాడు వీరేశం.

"మీ వృత్తికేవిధమైన దెబ్బ తగలదు. అసలీ కేసులో మీ పేరు బయటకు రాకుండా చూసుకుంటాను...." అన్నాడు వెంకన్న.

వీరేశం రాఘవరావు కథ నెమ్మదిగా చెప్పాడు.

రాఘవరావు, మాధవరావు అన్నదమ్ములు. పెద్దవాడు రాఘవరావు. ఇద్దరికీ చిన్నతనంలోనే తల్లిపోయింది. పెద్దవాడైన రాఘవరావు వివాహం జరిపించి తండ్రి చనిపోయాడు.

మొదట్నుంచీ రాఘవరావుది వక్రబుద్ధి. ఎదుటివాళ్ళను ఏడిపించటంలో అతడు అందెవేసిన చేయి. అదే అతడి జీవిత లక్ష్యం కూడా. వ్యాపార వ్యవహారాలన్నీ రాఘవరావు పేరుమీద మాధవరావే చూసేవాడు. మాధవరావు నెమ్మదస్థుడు. మర్యాదస్థుడు. వీరేశానికి

స్నేహితుడు. అతడు తన ఇబ్బందులన్నీ వీరేశంతో చెప్పుకునేవాడు.

మాధవరావుకు వివాహమైతే కుటుంబంనుంచి విడిపోయి వేరు కాపురం పెడతాడని రాఘవరావు భయం. అందుకని అతడు తెలివిగా ఉపాయం పన్ని మాధవరావుకు వచ్చే సంబంధాలన్నీ చెడగొడుతూండేవాడు. రాఘవరావు చేసే చెడ్డపనులన్నీ మాధవరావే చేస్తున్నట్లు బయటివారికి భ్రమ కలిగించేవాడు. ఆ విధంగా రాఘవరావు కులాసాగా తిరిగేవాడు. అమర్యాదగా ప్రవర్తించేవాడు. చెడ్డ పేరు మాధవరావుకి వచ్చేది. మాధవరావు ఇది కూడా సహించాడు.

రాఘవరావు భార్య సుందరమ్మ వయసులో చాలా అందంగా ఉండేది. రాఘవరావు ఆమె వద్ద చాలా ట్రిక్కులు వేసేవాడు. ఉదయం ఎనిమిదింటికి ఆమెతో కాసేపు సరసాలాడేవాడు. తర్వాత తొమ్మిదింటికి మళ్ళీ వెళ్ళి—"ఈ రోజు తొలిసారిగా నీ భుజం తాకుతూంటే నాకేదోలాగుంది—" అనేవాడు. ఆమె కంగారుపడి—"తొలిసారిగా అంటారేమిటి? ఓ గంట క్రితం వచ్చి వెళ్ళారుగా—" అనగానే—"అయితే ఆ మాధవగాడు వచ్చి ఉంటాడు—" అనేవాడు.

ఈ విధంగా రాఘవరావు కొంతకాలం భార్యకూ, తమ్ముడికీ మనఃస్థిమితం లేకుండా చేశాడు. అయితే అతడి నాటకాన్ని భార్య పసిగట్టేసింది. రాఘవరావుని పసిగట్టడానికి ఆమె కొన్ని కొండ గుర్తు లేర్పరుచుకుంది. అతడు మాధవరావులా నటించినా ఆమె క్షణాలమీద అతడి నాటకాన్ని బయటపెట్టేది. భార్యను మానసికంగా హింసించడం సాధ్యంకాదని తెలిసేక అత

డా మెను శారీరకంగా హింసించడం ఆరంభించాడు. ఆ బాధలనామె భరించలేక ఆఖరికి సిగ్గు విడిచి మరిదికి చెప్పుకుంది.

మాధవరావు వీరేశం దగ్గరకు వచ్చాడు. వీరేశం తను స్వయంగా రంగంలోకి దిగకుండా పరోక్షంగా రాఘవరావుని నీడలా వెన్నంటాడు. రాఘవరావు పిచ్చివాడు కాదు. దుర్మార్గుడు. కొందరు దుర్మార్గుల్ని మానసిక శాస్త్రవేత్తలు బాగుచేయగలరు. కానీ కొందరు దుర్మార్గులకు శిక్ష ఒక్కటే మార్గం. రాఘవరావు రెండో తరహాకు చెందిన మనిషి. పిచ్చి అని పేరు చెప్పి అతడిని పిచ్చాసుపత్రిలో జేర్చడం అతడికి సరైన శిక్ష అని వీరేశం అభిప్రాయపడ్డాడు.

ఈ పథకం మాధవరావుకి ముందు నచ్చలేదు. కానీ అంతకుమించి గత్యంతరం లేదని గ్రహించడానికి ఎంతో సేపు పట్టలేదు.

రాఘవరావు దుర్మార్గుడు. కానీ తెలివైన దుర్మార్గుడు. అతడికి ఉచ్ఛనీచాలు లేవు. వావివరుసలు లేవు. మాధవరావుకు వేరే వివాహావకాశం లేకుండా చేశాడు. అతడు చెడ్డవాడన్న భ్రమ ప్రపంచానికి కలిగించాడు. అయితే మాధవరావతడికి బంగారు గ్రుడ్లు పెట్టే బాతు. అతడినెలా వదులుకోగలడు? అందుకని భార్యను శారీరకంగా హింసించి, మానసికంగా ప్రోత్సహించి మాధవరావు పట్ల ఆకర్షితురాలయ్యేలా చేశాడు. వారిద్దరికీ అనుకూల పరిస్థితులు తనే ఏర్పరిచాడు.

ఆ విధంగా సుందరమ్మ పరిస్థితుల ప్రభావానికి లోనై ఇద్దరన్నదమ్ములతోటీ కాపురం చేసింది. ఆమెకు పుట్టిన బిడ్డలు యెవరి బిడ్డలో ఆమెకూ తెలియదు. మొదట్లో

జుగుప్సాకరంగా అనిపించినా ఆ రకం జీవితానికి ఆమె అలవాటుపడిపోయింది. పిల్లలు పెరిగి పెద్దవారవుతున్నా రాఘవరావులో మార్పు రావడంలేదు. ఆమెకు బెంగగా ఉండేది — ఆ పసి హృదయాలు రాఘవరావు ప్రభావానికి గురికాకుండా తను కాపాడగలనా అని!

ఈ పరిస్థితుల్లో వీరేశం సలహా మాధవరావుకూ, సుందరమ్మకూ అమృత ప్రాయంగా తోచింది.

ఎలాగూ మాధవరావుకు కొంత చెడ్డ పేరుంది. రాఘవరావు తీసిన గోతిలో అతడే పడే ఏర్పాటు చేశాడు మాధవరావు. తాగి తందానాలాడుతూ తను మాధవరావునని చెప్పుకుంటున్న సమయంలో అతడిని మాధవరావు పిచ్చాసుపత్రిలో జేర్పించాడు. ఆ క్షణం నుంచీ రాఘవరావు మాధవరావుగా పిచ్చాసుపత్రిలో ఉన్నాడు. మాధవరావు రాఘవరావుగా సుఖజీవనం చేస్తున్నాడు.

తనకు అగ్నిసాక్షిగా తాళికట్టిన భర్త పిచ్చాసుపత్రిలో ఉన్నందుకు సుందరమ్మ కాస్త బాధపడింది. కానీ సమస్యలు లేని సుఖ జీవనం, పిల్లల భవిష్యత్తు — ఆమెను పరిస్థితులకు రాజీపడేలా చేశాయి. అందులోనూ లోకం దృష్టిలో రాఘవరావే తన భర్త! తనతో ఇప్పుడుంటున్నదీ లోకం దృష్టిలో రాఘవరావే!....

"మొత్తంమీద రాఘవరావు పిచ్చాసుపత్రి నుంచి పారిపోయి తమ్ముడిమీద పగతీర్చుకున్నాడన్నమాట!" అన్నాడు వీరేశం.

"చాలా ఆశ్చర్యంగా ఉంది మీ కథ! కానీ ఎంతో తెలివిగా పథకాలు వేసే రాఘవరావు ఇందులో శశికాంత్‌ని ఇరికించడంలో ఉద్దేశ్యమేమిటో?"

"ఏముంది? తన తమ్ముడు ప్రపన్న తనను పిచ్చాసుపత్రిలో వేసి—తన భార్యతో కులుకుతున్నాడనీ-అందుకు తగ్గ చావు వాడికి లభించిందనీ లోకానికి చెప్పి—మళ్ళీ సుందరమ్మ మెడకు గుదిబండై కూర్చుందామని పథకం వేసి ఉంటాడు. కానీ మీరు తీగెలాగి డొంకంతా కదిపారు. అర్జంటుగా వెళ్ళి ఆ దురాత్ముడిని పట్టించండి. అవసరమైతే నేనూ ముందుకు వస్తాను. తాళికట్టిన భర్త గదా అని ఆ సుందరమ్మ అతడికి సహాకరించే అవకాశం కూడా ఉంది. కానీ అతడి కారణంగా ఆ కుటుంబం సర్వ నాశనమైపోగలదు. ఎలాగో అలా ఆ నీచుణ్ని మీరు బంధించండి...."

వెంకన్న లేచి నిలబడి-"థాంక్యూ డాక్టర్ వీరేశం!" అన్నాడు.

# 9

వెంకన్న ఇంటికి వెళ్ళేసరికి అక్కడ శారద కన బడింది. ఆ ప్రక్కనే శశికాంత్ ఉన్నాడు. అతడు చాలా ఆశ్చర్యపడ్డాడు.

"మీ ఏర్పాటు అద్భుతం సార్! నిన్న రాత్రి పోలీసులు మాధవరావును పట్టుకున్నారు—" అంది రాజమ్మ.

"మాధవరావంటే?" అన్నాడు వెంకన్న.

"రాఘవరావు తమ్ముడు. పిచ్చాసుపత్రినుంచి పారి పోయివచ్చి అన్నను హత్యచేశాడు...." అంది సీతమ్మ.

మాధవరావు ఆ రాత్రి సుందరమ్మను రహస్యంగా కలుసుకుందుకు వెళ్ళాడు. పడక గదిలో వారిద్దరి సంభాషణ పోలీసు స్టేషన్‌లో పలికింది. క్షణాలమీద పోలీసులు వెళ్ళి అతడిని అరెస్టుచేశారు.

డిటెక్టివ్ వెంకన్న ఇచ్చిన వేలిముద్రలతో అతడి వేలిముద్రలు సరిపోయాయి. హత్య ఎలా జరిగిందో వెంకన్న అతడినెలా ట్రేస్ చేశాడో ఇన్స్పెక్టరు చెప్పినపుడు మాధవరావుక్కలిగిన ఆశ్చర్యమింతా అంతా కాదు. అతడు తను చేసిన నేరం ఒప్పుకున్నాడు. పిచ్చాసుపత్రినుంచి పారిపోయి వచ్చి శశికాంత్ ని ట్రాప్ చేసి తెలివిగా అతణ్ని హత్యలో ఇరికించి తర్వాత సుందరమ్మ జీవితంలో ప్రవేశించాలనుకున్నాడుట. కానీ అతడి పథకం ఫలించలేదు. శశికాంత్ ని తనెలా ట్రాప్ చేసిందీ అతడు వివరించాడు. శశికాంత్ అతడి వేషాలు గుర్తుపట్టాడు.

ఆఖరున హంతకుడు రెండు కోరికలు కోరాడు. తను ఎంతో పకడ్బందీగా వేసుకున్న పథకం ఫెయిలవడానికి కారణం ఇద్దరు. ఒకడు శశికాంత్. ఇతడు అమాయకుడు. మంచివాడు. అతణ్ని మోసంచేయాలని అనుకోవటం వల్లనే తనకీ దుర్గతి పట్టింది. రెండోవాడు వెంకన్న. కొడిగుడ్డుకు ఈకలులాగే తెలివితేటలతో, నీటిలో జాడలుతీసే నైపుణ్యంతో వ్యవహారించి తన నేరాన్ని పూర్తిగా బెటపెట్టాడు. ఇలాంటివారున్నారని ప్రచారమయిందంటే నేరస్థులు భయపడక తప్పదు.

ఈ ఇద్దరినీ హంతకుడు కలుసుకోగోరాడు. శశికాంత్ ని అతడు కలుసుకున్నాడు. తన తప్పుకు మన్నించమని వేడుకున్నాడు. ఎందుకంటే వచ్చే జన్మలో ఎవరి ఉసూరు తనకు తగలకూడదట....

వెంకన్నను కలుసుకోవడం కోసం అతడు తహతహలాడుతున్నాడు. ఇది వినగానే అతడిని కలుసుకుని చూడాలని వెంకన్న కూడా తహతహలాడాడు.

వెంకన్న తిన్నగా పోలీస్ స్టేషన్ కు వెళ్ళాడు. అక్కడ

ఇన్స్పెక్టరు అతడికి ఘనస్వాగతం పలికి అభినందనలతో ముంచెత్తి—"శాంతపడు మీతో కొద్ది క్షణాలు మాట్లాడాలని...." అని ఏదో అనబోతూండగా—

"నాకూ తెలుసు....తహతహలాడుతున్నాడు కదా!" అన్నాడు వెంకన్న. తర్వాత అతడు శాంతపడిని కలుసుకున్నాడు.

"డిటెక్టివ్ వెంకన్నగారూ! మీకు నా జోహార్!" అన్నాడు రాఘవరావు. వెంకన్న ఇంకా ఏదో అనబోతూండగానే—

"మీ మేధాశక్తికి అన్నీ తెలిసే ఉంటాయి. చిన్నతనంనుంచి నేనో శాపగ్రస్తుణ్ని. అంతా నా దురదృష్టం. నాదంటూ నాకేమీ మిగలకుండా పోయింది. ఎందుకు బ్రతుకుతున్నానో, నా జీవితానికర్థమేమిటో తెలియకుండానే జీవనం కొనసాగించాను—" అని.

"అదంతా ఇప్పుడెందుకులెండి! మొదట్నుంచీ రాఘవరావుకు మంచి పేరుంది. ప్రపంచంలో అతడికున్న ఆ మంచి పేరును పోగొట్టకండి. పిచ్చాసుపత్రినుంచి పారిపోయి వచ్చిన మాధవరావే రాఘవరావును హత్య చేశాడని అంతా అనుకుంటూంటే మీరు ఖండించకండి. నేను అన్న స్థానంలో ఇక్కడ గడిపిన అయిదు సంవత్సరాలూ నా జీవితంలో మరువలేనివి.

పిచ్చాసుపత్రినుంచి పారిపోయి వచ్చిన నా అన్నయ్య సరాసరి ఇంటికి రాకుండా నా దగ్గర్నుంచి డబ్బు గుంజాలని బ్లాక్ మెయిలింగ్ ప్రారంభిస్తే అతడిని చంపాలని తెగించాను. నా సుఖ సౌఖ్యాలతోపాటు—సుందరమ్మ—ఆమె బిడ్డల భవిష్యత్తు కూడా దృష్టిలో ఉంచుకొని ఆ నిర్ణయానికి వచ్చాను...." అన్నాడతను.

వెంకన్న ఆశ్చర్యంగా—"అయిదేళ్ళుగా ఈ ఊళ్ళో ఉంటున్న రాఘవరావే మరణించాడని నేను నమ్మాను. కానీ అది నిజంగాదన్నమాట....మరణించింది పిచ్చాసుపత్రినుంచి, పారిపోయొచ్చిన రాఘవరావేనన్నమాట!" అన్నాడు. ఇప్పుడు వెంకన్న కళ్ళలో జాలి ఉంది.

"అయిందేదో ఆయిపోయింది—నా విన్నపం గుర్తుంచుకుంటారు కదూ?" అన్నాడతను దీనంగా.

"ఊఁ" అన్నాడు వెంకన్న ఇంకా అతడి వంక జాలిగానే చూస్తూ.

—:ఐ పో యి ం ది:—

# మూడు జతల వేలిముద్రలు

## బొమ్మిడి అచ్చారావు

"హతుడి పేరు కృష్ణప్రసాద్. పెద్ద బిజినెస్ మాగ్నెట్. సిటీలో చాలా కంపెనీల్లో షేర్స్ న్నాయి. తన కృష్ణప్రసాద్ స్పిన్నింగ్ మిల్స్‌కి అతనే మేనేజింగ్ డైరెక్టరు" చెప్పాడు ఇన్స్‌పెక్టర్ శ్రీనివాస్.

డిటెక్టివ్ కిరణ్ తలాడించాడు.

హతుడు చాలా దారుణంగా హత్య చేయబడ్డాడు. తల నుజ్జు నుజ్జు అయిపోయింది. రక్తం ముఖంమీదుగా ధారలుకట్టి మనిషి పోలిక తెలియటంలేదు. ఫోంబెడ్ నిండా నెత్తురు మంచంమీద, కిందా ఎక్కడ చూసినా నెత్తురుమయం.

ఏదో బలమైన ఇనుపరాడ్ వంటి ఆయుధంతో తల మీద బాగా మోది మోది ప్రాణం తీశాడు హంతకుడు. హతుడిమీద ఎంతో కసి, తీరని పగ ఉండివుటాయని పిస్తుంది, శవాన్ని చూసిన ప్రతివారికీ. అంత ఘోరంగా చంపాడు.

డిటెక్టివ్ కిరణ్ శవంమీదనుంచి దృష్టిని తప్పించి, గదిలోని వస్తువులను పరిశీలించటం మొదలు పెట్టాడు.

అది డబుల్ రూం. పొడవు వెడల్పులు సమానంగా వున్న గది. గదిలో డబుల్ కాట్, ఆరున్నర అడుగుల గాడ్రెజ్ బీరువా, డ్రస్సింగ్ టేబిల్ మూడు పక్కలా అమర్చి వున్నాయి. గోడలకు ఖరీదైన ఆయిలు పెయింటింగ్స్ వున్నాయి. ఆ గది కృష్ణప్రసాద్ వైభవాన్ని చాటిచెపుతోంది.

కిరణ్ మంచం సమీపించి మంచం చుట్టూ పరిశీలనగా చూశాడు. అతని కళ్లు మెరిశాయి. మంచం పక్కన దూది స్వాబ్ కనిపించింది.

తీసిచూశాడు. తియ్యటి వాసనవేస్తోంది.

అది క్లోరోఫాం అద్దిన దూది. అంటే హతుడిని స్పృహ తప్పించి చంపారన్నమాట.

కిరణ్ సాలోచనగా తలూపాడు.

హతుడి చేతిన వాచీ వుంది. నిద్రపోయేటప్పుడు కూడా చేతినుంచి తియ్యడులా వుంది. ఖరీదైన యింపోర్టెడ్ సీకోవాచీ. పై అద్దం పగిలిపోయి వుంది.

కిరణ్ వాచీలోకి పరీక్షగా చూశాడు. రెండుగంటల పది నిమిషాలు చూపిస్తోంది. ఆగిపోయింది.

"హత్య రెండుగంటల తర్వాత జరిగి ఉంటుంది. వాచీమీద కూడా దెబ్బపడింది. అందుకే ఆగిపోయింది" అన్నాడు కిరణ్ శ్రీనివాస్‌తో.

శ్రీనివాస్ తలూపాడు.

కిరణ్ హత్యాయుధం కోసం పరిశీలనగా చూశాడు. అటువంటిది ఏదీ గదిలో క ని పిం చ లే దు. బహుశా హంతకుడు ఆ విషయంలో జాగ్రత్తపడివుంటాడు. వేలి

ముద్రలు దొరికిపోతాయని భయపడివుంటాడు.

వేలిముద్రల నిపుణుడు, ఫోటోగ్రాఫరు తమ పనులు చేసుకుపోతున్నారు.

కిరణ్ గది పరిశీలన పూర్తిచేశాడు.

"డబ్బుపోయిందని మీకు రిపోర్టు చేశారా?" అడిగాడు కిరణ్ శ్రీనివాస్‌ని.

"పోయి వుంటుందన్నారేగాని, పోయిందని ఖచ్చితంగా చెప్పలేదు."

"మొదటిసారిగా హతుణ్ని ఎవరు చూశారట? ఇతను చనిపోయిన సంగతి ఎవరు కన్ఫర్మ్ చేశారు?"

"ఈయన చిన్న కూతురు—లత చెప్పారు."

"ఎంతమంది కూతుళ్ళు యీయనకు?"

"వివరాలు నేను యింకా సేకరించలేదు. లతగార్ని పిలిపిస్తాను."

శ్రీనివాస్ సార్జంట్‌ని పంపాడు.

ఓ అయిదు నిమిషాల తర్వాత ఓ యిరవయ్యేళ్ళ అమ్మాయిని వెంటబెట్టుకొని వచ్చాడు సార్జెంట్.

## 2

కిరణ్ ఆమెవంక పరిశీలనగా చూశాడు. ఏడ్చి ఏడ్చి ఆమె కళ్ళు వాచిపోయాయి. ఎర్రటిజీరలు కనిపిస్తోన్నాయి.

ఆమె లోపలికి వచ్చి యిరువురికీ నమస్కరించి నిల్చొంది.

కిరణ్ అడిగాడు. "మీ రేనా లత?"

"అవునండి. కృష్ణప్రసాద్ గారు మా నాన్న."

"మీరు ఎందరు అక్కచెల్లెళ్ళు. అన్నదమ్ములు?"

"అయిదుగురు అక్కచెల్లెళ్ళం. నలుగురు అన్నదమ్ములు."

"ఆడవాళ్ళు అందరూ మీకన్న పెద్దవాళ్ళేనా?"

"అవునండి. నలుగురికీ పెళ్ళిళ్ళు కూడా అయిపోయాయి. ఓ అక్క లోకల్‌గానే వుంది. తక్కిన ముగ్గురు బయిటి ఊళ్ళలో వుంటున్నారు. అందరికీ టెలిగ్రాం యిచ్చాం—"

"నలుగురు అన్నదమ్ములన్నారు. ఏం చేస్తున్నారు వాళ్ళు?"

"ఇద్దరికి పెళ్ళిళ్ళు అయిపోయాయండి. పెద్దన్నయ్య లోకల్‌గానే ఉంటున్నాడు. రెండో అన్నయ్య సివిల్ యింజినీరుగా నాగార్జునసాగర్‌లో ఉంటున్నాడు. తరువాతి అన్నయ్య ఢిల్లీ యూనివర్శిటీలో ఆర్కియాలజీలో డిప్లొమా చదువుతున్నాడు. నాలుగోవాడు యిక్కడే వుండి నాన్నగారితో బిజినెస్ చూసుకుంటున్నాడు" అన్నది లత.

"మీరు కూడా చదువుకుంటున్నారా?"

"అవునండి. బియ్యే ఫైనల్."

"మీ అమ్మగారెక్కడ?"

"లేదండి, పోయారు—నా చిన్నప్పుడే."

"ఆ యింట్లో ప్రస్తుతం వుంటున్నది ఎవరెవరు?"

"నేను, మా చిన్నన్నయ్య, మా నాన్నగారు ముగ్గురమేనండి. లోకల్‌గా ఉన్న అన్నయ్య, అక్కయ్య అప్పుడప్పుడు వచ్చి పోతుంటారు. ప్రస్తుతం యిప్పుడు యింటిలోనే వున్నారు" ఆమె ఓ క్షణం ఆగింది.

"బయటి వాళ్ళు—అంటే, నౌకర్లు చాకర్లు వగైరా."

"ఓ వంటామె, యిద్దరు పనివాళ్ళు, ఓ తోటమాలి మొత్తం నలుగురున్నారండి."

"వాళ్ళు నలుగురు నమ్మకస్తులేనా?"

"నమ్మక సుతేనండి!"

"రాత్రి మీ నాన్నగార్ని చివరిసారిగా మీరు ఎన్ని గంటలకు చూశారు?"

"పదిన్నరకు నాన్నగారికి టాబ్లెట్లు యిచ్చి వేసుకోమని చెప్పి వచ్చానండి. 'అక్కడ పెట్టి వెళ్ళమ్మా!' అన్నారండి. ఏదో పుస్తకం చదువుతున్నారు. పెట్టేసి ఓసారి హెచ్చరించి వచ్చేశాను. ఆ తర్వాత పదకొండు గంటలకి ఆయన గదిలో లైటు ఆర్పెయటం నేను గమనించానండి" చెప్పింది.

"నిన్న మీ నాన్నగారితో యెవరెవరు కలిసి మాట్లాడారో చెప్పగలరా?"

"నేను ఉదయం పదిగంటలకి కాలేజికి వెళ్ళి మళ్ళీ సాయంత్రమే తిరిగివస్తానండి. ఈమధ్య ఈయన్ని యెవరెవరు కలుస్తారో నాకు తెలీదు. నాన్నగారు కూడా ఉదయం తొమ్మిదికిముందే ఫ్యాక్టరీకి వెళ్ళిపోతారు. మళ్ళీ సాయంత్రం నేను వచ్చాకనే వస్తారు, అంటే అయిదుగంటలు దాటాక. సాధారణంగా ఆయన ఎవర్నీ యింటికి రప్పించరు. వీలయినంతవరకు ఫ్యాక్టరీలోనే పనులు పూర్తిచేసుకొంటారు. ఒకవేళ యెప్పుడైనా వచ్చినా అకౌంటెంటు ఒక్కరు వచ్చి పోతుంటాడు."

"నిన్న సాయంత్రం అతడేమైనా వచ్చాడా?"

"లేదండి."

"మీ నాన్నగారికి శత్రువులెవరైనా వున్నారా?"

"అబ్బెబ్బె, ఆయన గంగిగోవులాంటివారు. శత్రువులు లేదుగదా, ఆయన గురించి చిన్న చెడు మాట కూడా ఎవరూ చెప్పరు."

"నిన్న రాత్రి ఆయన గదినుండి కేకలుగాని, శబ్దాలు

గాని ఏమైనా వినిపించాయా?"

"ఏమీ వినిపించలేదండి."

"మీ నాన్నగారు పోయిన విషయం ముందుగా యెవరు తెలుసుకున్నారు?—ఐమీన్ చూశారు?"

"నేనేనండి. నాన్నగారు సాధారణంగా ఉదయం అయిదు గంటలకే నిద్రలేస్తారు. ఆరు గంటలు దాటినా నిద్ర లేవకపోవటంతో చూద్దామని ఆయన గదిలోకి వెళ్ళాను. తలుపులు బార్లా తీసేవున్నాయి. అదిరే గుండెలతో లోపలికి తొంగి చూశాను. నాన్నగారు నెత్తుటి మడుగులో వున్నారు. షాక్ తిన్నాను. కాసేపటి వరకు తేరుకోలేదు. తర్వాత పిచ్చికేక వేశాను. మా అక్క, బావ, చిన్నన్నయ్య, వంటమనిషి, నౌకర్లు పరుగెత్తుకొచ్చారు. ఎవరికీ నోట మాటరాలేదు. కాసేపటి తార్వాత నేనే తెలివి తెచ్చుకొని పోలీసులకి తెలియచేశాను ఫోన్లో."

"మీ అక్క, బావ అప్పటికే మీ యింటికి వచ్చి వున్నారా?"

"అవునండి. అంతక్రితమే రెండు రోజులుగా వచ్చి వున్నారు.

"నౌకర్లు మీ యింటిలో రాత్రిళ్ళు ఉండిపోతారా?"

"ఓ ముసలి నౌకరు ఉండిపోతాడు. మరో నౌకరు రాత్రి పదిగంటలకి పోయి ఉదయం అయిదు గంటలకి వస్తాడు. వంటమనిషి తెల్లారుఝామున వచ్చి బాయిలర్ అంటిస్తుంది."

"నౌఖర్లు మీ నాన్నగారి గదిలోకి తరచు వెళ్తుంటారా? అంటే గది వూడ్చటానికిగాని, కాఫీల

ఫలహారాలు అందించటానికి గాని, మరేదయినా పనిమీద గాని...."

"వెళ్తుంటారండి. ముసలి నౌఖరు వెంకన్న చాలా తరచుగా నాన్నగారి గదికి వెళ్ళి ఆయన అవసరాలు చూస్తూంటాడు. అతనికి మా నాన్నగారిమీద చాలా భక్తి, విశ్వాసమూను. అలాగే మా నాన్నగారికి వెంకన్న పట్ల చాలా నమ్మకం అభిమానమును. మా నాన్నగారు పోయినందుకు మా అందరికంటెకూడా వెంకన్న గుండెలు పగిలేలా ఏడుస్తున్నాడు."

కిరణ్ రెండు క్షణాలు మౌనంగా వుండిపోయాడు.

"ఈమధ్య కాలంలో మీ నాన్నగారికి, మీ కుటుంబ సభ్యులతో యెవరితోనైనా తరచు వాగ్వివాదాలు, ఘర్షణలు జరిగాయేమో గుర్తుచేసుకు చెప్పండి."

లత రెండు నిమిషాలు ఏదో ఆలోచిస్తూ వుండిపోయింది.

"అలాంటిదేమీ లేదండి" అన్నది.

"మీ నాన్నగారు ఏ బ్రాండ్ సిగరెట్లు తాగుతారు?"

"నాన్నగారు సిగిరెట్లు తాగరండి. రాయల్ సిగార్స్ సింగపూర్ నించి తెప్పించి ఉంచుకుంటారు. అవే కాలుస్తారు."

కిరణ్ తల తిప్పి శ్రీనివాస్ వంక భావయుక్తంగా చూశాడు.

శ్రీనివాస్ తలపంకించాడు. కృష్ణప్రసాద్ గారి టేబిలుమీదున్న యింపోర్టెడ్ సిగిరెట్టు పాకెట్‌ని కిరణ్ శ్రీనివాస్‌కిచ్చాడు ఇందాక. అది ఇరవై సిగరెట్లుప్యాక్. ఎస్పైర్ బ్రాండ్.

కిరణ్ లత వంక తిరిగి అడిగాడు.

"డబ్బేమయినా పోయిందేమో చూసుకున్నారా?"

"లేదండి. ఇందాక యిన్స్పెక్టరుగారు కూడా యిదే మాట అడిగితే పోయివుండచ్చునని చెప్పాను. మీరు వచ్చాక బీరువా తెరవవచ్చని ఏ వస్తువూ ముట్టలేదు."

"తాళాలు ఎక్కడున్నాయి?" అడిగాడు కిరణ్ లతని.

"సాధారణంగా మా నాన్నగారి దిండుకింద నే పెట్టు కుంటారు" అంది లత.

కిరణ్ కృష్ణప్రసాద్ మంచం సమీపించి దిండుకింద వెతికాడు. తాళాలున్న స్పర్శ తగిలింది. వేలిముద్రల నిపుణుడి వంక చూశాడు కిరణ్. నిపుణుడు ముందు కొచ్చాడు.

దిండుకింది తాళాలు కర్చీఫ్ వేసి బయిటికి తీశాడు కిరణ్. నిపుణుడు తన పని పూర్తిచేశాక లత చేతికిచ్చి "తియ్యండి బీరువా" అన్నాడు.

లత అంతవరకు బిగబట్టుకున్న దుఃఖం తండ్రి ముఖం చూస్తూనే పెల్లుబికింది. తండ్రి గదిలో నిలబడాలంటేనే ఆమెకు విపరీతమైన శోకంతో మనసంతా నిండిపో తోంది.

తననితను నిగ్రహించుకుని తాళాలు అందుకుంది. బీరువా సమీపించింది.

"ఒక్క నిమిషం, ఆగండి!" అని లతని వారించి వేలిముద్రల నిపుణుడితో "హేండిల్ మీద ముద్రలు సేకరించారా?" అనడిగాడు కిరణ్.

"ఎస్సార్! ఏమీ లేవు. తుడిచేశారు" అన్నాడు నిపుణుడు.

"ఆల్ రైట్. ఇప్పుడు తెరవండి. లోపలి అరలు ఏవీ తాకకండి" ముందుగానే హెచ్చరించాడు కిరణ్.

లత తాళాలు తెరిచింది.

కిరణ్ వేలిముద్రల నిపుణుడికి సైగ చేసి, "లోపలి అరమీద ఏమైనా ముద్రలు దొరకొచ్చు, సేకరించండి" అన్నాడు.

అర బయట, లోపల నిపుణుడు వేలిముద్రలకోసం పౌడరు చల్లి ట్రేస్ తీశాడు.

లత లోపల రహస్య అర తెరుస్తూనే అదిరిపడి "ఇందులో పదిహేనువేల రూపాయల నగదు, డైమండ్ నెక్లెసు, చంద్రహారం, బంగారు గాజులు నాలుగు జతలు వుండాలి. అవి మాయమయినాయి" అని అరిచింది.

కిరణ్ శ్రీనివాస్‌కి సైగచేశాడు. శ్రీనివాస్ అంతా వెతికి లేదని నిర్ధారణ చేసుకుని, "ఇందులో ఏ విధమైన వస్తువులుగాని, కేష్‌గాని లేవు" అన్నాడు.

కిరణ్ లతవంక తిరిగి, "అందులో కేష్ సరిగ్గా పదిహేనువేలే ఉండాలని ఎలా చెప్పగలరు? ఇంకా హెచ్చుతగ్గులుండచ్చు కదా!?" అనడిగాడు.

"ఆ డబ్బు నిన్న నాన్నగారు బ్యాంక్‌నించి డ్రా చేసి తెచ్చి లోపల పెట్టమని నాకే యిచ్చారు. నేనే ఆ డబ్బు బీరువాలో దాచాను, నిన్న సాయంత్రం. ఆ నెక్లెసు, చంద్రహారం, గాజులు యిదిగో యీ పక్క ముఖమల్ పెట్టెలో వుండటం నేను చూశాను. అవి నా పెళ్ళికోసమని చేయించారు. ఇప్పుడు ఆ పెట్టెతో సహా మాయమయ్యాయి" అన్నది లత.

ఆమె చిగురాకులా వణికిపోతోంది. ఓ పక్క తండ్రి మరణం, మరోపక్క బంగారు నగలు, నగదు పోవటం

ఆమె విచారాన్ని ద్విగుణీకృతం చేస్తున్నాయి.

"ఆల్ రైట్! చోరీ జరిగిన విషయం పోయిన వస్తువులు నగదు గురించిన వివరాలు ఓ కాగితంమీద రిపోర్టు రాసి యివ్వండి" అన్నాడు శ్రీనివాస్ ఓ కాగితం, పెన్ను ఆమెకందిస్తూ.

ఈలోపల కిరణ్ మరోసారి హాతుడి పరిసరాల్ని పరిశీలించటం సాగించాడు. ఈసారి అతని శ్రమ ఫలించింది. మంచంకాళ్ళ భాగంవైపు ఏదో మెరుస్తూ కనిపించింది. మోకాళ్ళమీద వంగితీశాడు.

అది చెవి జూకా. మంచి ముత్యాలు పొదగబడి వున్నాయి.

కిరణ్ జూకాని లతకి చూపి, "ఇది ఎవరిదో చెప్పగలరా?" అనడిగాడు.

లత ఆ జూకా చూసి కాస్త తటపటాయించింది. కాస్సేపాగి. "ఇలాంటి జూకాలు మా సరళ అక్కకి ఉండాలి" అన్నది.

"సరళగారు మీ ఎన్నో అక్క?" అడిగాడు.

"మూడో అక్క. ఇక్కడే లోకల్‌గా వుంటున్నారని చెప్పానుకదండీ! మా బావ ఈ ఊళ్ళోనే స్టెయిన్‌లెస్ స్టీల్ షాపు, ఫర్నిచర్ షాపు నడుపుతున్నారు. ఆయన, మా అక్క రెండు రోజులక్రితం యిక్కడికీ వచ్చారు" అన్నది లత.

శ్రీనివాస్ తన జేబునుండి ఎస్క్వైర్ సిగిరెట్ పాకెట్ తీసి ఆమెకు చూపించి "ఈ బ్రాండ్ సిగరెట్లు యీ యింట్లో ఎవరైనా కాలుస్తారా?" అనడిగాడు.

లత సిగరెట్టు పాకెని చూసి, "మా బావ రవి ఇలాంటి బ్రాండ్ సిగిరెట్లు తాగుతారు" అన్నది.

"మంచిదమ్మా! చాలా సంగతులు చెప్పావు. మా పరిశోధనకి చాలా ఉపకరించే విషయాలు చెప్పావు. ప్రస్తుతం ఈ ఇంట్లో వున్న మీ బంధువులని మాకు వరసగా పరిచయం చెయ్యి. ఓసారి మాట్లాడివెళ్తాం" అన్నాడు కిరణ్.

"రండి" అంటూ లత హాల్లోకి దారితీసింది.

కిరణ్, శ్రీనివాస్ అనుసరించారు.

హాల్లో చాలామంది ఉన్నారు. కొందరు సోఫాల్లోను కుర్చీల్లోను కూచుని వున్నారు. పనివాళ్ళలా వున్న కొంత మంది నించుని వున్నారు.

లత ఓ ముప్ఫయిఅయిదేళ్ళ వ్యక్తిని చూపించి, "వీరే మా బావ రవి. ఈమె మా అక్క సరళ. ఇదిగో, వీడు మా మురళి అన్నయ్య. మా నాన్నగారితో బాటు బిజినెస్ చూసుకుంటున్నాడు. ఇతను మా పెద్దన్నయ్య శేఖరం. మెయిన్ రోడ్లో పెద్ద క్లాత్ స్టోర్సు వుంది. ఈమె మా వదిన లలిత. ప్రస్తుతం మా యింటవున్నవాళ్ళు వీళ్ళే! ఇంకా వంటమనిషి తాయారు, పనివాళ్ళు వెంకన్న రంగా, తోటమాలి సైదులు వున్నారు" అన్నది.

కిరణ్ తలూపి, "నిన్న అంటే మీ నాన్నగారి హత్య జరిగిన సమయంలో వీరందరూ మీ యింట వున్నారు కదూ" అనడిగాడు.

"మా శేఖరం అన్నయ్య, వదిన, రంగా, తాయారు, సైదులు తప్ప తక్కినవాళ్ళున్నారండి."

"ఓ.కే. ముందు మీ బావగార్ని కొన్ని ప్రశ్నలు అడగాలి. ముందు వరండాలోకి పంపించండి" అంటూ కిరణ్ దారితీశాడు. శ్రీనివాస్ ఓసారి హాల్లోని తక్కిన జనాన్ని పోలీసు కళ్ళతో పరిశీలించాడు.

లత అతని మనోగతాన్ని గ్రహించినదానిలా, "వాళ్ళంతా ఇరుగుపొరుగువాళ్ళు, నాన్నగారి ఫాక్టరీలో పనిచేస్తున్న స్టాఫ్, వర్కర్సునండీ! పరామర్శకు వచ్చారు" అన్నది.

శ్రీనివాస్ తలూపాడు.

## 3

"మీ పేరు?"

"రవిచంద్ర. కృష్ణప్రసాద్ గారు మా మామ."

"అంటే, పిల్లనిచ్చిన మామా లేక మేనమామ...."

"అబ్బే, పెళ్ళికి ముందు మాకు బాంధవ్యంలేదండి."

"మీరేం చేస్తూంటారు?"

"స్టెయిన్ లెస్ స్టీలు షాపు, ఫర్నిచర్ షాపు నడుపుతున్నానండి. పెద్ద మార్కెట్ పక్కవీధిలో మా రెండు షాపులు పక్కపక్కనే వున్నాయండి."

"అలాగా! నిన్న రాత్రి చివరిసారిగా, అంటే, మీ మామగారు బతికుండగా ఎప్పుడు చూశారు?"

"రాత్రి ఎనిమిది గంటలకు మా మరదలు లత పెళ్ళి విషయం మాట్లాడటానికి పిలిస్తే ఆయిన గదికి వెళ్ళానండి. తొమ్మిదీ పదిహేనువరకు మాట్లాడి నా గదికి వచ్చేశాను."

"ఆ సమయంలో మీ భార్య మీతో వున్నారా?"

"ఆమె, లత హాల్లో ఏదో మాట్లాడుకుంటువున్నారండి. ఆడవాళ్ళకి తెలియకూడని విషయాలుంటాయని నన్ను ఒక్కడినే పిలిచారు మా మామగారు."

"తర్వాత ఆయన గదిలోనుండి, ఏమైనా శబ్దాలుగాని మీ మామగారి ఆక్రందనగానీ ఏమైనా వినిపించాయా?"

"లేదండి. పదిగంటలకి నేను నిద్రపోయాను. ఉదయం లత అరుపులతో మెలకువ వచ్చింది. అప్పటికి బాగా

తెల్లవారిపోయింది. ఆరు దాటిందనుకుంటాను."

"మీ కెవరిమీదనైనా అనుమానముందా?"

"అబ్బే, లేదండి. యెవడో డబ్బు కోసం యీ పని చేసి వుంటాడని నా అభిప్రాయం."

"ఐ. సీ. నిన్న బ్యాంకునుండి ఏమైనా డ్రా చేసి తెచ్చారా?"

"ఏమో నాకు తెలీదండి."

శ్రీనివాస్ జేబులోంచి సిగరెట్ ప్యాకెట్ తీసి, "ప్లీజ్ హేవిట్!" అన్నాడు, తను ఓ సిగిరెట్టు తీసి నోట్లో పెట్టుకుంటూ.

రవిచంద్ర ఒక్క క్షణం తొట్రుపడి సర్దుకోవటం కిరణ్ దృష్టినుంచి దాటిపోలేదు.

"నో థాంక్స్! నా బ్రాండ్ వేరే" అంటూ గోల్డు ఫ్లేక్ తీసి సిగరెట్టు నోట పెట్టుకున్నాడు రవిచంద్ర.

"ఒ. కే. మీరు వెళ్ళి మీ మిసెస్‌ని పంపించండి" అన్నాడు శ్రీనివాస్.

రవిచంద్ర వెళ్ళగానే నోట్లోని సిగరెట్టు తీసి ప్యాకెట్లో పెట్టేస్తూ, "ఏమిటి బ్రదర్, గురుడు ప్లేటు ఫిరాయించేశాడు?! అసలు యీ బ్రాండే తనది కాదంటున్నాడు! లత చూడబోతే యిలాంటి సిగరెట్లు మా బావ కాలుస్తాడంది. ఏమిటి మతలబు?" అన్నాడు శ్రీనివాస్.

కిరణ్ సాలోచనగా తలాడించాడు.

"రవిచంద్ర కావాలనే అబద్ధమాడుతున్నాడు. తన బ్రాండ్ కూడా మార్చేసుకుని మనకి దొరక్కుండా జాగ్రత్త పడుతున్నాడంటే యిందులో ఏదో రహస్యముంది."

"రవిచంద్రే ఈ హత్య చేశాడేమో?"

"ఎలా చెప్పగలవు?"

"ఏవో గృహకలహాలుండివుంటాయి. మామగారు డబ్బివ్వనన్నారేమో! వ్యాపారం కోసం అడిగివుంటాడు. కాదన్నాడు. చంపేసి డబ్బు నగలు చేజిక్కించుకున్నాడు. ఆ సమయంలో అతని సిగరెట్టుపాక్ జేబు నుంచి జారిపడిపోయుంటుంది. మనకి అది దొరికిపోవటం గమనించి తనమీదికి అనుమానం రాకుండా బ్రాండ్ మార్చేశాడు!"

"నిజంగా అదే కారణమయితే అతను బ్రాండ్ మార్చాల్సిన పనేలేదు. ఎందుకంటే నిన్న రాత్రి ఎనిమిది గంటలకు అతను మామగారి గదికి వెళ్ళానని చెప్తున్నాడు కదా! మామగారితో మాట్లాడే సమయంలో ప్యాకెట్టు జారిపోయి వుండవచ్చుకదా! సిగరెట్టుప్యాకెట్టు హతుడి గదిలో వున్నంత మాత్రాన రవిచంద్రే హంతకుడని ఎలా చెప్పగలవు?" ప్రశ్నించాడు కిరణ్.

శ్రీనివాస్ తికమకపడ్డాడు.

అతను ఏదో చెప్పబోయేంతలో రవిచంద్ర భార్య సరళ గదిలోకి వచ్చింది.

"అలా కూచోండి" అన్నాడు కిరణ్ ఆమె వంక పరిశీలనగా చూస్తూ. ఆమె బిడియపడింది.

"కూచోండమ్మా! మిమ్మల్ని కొన్ని ప్రశ్నలడగాల్సి పిలిచాం. మీ నాన్నగారి హత్య విషయంలో మీకు ఎవరిమీదనైనా అనుమానం వుందా?" అడిగాడు కిరణ్.

ఆమె వెంటనే సమాధానం చెప్పలేదు. ఏడ్చి ఏడ్చి ఆమె కళ్ళు వాచిపోయి వున్నట్టు—బాగా నీరసపడిపోయింది. సన్నటి ఆమె మరింత బలహీనంగా వున్నట్టు

కనిపిస్తోంది. ఏదో చెప్పాలని నోరు తెరిచి మళ్ళీ ఆగి పోయింది.

"చెప్పండి. ఫరవాలేదు."

"నాకయితే ఎవరిమీదా అనుమానం లేదండి. ఇంట్లో వున్నది నలుగురం. పైవాళ్ళెవరూ లేరు. బయటినుంచి ఎవరో వచ్చి యీ అఘాయిత్యం చేసిపోయాడని నా అనుమానం."

"నిన్న మీ నాన్నగార్ని బతికుండగా ఆఖరుసారిగా ఎన్ని గంటలకు చూశారు?"

"సాయంత్రం నాన్నగారు స్పిన్నింగ్ మిల్స్‌నించి వస్తూ నన్ను పలకరించి మేడమీదికి వెళ్ళిపోయారండి. ఆ తర్వాత నేను మళ్ళీ ఆయన్ని చూడలేదు. ఉదయం లత కేకలకి పరుగెత్తికెళ్ళి చూశాం నేను, మావారు, నౌఖర్లు. నాన్నగారి శవం కనిపించింది."

"అయితే నిన్న మీరు ఆయన గదికి పోలేదన్న మాట!"

"లేదండి."

"మీ చెల్లెలు లతగారికి మీ నాన్నగారు ఏమైనా పెళ్ళి సంబంధాలు చూశారా? ఆ విషయం మీతో చర్చించాలని మీవార్ని పిలిపించారా?"

"మా చెల్లెలుది ప్రేమ వివాహం జరగబోతోంది— తను కోరుకున్న సురేష్‌తో—సురేష్ దాని క్లాసుమేటు. నాన్నగారికి కూడా ఈ విషయం తెలుసు. ఇందుగురించి ఇక మాతో చర్చించాల్సినదేమీ లేదు."

"అలాగా! మీవారికి సిగరెట్లు తాగే అలవాటుందా?"

"ఉందండి."

"ఏ బ్రాండ్ తాగుతారో మీకు తెలుసా?"

"ఫారిన్ బ్రాండ్ ఏవో తాగుతారు. పేరు నాకు తెలియదండి."

కిరణ్ శ్రీనివాస్ వంక అర్థవంతంగా చూశాడు.

శ్రీనివాస్ జేబునుండి పాకెట్ తీసి చూపించాడు. అటువంటివేనని చెప్పింది సరళ.

"మీ నాన్నగారు మీ కోసం బంగారు వస్తువు లేవైనా చేయించారా?"

"నాకోసం ఏం చేయలేదండి. మా లత కోసం చంద్రహారం, నెక్లెసు, గాజులు చేయించారు. అది దాని పెళ్ళినాటికి ప్రజెంట్ చెయ్యాలని దాచారు."

"మీ రెండో చెవి రింగుకి ఉండాల్సిన జూకాలేదు. ఎక్కడైనా పారేసుకున్నారా?"

"అరె, బాగానే చెప్పారే! నేనూ యిందాకనే చూసుకున్నాను. ఎప్పుడు పడిపోయిందో తెలీదు."

"ఇదేనేమో చూసి చెప్పండి!" కిరణ్ జేబులోనుండి జూకా తీసి ఆమె ముందుంచాడు.

"అవునండి, ఇదే! మీ కెక్కడ దొరికింది?"

"ఇది మీ నాన్నగారి గదిలో మంచంకింద దొరికింది."

"అలాగా! ఎప్పుడు పడిపోయిందో?"

"మరి మీరు నిన్న మీ నాన్నగారి గదికే పోలేదు కదా, యిది అక్కడెలా పడిపోయి వుంది?"

సరళ తెల్లబోయినట్టు చూసింది కిరణ్ వంక.

## 4

"నా పేరు వెంకన్నంటారు బాబూ!"

"ఈ యింటిలో ఎన్నాళ్ళుగా వుంటున్నావు?"

"అబ్బో, శానా ఏళ్ళయింది బాబూ! సరిగా గుర్తు లేదుగాని, ఓ పాతికేళ్ళవుద్దండి. నేనీ యింటిలో పెళ్ళి

సించిన్నాటికి మా పెదబాబు— సేకరంగారు లేదండీ, ఆరే పెదబాబంటే—యింత పిల్లోడండి."

"ఊఁ! నీకు భార్యా పిల్లలున్నారా?"

"నా రత్తాలు పోయి పదేళ్ళయినాది బాబూ! నాకు పిల్లల్లేరండి. ఇక్కడే ఈ ఇంటిలో మనిసిలాగే బతుకు తున్నాను బాబూ! యీరిదే ఆ కాంపౌండు కానుకుని వున్న అవుటు అవుస్‌లో వుంటున్నానండి."

"నిన్న రాత్రి ఎక్కడ పడుకున్నావు?"

"ఆ ఇంట్లోనే బాబూ! రేత్రిళ్ళు పొగలు నేను యీడనే వుంటానండి బాబూ! నాకు ఏరే యిల్లు సంసారం దేనికండిక?"

"నిన్న రాత్రి యీ ఇంట్లోకి బయటినుంచి దొంగ ఎవరైనా ప్రవేశించాడా?"

"లేదు బాబయ్యా! నేను రేత్రిళ్ళు నిద్దరోనండి. ఈ ఇంటికి కాపలా కుక్కలాంటోణ్ని బాబూ! యీరి ఉప్పు తింటున్నానండి. యీర్ని కాసుకోటం నా దరమం నేదా బాబయ్యా?"

"అయితే, నిన్న బయట్నించి ఎవరూ రాలేదన్న మాట! అయితే, ఇంట్లోవాళ్ళే ఎవరో మీ అయ్యగార్ని చంపేశారంటావా?" శ్రీనివాస్ తీక్షణంగా చూశాడు వెంకన్నవైపు.

"అయ్యో బాబూ, నేనంతమాటన్నానండీ!? అయ్య గారు దరమ పెబువులు బాబూ! ఆర్ని సంపటానికి ఎవరికి సేతులొత్తాయండి? ఈ ఇంట్లో ఆయనంటే అందరూ పేనం పెడతారండీ? ఎవడికొచ్చిందో మరి పోయేకాలం! నా బాబుగార్ని కడుపునెట్టుకున్నాడు" వెంకన్న పైగుడ్డ నోటిలో కుక్కుకొని ఏడ్చేస్తున్నాడు. బలవంతాన

అణచుకున్నా దుఃఖం పొంగి వచ్చేస్తోంది.

"చెమించండి బాబయ్యా! అయ్యగార్ని తల్చుకుంటే నాకు గుండె సెరువయిపోతన్నాదండి."

"సరే! ఈమధ్య రెండు మూడు రోజులుగా మీ అయ్యగారు ఎవరితోనైనా తీవ్రంగా ఘర్షణపడటంగాని గట్టిగా కేకలు వెయ్యటంగాని — అలాంటిదేమైనా జరిగిందా?"

వెంకన్న ఓ నిమిషంపాటు ఏదో ఆలోచిస్తూ ఉండి పోయాడు. ఆ తర్వాత, "మొన్న రేతిరి రవిసెంద్ర బాబు ఏదో డబ్బు యిసయం అడిగితే అయ్యగారు యివ్వనని యింకా ఏటేటో అన్నారండి. తర్వాత అమ్మాయిగోరు కూడా ఏదో అడగబోతే అయ్యగారు మందలించి పంపేసేరండి. నేను అప్పుడే అయ్యగారికి పాలు పట్టుకొని ఎల్లానండి. అంతకిముందు ఏం జరిగిందో నాకరదం కాలేదండి" అన్నాడు.

"అమ్మాయిగారంటే, ఏ అమ్మాయిగారు?"

"అదేనండి. ఇప్పుడొచ్చారు గదండీ సరలమ్మగారు!"

"ఊఁ, యింకా?"

"నిన్న పొద్దుగాల అనుకుంటానంది, పెద్దబ్బాయి సేకరంగోరు వొచ్చి బట్టలు కరీదుకి బొంబాయి పోవాలి, ఓ లచ్చరూపాయలు కావాలన్నారండి. అయ్యగారు యిప్పటికే నీ సాపుకోసం రెండు లచ్చలిచ్చాను. ఇక నా తరంగాదు పొమ్మన్నారండి. అబ్బాయిగోరు ఇంత మొకం సేసుకొని ఎల్లిపోనారండి. తరవాత అయ్యగారు మిల్లుకు వెల్లిపోనారండి."

"అలాగా! సరళమ్మగారి భర్త రవిచంద్రకి తాగుడు లాంటి అలవాట్లేమన్నా వున్నాయా?"

"తమకు సెప్పకూడదుగాని ఆయనకి లేని అలవాటు లేదండి. తాగుతారు, జూదవాడతారు, రేసులకూడా ఎల్తారండి. పేకెట్లు మాజోరుగా ఆడ్తారండి"

"అలాగా!"

"అవును బాబయ్యా సరలమ్మగోరిమీద సెయి కూడా సేసుకుంటాడటండి అప్పుడప్పుడు."

"ఇవన్నీ నీకెలా తెలుసు?"

"ఈ వూళ్ళోనే కదా బాబయ్యా, అఘ్లుంటున్నది? అప్పుడప్పుడు ఆరింటికి ఆవీ యివీ తీసుకెళ్ళి యిచ్చేసి వొత్తూంటానండి."

"మీ శేఖరం బాబు, వాళ్ళ తమ్ముడు మురళీ— వాళ్ళ సంగతి?"

"మురళిబాబూ వజ్జరంలాంటి పిల్లోడు బాబూ! ఆరిలాగానే నాగార్జున సాగరంలో వుంటున్న బాబు కూడా. డిల్లీ బాబు పెసాదు ఎప్పుడోగాని రాడిక్కడికి. ఇక సేకరంబాబు సంగతి అడక్కండి. అలవాట్లన్నీ అల్ల బావ రవిసెందర్ గారియ్యే వొచ్చేసేయి."

"నీతోపాటు పని చేస్తున్న తక్కిన పనివాళ్ళు ఎలాంటివాళ్ళు? నమ్మకస్తులేనా?" అడిగాడు శ్రీనివాస్.

"నాతోపాటు పనిచేసే రంగా వయసులో నాకన్న చాలా చిన్నోడు. అయినా అన్నిపనులూ సక్కబెట్టుకుంటాడు. వంటమనిషి తాయారుగాని, తోటమాలి సైదులుగాని అయ్యగారి కదివెంటే తొంగిసూడ్రు."

"రంగా యిప్పుడున్నాడా యింటిలో?"

"పిలవమంటారా?"

"ఇప్పుడొద్దులే! ఊఁ, యింకా మాకు పనికొచ్చే విషయాలేమైనా చెప్పగలవా?"

"తవరడిగిన వాటన్నింటికీ సెప్పానుగదా బాబూ! అయ్యగార్ని సంపినోడికి ఉరిశిక్ష ఏసెయ్యండి దొరా!"

"సరే, వాడు దొరకాలికదా! నువ్వు వెళ్ళు."

వెంకన్న నమస్కారం పెట్టి వెళ్ళిపోయాడు.

ఇంతలో సార్జంటు లోపలికొచ్చి "సార్, శవాన్ని మార్చ్యురీకి తరలించమంటారా?" అనడిగాడు.

శ్రీనివాస్ కిరణ్ వంక చూసి, "మన పరిశోధన పూర్తయినట్టేనా?" అనడిగాడు.

"ప్రస్తుతానికి."

"శ్రీనివాస్ సార్జెంట్ వంక చూసి తలూపాడు.

# 5

డిటెక్టివ్ కిరణ్, ఇన్స్పెక్టర్ శ్రీనివాస్ పోలీస్ స్టేషన్లో కూర్చొని కేసుని గురించి చర్చిస్తున్నారు. అంతలో ఫోన్ మ్రోగింది.

శ్రీనివాస్ అందుకున్నాడు.

అతని వదనంలో దరహాసం మాయమయిపోయి గంభీరత చోటుచేసుకుంది.

మెసేజ్ విని ఫోన్ పెట్టేశాడు.

శ్రీనివాస్ కిరణ్ వంక చూసి, "బ్రదర్, మరో హత్య జరిగింది. కృష్ణప్రసాద్ గారి నౌఖరు రంగాని ఎవరో చంపేశారు" అన్నాడు.

"ఎక్కడ? ఎలా?"

"కృష్ణప్రసాద్ గారి ఇంటిముందరే యెవడో లారీ తావాలని ఎక్కించేసి, దొరక్కుండా పారిపోయాడట!"

"అలాగా. తావాలనే ఎక్కించాడా? లేక రంగా అడ్డంగా వస్తే చూసుకోకుండా డాష్ ఇచ్చేసి, దొరికి పోతానన్న భయంతో పారిపోయాడా? సమాచారం

చెప్పిన వాళ్ళెవరు?"

"కృష్ణప్రసాద్ కొడుకు మురళి. అతను గేట్లో నించుని వున్నాడట. రంగా గేట్లోకి ప్రవేశించబోతున్నాడట. వాళ్ళింటి ముందర రోడ్ క్రాసింగ్ వుంది కదా! అది దాటుతుండగా అకస్మాత్తుగా లారీ ప్రత్యక్షమై రంగాని ఎక్కేసి పోయిందట. రంగా అక్కడికక్కడే చనిపోయాడట."

"దీన్నిబట్టి నీకేం తెలిసింది?"

"కృష్ణప్రసాద్ గార్ని హత్య చేసిన వాడే ఈ హత్యా ప్రయోగం చేసివుంటాడు."

"అంతేకాదు. ఈ రంగాకి ప్రత్యక్షంగానో, పరోక్షంగానో కృష్ణప్రసాద్ గారి హత్యతో సంబంధముంది. హంతకుడికి ఈ రంగాకు ఏదో విషయంలో తేడా పాడాలొచ్చాయి. దాంతో హంతకుడు విసిగి రంగాని అడ్డు తొలగించుకోవటానికి ఏక్సిడెంట్ చేసేశాడు."

"మనం వెంటనే స్పాట్ కి వెళ్ళాలి."

"ఓ.కే. నీ సిబ్బందిని తయారు చేసుకో."

## 6

"ఏక్సిడెంట్ జరిగినప్పుడు మీరున్నారుకదా? ఎలా జరిగింది?" అడిగాడు కిరణ్ మురళిని.

కృష్ణప్రసాద్ గారింట్లో అందరు కూర్చుని వున్నారు. కిరణ్, శ్రీనివాస్ ఏక్సిడెంట్ స్పాట్ నించి కృష్ణప్రసాద్ ఇంటికొచ్చారు. కృష్ణప్రసాద్ గారి ఇంటి ఎదురుగానే జరిగింది ఏక్సిడెంట్. రంగా శవాన్ని మార్చ్యురీకి పంపించి వచ్చారు.

"మా ఇంటికెదురుగా వున్న ఫ్యాషన్స్ డ్రైక్లీనర్స్ షాపులో నా గుడ్డలు వాషింగ్ కిచ్చాడు రంగా—వాటిని

తెమ్మన్నాను. సరేనని బయల్దేరాడు. నేను గేటు దగ్గర పూరకే నించుని వున్నాను. రోడ్ క్రాస్ చేస్తున్నాడు. ఇంతలో ఏదో లారీ దూసుకొని వచ్చింది. ఒక్క క్షణంలో రంగాని ఏక్సిడెంట్ చేసి పారిపోయింది."

"నంబరు చూశారా?"

"లేదు సార్! కొత్త లారీ! అశోక్ లేలాండ్. ఏక్సిడెంట్ చేశాక ఒక్క క్షణం కూడా నిలుచుని వుండలేదు లారీ. నెంబరు చూసేంత సావకాశంలేదు."

"ఈ రెండు రోజులుగా రంగాలో ఏమైనా మార్పు గమనించారా?"

"రెండు రోజులుగా అంటే నాన్నగారు పోయినాక, వాడు కొంత విచ్చలవిడిగా ఖర్చుచేస్తున్నాడనిపించింది నాకు."

"రంగా ఎక్కడుంటున్నాడు మకాం?"

"నాకు సరిగా తెలియదండి. మా వెంకన్నకు తెలుసుండి."

# 7

"ఎందుకు అర్జంటుగా పిలిచావు?" స్టేషన్ లోకి అడుగు పెడుతూనే అడిగాడు కిరణ్.

"మరేంలేదు, హంతకుడు దొరికినట్టే!" అన్నాడు శ్రీనివాస్.

"అలాగా! ఎవరేమిటి?"

"వెంకన్నమీద అనుమానముంది."

"కృష్ణప్రసాద్ గారి నౌఖరా?"

"అవును. అరెస్టుచేసి లాకప్ లో వేశాను."

"అదెప్పుడు?"

"ఓ గంట క్రితం ఎక్కడనుంచో ఫోన్ వచ్చింది. కృష్ణప్రసాద్ గారి అవుట్ హౌస్ని సెర్చ్ చేస్తే కొత్త విషయాలు తెలుస్తాయి—అన్నాడు. పేరడిగితే చెప్ప లేదు. వెంటనే బయల్దేరి వెళ్ళాను బలగంతో. వెంకన్న అవుట్ హౌస్ వెరిఫై చేశాను. అతని చెక్క పెట్టె అడుగున బట్టల మధ్య చంద్రహారం, బంగారు గాజులు దొరికాయి. కొంత కరెన్సీ కూడా దొరికింది. వెంకన్నని పిలిపించి అడిగితే తనకు తెలీదని, ఆ వస్తువులు తన పెట్టెలోకి ఎలా వచ్చాయో తనకి అయోమయంగా వుందని గోల పెట్టాడు.

లతని పిలిచి చూపిస్తే ఆ చంద్రహారం గాజులు తమవేనని గుర్తుపట్టింది. అవి వెంకన్న పెట్టెలోకి ఎలా వచ్చాయోనని ఆమె కూడా చాలా ఆశ్చర్యపడింది. వెంకన్నని అరెస్టు చెయ్యటానికి మొదట అసలు ఒప్పుకో లేదామె. తర్వాత కష్టంమీద అంగీకరించింది. ఆమె ఇష్టపడ్డా పడకున్నా వెంకన్నని అరెస్టు చెయ్యక తప్పదని నేను చెప్పాక సమాధానపడింది."

కిరణ్ శ్రీనివాస్ చెప్పినదంతా శ్రద్ధగా విన్నాడు.

"ప్రస్తుతం యిక్కడే వున్నాడా వెంకన్న?"

"ఆఁ లాకప్ లో."

"హత్యల విషయం ఏమయినా సమాచారం చెపు తున్నాడా?"

"తనకే పాపమూ తెలీదని గోలపెడ్తున్నాడు."

"పద, ఓసారి మాట్లాడివద్దాం" కిరణ్ లేచాడు. శ్రీనివాస్ అనుసరించాడు.

సెల్ లో దిగాలుగా కూచుని వున్న వెంకన్న వాళ్ళిద్దర్నీ చూడగానే దిగ్గున లేచాడు.

"బాబూ, నాకే పాపమూ తెల్దు, నన్నొదిలేయండి. మా అయ్యగార్ని జంపుకుంటూనా? రంగా సంగతి కూడా నాకు తెల్దు — నా పెట్టెలోకి ఆ వస్తువులు యెలా వచ్చాయో నాకు తెలీకుండా వుండాది" అంటున్నాడు వెంకన్న కళ్ళనీళ్ళు పెట్టుకుంటూ.

"నీ అవుట్ హౌస్‌కి తాళాలు వేసుకోవా?"

"పగలు వేసుకోను బాబూ, అక్కడక్కడే మసలు తాను కదా! రాత్రిళ్ళు అందులో నే పడుకుంటాను."

"ఈమధ్య అంటే, ఈ రెండు మూడు రోజులుగా అవుట్ హౌస్ తెరిచి బయటకెక్కడికైనా పోయావా?"

"అయ్యగారు పోయిన రోజున బయట పనులకి నేనే వెళ్ళి చక్కబెట్టుకున్నాను బాబయ్యా! తర్వాతి రోజు బయిటికి ఎక్కడికీ పోలేదు."

"నిన్న—అంటే రంగా చనిపోయిన రోజున నువ్వు ఎక్కడున్నావు?"

"ఇంట్లోనే వున్నాను బాబూ! మురళి బాబు సెప్పాక అందరం రోడ్డుమీదికి పరిగెట్టుకెళ్ళాం."

"రంగాని ఎవరు చంపివుంటారని నీ అనుమానం?"

"నాకెవరిమీదుంటాది బాబూ? అయ్యగార్ని ఎవరు సంపారో! ఈ రంగాని ఎవరు సంపారో—యియ్యన్నీ మాలాంటోల్లకేం తెలుత్తాయి బాబూ. సత్తెపెమాన కంగా చెబుతున్నాను — ఈ వొస్తువులు మా తరం నే దియ్యలేదు బాబయ్యా! తిన్న ఇంటికి కన్నంవేసే బుద్ది గాదు బాబూ నాది!"

"మరి ఎవరికుంది ఆ అవసరం? పైగా నీ పెట్టెలో ఎందుకు పెడతారు? వాళ్ళే తీసుకుపోతారుగాని, దొంగి లించి నీ పెట్టెలో ఎందుకు పెడతారు?"

"అదంతా నా ఖర్మ బాబయ్యా!"

"అలా కాదు. నీనుండే అసలు విషయం తెలియాలి. మీ అయ్యగారింటిలో ప్రతి ఒక్కర్ని గురించి వివరాలు మాకు కావాలి. బయటి వాళ్ళు ఎవరెవరు ఎప్పుడెప్పుడు ఆ యింటికొచ్చారో నీకు తెలిసే వుంటుంది. మీ అయ్యగార్ని హత్య చెయ్యటానికి ఓ వారం—పదిరోజుల ముందునుంచి ఎవరెవరు వచ్చి పోయారో ఆ వివరాలన్నీ కావాలి."

వెంకన్న ఏదో గుర్తుచేసుకొని చెప్పటం మొదలు పెట్టాడు.

# 8

"బీరువామీద, లోపలి అరలమీద లత వేలిముద్రలతో బాటు మరో యిద్దరివి దొరికాయి. అందులో ఒక జత రంగావి. మూడో మనిషి యెవరో తేలాల్సి వుంది" అన్నాడు శ్రీనివాస్ వేలిముద్రల వివరాలున్న కవరు కిరణ్ కందిస్తూ.

కిరణ్ వేలిముద్రల్ని భూతద్దంకింద పోల్చి చూస్తూ, "య్యస్. ఇద్దరివి టాలీ అయ్యాయి. మూడో వ్యక్తి హంతకుడన్నది నిర్వివాదాంశం" అన్నాడు కిరణ్.

"అదే నేనూ ఆలోచిస్తున్నాను. ఆ వేలిముద్రలు ఆ ఇంట్లో ఎవరివీ కావు. రంగాతోపాటు మరో వ్యక్తి చేతులు కలిపి కృష్ణప్రసాద్ గార్ని హత్యచేసి డబ్బు, నగలు దొంగిలించాడు. అందుకే బీరువాలో అతని వేలి ముద్రలు కూడా వున్నాయి. ఆ వ్యక్తి ఆడో మగో—ఇప్పుడే చెప్పేస్తానుండు" అని ఆ వేలిముద్రల్ని భూతద్దం కింద పరిశీలించి, "మగవాడే! రంగా స్నేహితుడెవడో అయ్యుండాలి" అన్నాడు శ్రీనివాస్.

"హత్య డబ్బు కోసం జరగలేదు."

"అదేమిటి? డబ్బు, నగలు దొంగిలించారు కదా!"

"నిజమే! కాని, నగలు డబ్బు కోసమే అయితే నగలు కొన్ని వెంకన్న పెట్టెలో ఎందుకు వదిలేస్తారు? ఇదంతా కావాలని ప్లాన్డ్‌గా చేశారు. వెంకన్నమీదికి నేరం పోవాలని వెంకన్నని ఇరికించారు. నిజంగా నగలు కోసమే హత్యచేసివుంటే నగలు వదులుకోకుండానే వెంకన్నని ఎలాగో ఇరికించి వుండేవాళ్ళు!"

"హత్యాయుధం దొరికిందా?" అడిగాడు కిరణ్.

"లేదు. బలమైన ఇనప రాడ్‌తో తలమీద కొట్టి చంపేసినట్టు, స్పృహతప్పించటానికి క్లోరోఫాం వాడినట్టు డాక్టర్సు రిపోర్టులో వుందికదా!"

"ఎస్, చూశాను. అందుకే ఆ రాడ్ ఏదో చుట్టుపట్ల దొరకలేదా అనడుగుతున్నాను."

"లేదు. వెంకన్న అవుట్ హౌస్‌లో కూడా వెతికించాను. ఏమయిందో మరి!"

కిరణ్ ఆలోచనలో పడ్డాడు.

"అయితే లత బాబు రవిచంద్రకి గాని, అక్క సరళకి గాని ఈ హత్యలో భాగం లేదంటావా?"

"అప్పుడే ఎలా చెప్పగలం? రవిచంద్రకి, సరళకి మధ్య అంత సఖ్యత కనిపించటం లేదు. ఇద్దరు చెప్పిన విషయాలు ఒకదానితో మరొకటి టాలీకావటంలేదు.

రవిచంద్ర సిగరెట్టుప్యాక్ మామగారితో మాట్లాడే సమయంలో టేబిలుమీద మర్చిపోయే అవకాశముంది. కాని, దాన్ని అతను కప్పిపుచ్చుకోవలసిన పనిలేదు. మర్చిపోయానని చెప్పచ్చుగదా! అతను అలా యెందుకు మభ్యపెడ్తున్నాడో మనం తెల్సుకోవాలి. అయితే

బీరువామీద వాళ్ళిద్దర్లో యెవరి వేలిముద్రలూ లేవు కాబట్టి వాళ్ళకీ హత్యతో సంబంధంలేదనే నిర్ధారణకు మనం రావచ్చును" అన్నాడు కిరణ్.

"అయితే అత పెద్దన్నయ్య శేఖర్ కి కూడా ఇందులో ఏ విధమైన సంబంధం లేదంటావా?"

"అనే అనుకోవాలి. అతను ఖర్చు మనిషయితే కావచ్చుగాని, డబ్బుకోసం తండ్రిని చంపాల్సిన అగత్యం అతనికి లేదు. అతని వేలిముద్రలు కూడా బీరువాపై లేవు కదా!"

శ్రీనివాస్ తలూపాడు.

సార్జెంట్ వచ్చి సెల్యూట్ చేశాడు.

శ్రీనివాస్ ప్రశ్నార్థకంగా చూశాడు.

"లేల్యాండ్ లారీ దొరికింది సార్. అది శ్రీనివాసా రైస్‌మిల్లు ఓనరు పరాంకుశంగారిది. మున్న వుదయం యెవరో దాన్ని తమ గోడౌన్సు దగ్గర్నుంచి దొంగిలించి తీసుకుపోయి మళ్ళీ ఆ రాత్రికి రాత్రి తెచ్చిపెట్టారని ఆయన చెప్పారుసార్! లారీ పోయిన విషయం త్రీటౌన్లో రిపోర్టు కూడా ఇచ్చారట. లారీ నెంబరు ఎ. పి. వై. 3737. టైర్ల మధ్య రక్తం అంటుకొని వుంది. దాన్ని యెవరూ కదిలించవద్దని చెప్పి, మనవాళ్ళని ఇద్దర్నీ అక్కడే వుంచి మీకీ వివరాలు చెప్పాలని వచ్చాను సార్!" అన్నాడు సార్జెంట్.

శ్రీనివాస్ కిరణ్ వంక చూశాడు.

"ప రా ం కు శా న్ని బెదిరించి చూడు, ఏదయినా తేల్తాదేమో! లారీ చోరీ విషయాం రిపోర్టు ఇచ్చాడో లేదో వెరిఫై చేయించు. టైర్లకంటిన రక్తం రంగా రక్తమో కాదో కన్ఫర్మ్ చేయించు. లారీ స్టీరింగ్ మీద

వేలిముద్రలు దొరకొచ్చు, ట్రేస్ చేయించు. అవన్నీ అయాక మా ఇంటికిరా, అట్నించి కృష్ణప్రసాద్ ఇంటికి వెళ్దాం. కొన్ని ముఖ్యమైన విషయాలు తెల్సుకోవాల్సి వుంది. నే వెళుతున్నాను" లేచాడు కిరణ్.

# 9

లత బయటికి వచ్చింది. అటు ఇటు చూసింది.

ఆటో పోతుంటే పిలిచి యెక్కింది.

ఆటో పోయిన కాసేపటికి వెనక నే ఫియట్ కారు బయల్దేరింది.

ఆటో మెయిన్ రోడ్ దాటి, పక్క వీధికి తిరిగింది.

వీధి నిర్మానుష్యంగా వుంది.

రాత్రి పదిగంటలు దాటింది.

ఆటో ఓ ఇంటిముందాగింది.

వీధిచివర ఫియట్ కారు ఆగింది.

డిటెక్టివ్ కిరణ్ కారు దిగాడు. ఆటో ఆగిన ఇల్లు గుర్తుపెట్టుకున్నాడు.

లత ఆటో దిగి సరాసరి ఆ ఇంట్లోకి వెళ్ళిపోయింది.

కిరణ్ అటు ఇటు చూశాడు. యెవరూ లేరు.

చకచక అడుగులు వేస్తూ ఆ ఇంటి ముందునించి వెళ్ళిపోతూ చురుగ్గా చూశాడు. పక్కగా ఓ గదిలోనుండి వెలుతురు బయటికి పడుతోంది.

అటు ఇటు చూశాడు. యెవరూ సంచరిస్తున్న జాడ లేదు — చటుక్కున కిటికీ పక్కగా చేరాడు. తలుపులు వేసేసి వున్నాయి. లోపల్నుంచి కిలకిల నవ్వులు.

పెరటివైపుగా నడిచాడు. కిటికీ తలుపులు దగ్గరగా వేసివున్నా సన్నటి సందు కనిపిస్తోంది. మోకాళ్ళమీద వంగి నడిచాడు. కిటికీ సందులోనించి లోపలికి తొంగి

చూశాడు.

లత కిటికీ వేపుకు వీపు పెట్టుకొని వుంది. కిటికీ వైపుకి మొహం పెట్టుకుని వున్న యువకుడికి దాదాపు ఇరవై రెండేళ్లుంటాయి. అతను వరలో తెలిగ్గానే గ్రహించ గలిగాడు.

వాళ్ళిద్దరు ఏవో మాట్లాడుకుంటున్న సవ్వడి, గుసగుస. పెదాలు కదులుతున్న శబ్దం వినిపిస్తోంది. మాటలు స్పష్టంగా లేవు.

ఎందుకో ఒక్క సారిగా ఇద్దరు నవ్వుకున్నారు.

అతను లైటు తీసేశాడు. గదంతా చీకటి. జీరో వాట్ కూడా వెలిగించలేదు.

తర్వాత వెచ్చటి నిట్టూర్పులు.

మంచంమీదికి ఒరిగిన మెత్తటి చప్పుడు.

కిరణ్ వెనుతిరిగి గబగబ ఫియట్ దగ్గరికి వచ్చేశాడు.

లోపల కూచుని లెటర్ పాడ్ తీశాడు.

తన పేరున్నచోట పొడవుగా కాగితం చించి, కలం తీసుకొని గబగబ నాలుగు వాక్యాలు రాసేశాడు. చివర సరళ సంతకం చేశాడు.

కారులోంచి దిగాడు.

ఇందాకా లతని తీసుకొచ్చిన ఆటో ఆ వీధిలోకి మళ్ళుతోంది. తిన్నగా పోయి లత వున్న యింటి ముందాగింది.

ముందుగానే లత చెప్పి వుంచిందన్నమాట.

అందుకే ఆటోవాడు మళ్ళీ వచ్చి సిద్ధంగా వున్నాడు.

అయిదు నిమిషాల తర్వాత లత బయటికి వచ్చింది.

ఆటో ఎక్కింది. వెనకగా అతను వచ్చి వీడ్కోలు చెపుతున్నాడు. ఆటో కదిలింది.

కిరణ్ కార్లోనే కూచుని వున్నాడు.

ఆటో తన ముందునించి వెళ్ళిపోయాక, మళ్ళీ కారు దిగాడు. చకచక ఆ యింటి దగ్గరికి నడుచుకుంటూ వెళ్ళాడు.

తను రాసి సిద్ధంగా వుంచిన కాగితాన్ని వుండలా చుట్టాడు, లోపల రాయి పెట్టి. ఈసారి కిటికీలు రెండు వైపులా పూర్తిగా తెరవబడి వున్నాయి. దూరంనించీ గురిచూసి కిటికీలోనుంచి లోపలికి పడేలా చీటీ వున్న రాయి విసిరాడు.

మంచంమీదుగా టక్‌న కిందపడిన శబ్దం వినిపించింది. అతని దృష్టిని ఆకర్షించి వుంటుంది చీటీ.

కిరణ్ గబగబా వీధి చివరికి వచ్చేశాడు.

## 10

తెల్లవారూనే కిరణ్ ఫియట్ కారు కృష్ణప్రసాద్ ఇంటిముందాగింది.

కిరణ్ సరాసరి లోనికి వెళ్ళాడు.

వంటమనిషి తాయారు, మాలి సైదులు ఎదురయ్యారు. కిరణ్‌ని చూసి నమస్కారం చేశారు.

"ఇంట్లో ఎవరున్నారు?"

"లతమ్మగారు, సరళమ్మగారు, మురళిబాబు వున్నారండి" చెప్పింది వంటమనిషి.

"లతమ్మగారు నిద్రలేచిందా?"

"లేదండి. తొమ్మిదయితే నేగాని లేవరండి."

"సరళ గారు."

"ఆయమ్మ అయిదు గంటలకే లేసిపోతారండి."

"రవిచంద్రగారు లేరా?"

"ఆరు అమ్మాయిగార్ని ఇక్కడుంచేసి ఆరింటికి వెళ్ళి

పోయారండి. ఊళ్ళోనే కదండీ, రోజు ఏదో టయింలో వొచ్చిపోతారండి."

"నేనొచ్చానని చెప్పి సరళమ్మను పంపించు."

"అట్టాగేనండి."

కాసేపట్లో సరళ బయటికొచ్చి "రండి, రండి" అంటూ ఆహ్వానించింది.

"ఉదయమే మిమ్మల్ని శ్రమిస్తున్నాను. మీతో ఒక ముఖ్య విషయం మాట్లాడాలి."

"అలాగే, చెప్పండి."

"మీపై హత్యా ప్రయత్నం జరగబోతోంది."

చలి పిడుగులాంటి ఆ మాటలకు నిలువునా వణికి పోయిందామె. "నా మీదనా?" అన్నది గుండెలపై చెయ్యి వేసుకొని.

"మీరు ధైర్యంగా వుండండి. ప్రమాదం జరక్కుండా నేను చూసుకుంటాను. ఒక్క విషయం చెప్పండి. మీ చెల్లెలు లత ప్రేమించిన అబ్బాయి పేరేమిటన్నారు?"

"సురేష్."

"వాళ్ళ పెళ్ళి నిర్ణయమయిందా?"

"నాన్నగారికి మా పెద్దలకి ఎవరికీ ఇష్టంలేదండి. లతే చేసుకుంటానని మా నాన్నగారితోను, మాతోను కుండ పగలేసినట్టు చెప్పేసింది. మా నాన్నగారు కోప్పడ్డారు. కేకలేశారు. అయినా లత మొండిది. ససేమిరా వినననిమొండికేసింది. దాంతో నాన్నగారు కొన్నాళ్ళుగా దాంతో మాట్లాడటం మానేశారు."

"అలాగా! సురేష్ యిక్కడికి ఎప్పుడైనా వచ్చే వాడా?"

"రెండు మూడుసార్లు వచ్చాడు. అయితే ధైర్యంగా

లోపలికి రాలేదు. రెండుసార్లూ మా అవుట్ హౌస్‌లో నే లతని కల్సుకుని వెళ్ళిపోయాడు."

"మీ అవుట్ హౌస్ అంటే వెంకన్న వుంటున్న దేనా?"

"అవునండి, అదే! వెంకన్నకి ఈ సంగతి తెల్సు."

"అవును. వెంకన్న ఆ విషయం చెప్పాడు. కాని ఇలా అవుట్ హౌస్‌లో కల్సుకుంటున్న సంగతి మీ నాన్నగారికి తెలియదా?"

"తెలిసిందండి. వెంకన్నని గట్టిగా కేకలేశారు. వెంకన్నపట్ల మా నాన్నగారికి అభిమానం. అలాగే వెంకన్నకు కూడా మా నాన్నగారంటే భయము, భక్తీను."

"ఆ తర్వాత సురేష్ మళ్ళీ ఇక్కడికి రాలేదా?"

"వచ్చారండి. అయితే ఆ సమయానికి నాన్నగారు ఇంట్లోనే వున్నారు. పెళ్ళి విషయం మాట్లాడతానని నాన్నగారి ముందు ఏదో అంటే ఆయనకి కోపంవచ్చి, అతనిమీద చెయ్యి చేసుకున్నారట. నీవంటి నీచుడికి ఇవ్వను పొమ్మని తిట్టారట. ఇదంతా జరిగి ఓ పదిరోజులవుతుంది."

"అసలు మీ నాన్నగారికి సురేష్‌పట్ల ఎందుకంత కోపం? మీ చెల్లెలు ఇష్టపడి చేసుకుంటానంటే ఎందుకు కాదన్నారు? అతను మీ అంతస్తుకి తగడనా?"

"అదొక్కటే కారణం కాదండి. సురేష్‌కి అన్ని దుర్వ్యసనాలూ వున్నాయి. తాగుతాడు, పేకాడతాడు, అమ్మాయిల వెంటపడతాడు. అవన్నీ నాన్నగారి ఎంక్వయిరీలో తేలాయి. మా లత ఎందుకో వాడి వలలో పడిపోయింది. వాడంటే పిచ్చి ప్రేమ. వాణ్ని నాన్న

గారు కొట్టారని తెలిశాక నాన్నగారితో పోట్లాటకూడా పెట్టుకుంది.”

“లత ఇప్పుడు ఇంటిలోనే వున్నారా?”

“నిద్రపోతోందండి. తొమ్మిమిది దాటేవరకు లేవదు... నామీద హత్యా ప్రయత్నం అన్నారు....”

“మీరు వర్రీకాకండి. మిమ్మల్ని వెయ్యి కళ్ళతో మావాళ్ళు కనిపెట్టి వుంటారు. హత్యా ప్రయత్నం యీరోజు జరగొచ్చు, రేపు జరగొచ్చు. ఏమయినా మీకు ప్రమాదం రాకుండా మేము చూస్తాం. మీరు నిశ్చింతగా వుండండి.”

“ఏమోనండి. రెండు హత్యలు చూశాక, నాకు కూడా ధైర్యం సడలిపోతోంది. మా వారికి కబురుపెట్టి మా ఇంటికి వెళ్ళిపోతాను.”

“నో....నో మీకేం ఫరవాలేదన్నానుగా! మీరు మాత్రం ఇల్లు వదిలి ఎక్కడికీ వెళ్ళకండి. హంతకుడు వస్తే ఇక్కడకే వస్తాడు. మాకు చిక్కకుండా పోడు” అన్నాడు కిరణ్.

“కాఫీ తీసుకోండి” తాయారు తెచ్చిన కాఫీని కిరణ్ కందించింది సరళ.

# 11

“మఫ్టీలో మీ వాళ్ళని కృష్ణప్రసాద్ గారింటి దగ్గర కాపలా పెట్టు. ఈ రాత్రికి గాని, రేపుగాని నువ్వు హంతకుణ్ని కల్సుకోబోతున్నావు” అన్నాడు కిరణ్.

ఇన్స్పెక్టర్ శ్రీనివాస్ కుర్చీలో ఆసక్తిగా ముందుకు వాలి, “ఎవరు? సస్పెన్స్ భరించలేను. చెప్పెయ్యి బ్రదర్!” అన్నాడు.

“చూపిస్తానుగా! చెప్పే పని లేదిక. నువ్వు కూడా

ఎలర్టుగా వుండు. మనిద్దరం కృష్ణప్రసాద్ ఇంటి పరిసరాల్లో ఎవరికీ కనిపించకుండా దాక్కొని చూడాలి."

"ఇంటిలోనే రహస్యంగా కాచుకునుంటే....?"

"హంతకుడు ఇంటిలోకి కాదుగదా, ఆ పరిసరాలకే రాడు."

శ్రీనివాస్ తలాడించాడు!

"నైన్టీ పర్సెంట్ యీ రోజే రావచ్చును. రాత్రి పది దాటాక!"

"ఏమిటి అంత గ్యారంటీ?"

"నేను రాసిన చీటీలో యీ రోజు రాత్రి పది దాటాక రమ్మన్నాను. రాక ఎక్కడికి పోతాడు?"

## 12

రాత్రి పదయింది.

కృష్ణప్రసాద్ ఇంటి చుట్టూ పోలీసులు మఫ్టీలో వున్నారు. అయితే ఎవరికీ తెలియకుండా ఆ ఇంటి పరిసరాల్లో జాగ్రత్తగా కనిపెట్టుకొని వున్నారు.

పది దాటుతుండగా టాక్సీ ఒకటి రయ్యిన దూసుకుంటూ వచ్చి కృష్ణప్రసాద్ యింటిముందు ఆగింది. దాంట్లోంచి నల్లటి దుస్తులు వేసుకున్న ఓ వ్యక్తి దిగి చుట్టు చూశాడు.

ఎవరూ గమనించటంలేదని నిర్ధారణ చేసుకున్నాక చటుక్కున ఇంటిలోకి ప్రవేశించాడు.

టాక్సీ వెళ్ళిపోయింది.

గేటు చప్పుడుకి, హాలుకి కుడిపక్కనున్న గదిలోనుంచి ఓ ఆకారం తొంగి చూసింది. టార్చ్‌లైటు రెండుసార్లు వెలిగి ఆరిపోయింది.

ఆ వ్యక్తి వేగంగా నడుచుకుంటూ హాలు దాటి కుడి

పక్క గదిలోకి నడిచాడు.

లోపల లత అతని కోసమే ఎదురుచూస్తున్నది. ఇద్దరూ సరళ గదిలోకి వెళ్లారు.

అతను లోపలికి అడుగు పెడుతూనే, "నమస్కారం వదినగారూ! మీకు నెక్లెసు, కేష్ కావాలన్నారుగా తెచ్చాను" అన్నాడు.

సరళ తొట్రుపడింది.

"ఆవెందుకు బాబూ...." అని ఏదో అంటుండగానే ఏదో దూదితో లత, సరళ ముక్కును అదిమిపెట్టింది. సరళ వెంటనే తల పక్కకి వాల్చేసింది.

లత, అతను సరళని పక్కమీద పడుకోబెట్టారు.

"కమాన్ లతా, దిండ్లుతీసి మీ అక్క ముక్కుమీద మొహానికంతా కమ్మేసేలా అదిమిపట్టు. నేను గేటు లోపలికి ఎవరైనా వస్తున్నారేమో చూస్తాను" అన్నాడు సురేష్.

లత తల దిండ్లు తీసింది.

సరళ మొహంమీదికి తెచ్చింది.

"మీకంత శ్రమ అక్కర్లేదు మిస్ లతా!" వెనక నించి కిరణ్ స్వరం గంభీరంగా వినవచ్చింది.

లత, అతను త్రుళ్ళిపడి చూశారు.

"ఎవరు నువ్వు? ఎందుకిక్కడికొచ్చావు?" పిచ్చిగా అరిచాడు అతను.

"మిష్టర్ సురేష్! నీ అంతట నువు రంగ ప్రవేశం చెయ్యాలనే ఎదురుచూశాను. వెతుక్కుంటూ నువ్వే వచ్చావు. కృష్ణప్రసాద్ గార్ని దారుణంగా హత్యచేసి నందుకు, అమాయకుడైన రంగాని లారీ నడిపి చంపేసి నందుకు, ఇప్పుడు సరళని హత్య చేయబోయినందుకు మీ

ఇరువురికీ ఉరికంబం సిద్ధంగా వుంది. ఇన్స్పెక్టర్! లతని, సురేష్‌ని అరెస్టు చెయ్యి!" అన్నాడు కిరణ్.

ఇన్స్పెక్టర్ శ్రీనివాస్ లోపలికి అడుగుపెట్టాడు. లత, సురేష్ నిర్ఘాంతపోయి చూస్తున్నారు.

## 13

ఫోన్ గణగణ మోగింది.

"హల్లో" అన్నాడు కిరణ్ రిసీవర్ అందుకొని.

అవతల శ్రీనివాస్ మాట్లాడుతున్నాడు.

"గుడ్‌మార్నింగ్ బ్రదర్! లత, సురేష్ తమ నేరాల్ని ఒప్పుకున్నారు. బీరువామీది వేలిముద్రలతో సురేష్ వేలిముద్రలు టాలీ అయ్యాయి. హత్యకు మోటివ్ పగ, ప్రతీకారం. కృష్ణప్రసాద్ సురేష్‌ని కొట్టడంతో వదలేదట. హత్య చేయించటానికి ప్రయత్నించాడట. సురేష్ తప్పించుకుని, కృష్ణప్రసాద్ మీద పగబట్టాడు.

అతని వల్లోపడిన లత కన్న తండ్రినయినా చూడకుండా ప్రియుడితో చేరి తండ్రిని హత్య చెయ్యటానికి సాయంచేసింది.

సురేష్ రంగా సాయంతో కృష్ణప్రసాద్‌ని హత్య చేశాడు. రంగాకి డబ్బు ఎర చూపించాడు. రంగా లొంగిపోయాడు. తర్వాత రంగా సురేష్‌ని మరీ మరీ పీడించటంతో విసిగిపోయి, లారీ యెక్కించి చంపేశాడు రంగాని.

లత హత్యానేరాన్ని అక్క బావలమీద నెట్టేయటానికి కారణం — సరళకి లతపట్ల అసూయ ద్వేషాలున్నాయట. రవిచంద్ర ఓసారి లతపై అత్యాచారం చెయ్యబోయాడట. ఈ రెండు కారణాలతో సు వాళ్ళిద్దర్నీ ఇరికించాలని ప్రయత్నించింది.

వెంకన్న అవుట్ హౌస్‌లో నగలుంచినది సురేష్ నేరాన్ని వెంకన్నమీదికి మళ్ళించాలని. అతను లతకి కూడా తెలీకుండా ఆ పని చేశాడు.

సిగరెట్టుప్యాక్ గురించి ఎందుకు అబద్ధమాడాల్సి వచ్చిందో మనకు సరళ చెప్పిందికదా! హత్య జరిగిందని లత కేకలు వెయ్యగానే అక్కడికి పరుగెత్తుకొచ్చిన రవిచంద్ర గదిలో తను మర్చిపోయిన ఎస్కైర్ ప్యాక్‌ని అకస్మాత్తుగా చూశాడనీ, అనుమానం తనమీదికొస్తుందని భయపడి గోల్డ్‌ఫ్లేక్ అని అబద్ధమాడాడనీ, సరళే చెప్పిందిగా.

ఇకపోతే, సురేష్‌ని రంగంలోకి తీసుకురావటానికి సరళ పేర అతనికి నువ్వే బెదిరింపు ఉత్తరం రాశావు. సురేష్ యీ హత్య చేసిన సంగతి తను చూశాననీ, నగలు, కేష్ యిస్తే ఆ సంగతి ఎవరికీ చెప్పననీ సరళ రాసినట్టు రాశావు, సమయస్ఫూర్తితో. సురేష్ ఆ ఉత్తరం నిజమని నమ్మి లతకి ఫోన్‌లో సంగతి చెప్పి, సరాసరి వచ్చి మన ఉచ్చులో తగులుకున్నాడు. ఎనీవే, థాంక్యూ ఎలాట్ బ్రదర్! ఉండనా?"

కిరణ్ ఫోన్ క్రెడిల్ చేసి తేలిగ్గా ఊపిరి వదిలాడు.

—:ఐపోయింది:—

# భయంకర హత్యలు

టెంపోరావ్

పడక కుర్చీలో కూర్చుని వాలిగారు పొడుగాటి చుట్టను లైటర్‌తో వెలిగించారు. పొగ పీల్చి వదులుతూ సాయంత్రం వెలువడే దినపత్రికను చేతిలోకి తీసుకొని చదవసాగారు.

ఎదురుగా సోఫాలో కూర్చున్నాను. పైన ఫాన్ తిరుగుతున్నా బాగా ఉక్కబోస్తోంది. ఆకాశంలో నల్లటి మబ్బులు మెల్లగా కదులుతున్నాయి. ఏ క్షణంలోనైనా వర్షం రావచ్చు!

మేమిద్దరం మద్రాసు వచ్చి మూడు రోజులయింది. ప్రత్యేకంగా మాకే పనీ లేకపోయినా వాలిగారు మాత్రం మామూలుగానే బిజీగా వున్నారు. ఒక రోజు ముఖ్య మంత్రితో సమావేశం, మరో రోజు హోమ్ మినిష్టర్ ఇంట్లో డిన్నర్, మూడో రోజున డైరెక్టర్ జనరల్ ఆఫ్ పోలీస్‌తో చర్చలు! ఏదో పని లేకుండా వాలిగారు వుండలేరు.

ఆలోచిస్తూ క్షణ కాలం ఆ మహానుభావుని వైపు చూశాను. మూడు దశాబ్దాలు పైగా ఆయనతో నేను ఎన్నో భయంకర, సాహసోపేతమైన పరిశోధనల్లో పల్గొన్నాను.

కొన్ని సమయాల్లో ఆయనలాంటి మేధావి ఎప్పుడో గాని ఈ లోకంలో పుట్టడని నాకు అనిపించేది. గంభీర కంఠంతో ఆయన ఏ కేసుగురించైనా చెప్తుంటే అందరూ చెవులప్పగించి వింటారు.

భక్తితో ఆయన వంక చూశాను. వాలిగారు ఎప్పటి లాగే వున్నారు. మనిషిలో ఏమాత్రం మార్పులేదు.

టెలిఫోన్ మ్రోగడంవలన నా ఆలోచనలకు అంత రాయం కల్గింది. వెళ్ళి రిసీవర్ని ఎత్తాను.

"హలో, గిరి స్పీకింగ్" అన్నాను.

"ఇన్స్పెక్టర్ ముకుంద్ ని. వాలిగారు వున్నారా?" అడిగాడతను.

అటువైపున్న వ్యక్తి పేరు చెప్పి వాలిగారిక్కి రిసీవర్ని అందించాను.

"హలో" అన్నారాయన.

కొంతసేపయ్యాక, "వస్తాను" అని ఆయన పడక కుర్చీలోంచి లేచారు.

"గిరి, వెళ్దాం పద" అని ఆయన బయటకు అడుగులు వేశారు.

హోటల్ గది తలుపు మూసి, తాళంవేసి వాలిగారిని వెంబడించాను.

XYZ కారును పోనిస్తున్నాను. వాలిగారు నా పక్కనే కూర్చున్నారు.

చుట్టపొగ పీల్చి పైకి వదులుతున్నారు. రోడ్డు దీపాలు

వెలుగుతున్నాయి. షాపుల్లోని ఫ్లోరోసెంట్ ట్యూబులు ప్రకాశిస్తున్నాయి.

టైమ్ చూశాను. తొమ్మిది కావస్తోంది. అయినావరం లోని సయానీ థియేటర్ దాటి కారు దూసుకుపోతోంది.

మా కుడివైపున పళ్ళకొట్లు అగుపిస్తున్నాయి. "గిరీ, ఆ పోలీస్ జీప్ వెనకనే ఆపు!" అన్నారాయన.

పోలీసు జీపు వెనకనే కారాపాడు. అటువైపునుంచి పరుగెత్తుకొచ్చాడు ఇన్స్పెక్టర్ ముకుంద్.

కారు తలుపు తెరిచాడు. వాలిగారు దిగారు. కిందకు వాళ్ళ దగ్గరకు వెళ్ళాను.

"వాలిగారూ, అతడికి బాగా దెబ్బలు తగిలాయి. హాస్పిటల్ కి అతడిని పంపారు. బతుకుతాడనే నమ్మకం లేదు నాకు!" అన్నాడు ఇన్స్పెక్టర్.

"మీ నమ్మకానికి విరుద్ధంగా అతడు బతుకుతాడని ఆశిద్దాం" అన్నాడు వాలిగారు.

క్షణకాలం ఆయన మౌనంగా వుండిపోయారు. నలు వైపులా చూస్తున్నారు.

"ఏం జరిగిందో చెప్పు!"

"అటువైపున్న అంబాసిడర్ కారు అతనిదే. అతని పేరు గోపాలరావు. పళ్ళుకొని, బుట్టను పట్టుకొని అతడు తన కారు వైపు వెళుతున్నాడు. అదే సమయంలో వెనక నుంచి వచ్చిన కారు అతడిమీదకు దూసుకుపోయింది. పళ్ళ బుట్ట కింద పడింది. అతడు కారు కిందపడి నలిగి పోయాడు. ఆ కారు ఆగకుండా ముందుకు వెళ్ళిపో యింది. ఇక్కడున్నవాళ్లు అతడిని టాక్సీలో హాస్పిటల్ కు చేర్చారు. హాస్పిటల్ కు వెళ్ళి అతడిని చూసి నేను ఇక్కడకు వచ్చాను" అన్నాడు ఇన్స్పెక్టర్.

రోడ్డు అటువైపుకు, పళ్ళ కొట్లవైపు నడిచారు వాలిగారు. అప్పుడే వస్తూన్న బస్సు సడన్ బ్రేక్‌తో ఆగింది. ఇన్స్‌పెక్టర్ ముందుంద్, నేనూ వెనకనే వెళ్ళాం.

రోడ్డు వారగా నేలమీద పళ్ళు చిందరవందరగా పడున్నాయి. ఆపిళ్ళు, ప్లమ్సు, బత్తాయి పళ్ళు, అనాస పళ్ళు! తాటాకుల బుట్ట వారగా పడుంది.

వాటివైపు వాలిగారు మౌనంగా చూశారు. "గోపాల రావును కూలగొట్టిన కారు నెంబర్ని యెవరేనా చూశారా?"

"చూడలేదు సార్. రోడ్డుమీద ఎంతమందో వున్నారు. ఒక్కడు కూడా చూడలేదు!" అన్నాడు ఇన్స్‌పెక్టర్.

"అతడు పళ్ళు ఏ షాపులో కొన్నాడు?"

వరుసగా అరడజను కొట్లున్నాయి. మొదటి కొట్టు వైపు చూపించాడు ఇన్స్‌పెక్టర్. అక్కడకు అందరం వెళ్ళాం.

కొట్టతను వాలిగారివైపు భయంతో చూశాడు. షాపుకు కొంచెం దూరంలో ఒక అంబాసిడర్ కారు రోడ్డు వారగా ఆపబడివుంది. గోపాలరావు కారు అదే!

"ఆ కారులో వచ్చే ఆయన ఇక్కడ తరచు పళ్ళు కొని పట్టికెళ్తూ వుంటాడా?" వాలిగారు ప్రశ్నించారు.

"ప్రతి శనివారం ఆయన పళ్ళు కొంటూ వుంటారు సార్. మంచి కస్టమర్" అన్నాడతను.

"అతడివైపు దూసుకెళ్ళిన కారును నువ్వు చూశావా?"

"చూశాను సార్."

"నెంబర్ గుర్తుందా?"

"లేదు, సార్."

వాలిగారు అతడివైపు సూటిగా చూశారు.

"రోడ్డుమీద వెళ్ళే కార్ల నెంబర్లు కొట్టొచ్చినట్లు కనిపిస్తాయి. నీకు ఆ కారు నెంబరు ఎందుకు కనబడ లేదు?"

కొట్టకను వెంటనే జవాబియ్యలేదు.

"ఇప్పుడు జ్ఞాపకమొచ్చిం సార్. ఆ కారు నెంబర్ ప్లేటును ఏదో గుడ్డ కప్పేసింది"

"నిజంగా?"

"నిజం, సార్. ఆయన భయంకర అరుపు విని కారు వైపు చూశాను. నెంబరు బదులు నెంబరు ప్లేటుమీదున్న నల్లటి గుడ్డ నాకు కనిపించింది. రెప్పపాటులో ఆ కారు మాసుకుపోయింది."

"కారులో ఎంతమంది వున్నారు?"

"ఒక్కడే సార్."

"కారులో ఒక్కడే వున్నాడని మరికొందరు కూడా చెప్పారు" అన్నాడు ఇన్స్పెక్టర్.

వాలిగారు నోట్లోని చుట్ట పొగను బయిటకు వదిలి ఇన్స్పెక్టర్ వైపు చూశారు. ఏదో చెప్పబోయి, ఎందుకో చెప్పటం మాని సమీపంలో వున్న కారువైపు నడిచారు.

బ్లాక్ అంబాసిడర్ కారు!

"సి బుక్ కారులో వుంది. దాన్నిబట్టే అతడి పేరూ, అడ్రసూ తెల్సుకున్నాను" అన్నాడు ఇన్స్పెక్టర్.

వాలిగారు విచిత్రంగా నవ్వారు.

"ముకుంద్ భాయ్, సి-బుక్‌లో పేరున్న వ్యక్తేగాక ఈ కారులో మరెవరైనా ఇక్కడకు వచ్చివుండొచ్చు!" అన్నాడాయన.

"అవును, సార్."

"ఆ అడ్రెస్‌కు ఎవర్నయినా పంపావా?"

"లేదు సార్, పంపాలి" అన్నాడు ఇన్స్‌పెక్టర్.

"పంపటం అనవసరం, మేం వెళ్తాం" అన్నారు వాలి గారు.

ఇన్స్‌పెక్టర్ ముకుంద్ చెప్పిన అడ్రెసును గుర్తుంచుకున్నాను. రోడ్డుదాటి మా కారువైపు నడిచాం. ముందు సీటుమీద వాలిగారు కూర్చుని ఇన్స్‌పెక్టర్ వైపు చూశారు.

"ఫోన్ చేసి హాస్పిటల్‌కి పంపిన వ్యక్తి ఏ స్థితిలో వున్నాడో తెలుసుకో!"

ఇన్స్‌పెక్టర్ ముకుంద్ పరుగెత్తుకెళ్ళి బట్టల షాపులో దూరాడు. కాస్సేపట్లో తిరిగొచ్చాడు.

"అతడు మరణించాడు!" అన్నాడు ఇన్స్‌పెక్టర్.

"ఇల్లక్!"

"వాలిగారూ, ఆ యాక్సిడెంట్ చేసి పారిపోయిన మనిషి కోసం వెతకాలి!" అన్నాడు ఇన్స్‌పెక్టర్.

"ముకుంద్ భాయ్, ఇది యాక్సిడెంట్ కాకపోవచ్చు!" అన్నాడాయన క్లుప్తంగా.

ఇన్స్‌పెక్టర్ ముకుంద్ వులిక్కిపడ్డాడు.

"ఇది హత్య అంటారా?"

"కావచ్చు! నెంబరు ప్లేటును నల్లగుడ్డ కప్పిందని అతడన్నాడు. అందువలన మనం అనుమానించాలి" అని ఆయన నావైపు చూశారు.

కారును ముందుకు పోనిచ్చాను.

## 2

చామియర్స్ రోడ్డుమీదున్న 10 నెంబరు ఇంటి కాంపౌండులోకి కారును పోనిచ్చి ఆపాను. అందంగా

నిర్మించిన మేడచుట్టూ చక్కటి తోట వుంది. ఇంటికి సమీపంలో పూలమొక్కలు, వాటికి దూరంగా మామిడి, కొబ్బరిచెట్లు అగుపిస్తున్నాయి.

వాలిగారూ, నేనూ కార్లోంచి దిగాం. ముందు వరండా మీదున్న లైట్ వెల్గుతోంది. ముందు తలుపు తెర్చివుంది.

గుమ్మంలో వాలిగారు నిలబడ్డారు. నేను ఎలక్ట్రిక్ బెల్ నొక్కాను. చేతికర్ర ఆధారంతో నడుస్తూ యాభై ఏళ్ళ స్త్రీ గుమ్మంవైపు వచ్చింది.

"ఎవరు?" అందామె.

"గోపాలరావు వున్నాడా?" అడిగారాయన.

"అతడు బొంబాయి వెళ్ళాడు. రేపో ఎల్లుండో వస్తాడు."

"అయితే కారులో ఎవరు వెళ్ళారు?"

"నా రెండో కొడుకు రామారావు. ఫాక్టరీనుంచి వచ్చి, శనివారం పళ్ళకోసం వెళ్ళాడు."

"మీ ముగ్గురు తప్ప ఈ ఇంట్లో మరెవ్వరూ లేరా?"

"మరెవరుంటారు?మా అమ్మాయికి పెళ్ళయిపోయింది. నౌఖర్లు పని ముగించి పోతారు."

వాలిగారు ఆమెవంక విచారవదనంతో చూశారు.

"ఇంటిలో ఫోనుందా?"

ఆమె వుందన్నట్లు తలాడించింది.

"బొంబాయిలో వున్న మీ అబ్బాయి గోపాలరావుతో ఫోన్‌లో మాట్లాడొచ్చా?" అడిగారు వాలిగారు.

"ఏం మాట్లాడాలి?"

"మీ అబ్బాయితో కొన్ని వ్యాపార విషయాలు

అర్జంటుగా మాట్లాడాలి."

"ఏ క్షణంలోనైనా రామారావు వస్తాడు. వాడితో మీరు మాట్లాడొచ్చు" అందామె.

ఆమెవైపు వాలిగారు జాలిగా చూశారు. గుడ్డిది! కళ్ళుంటే మా ముఖాలు చూసి ఏదో జరిగిందని గాభరా పడేది!

"మేం వెంటనే వెళ్ళాలి, రామారావు వచ్చిందాకా వుండలేం!" అన్నాడాయన.

ఆమె ఓ క్షణం ఆలోచించింది.

"డైరక్టరీలో బొంబాయి హోటల్ ఇండియా నెంబర్ రాసివుంటుంది. రూమ్ నెంబర్ 50."

వాలిగారూ, నేనూ లోపలకు వెళ్ళాం. ఆయన నాకు సౌజ్ఞ చేశారు. ఆయన ఆమెతో మాట్లాడుతూ నిలబడ్డారు. టెలిఫోన్ సంభాషణ ఆమె వినకుండా ఉండేందుకు మాట్లాడిస్తున్నారు.

రిసీవరెత్తి కోడ్ నెంబరు తిప్పి తర్వాత హోటల్ ఇండియా నెంబర్ తిప్పాను.

"హాలో, హోటల్ ఇండియా!"

"మిష్టర్ గోపాలరావు, రూమ్ నెంబర్ 50!" అన్నాను.

కాస్సేపట్లో గోపాలరావు కంఠం వినపడింది.

"హాలో, ఎవరు? నేను గోపాలరావుని!"

"గోపాలరావుగారూ, మీ తమ్ముడికి యాక్సిడెంట్ అయింది. వెంటనే రావాలి."

"తమ్ముడికి ఏమైంది? వాడు ఏ స్థితిలో ఉన్నాడు?" గాభరాగా అన్నాడతను.

"ఎక్కువగా చెప్పలేను. మీరు వెంటనే రావాలి."

"నైట్ ఫ్లయిట్‌లో వస్తాను."

రిసీవర్ పెట్టేశాను. వాళ్ళవైపు వెళ్ళాను. "నేను రెండేళ్ళ క్రితం గుడ్డిదాన్నయ్యాను. రైలు యాక్సిడెంట్‌లో కళ్ళుపోయాయి. కళ్ళుపోయినా పరవాలేదు. బతికి బయటపడ్డాను. నా ఇద్దరు కొడుకులూ నాకీనాడు రెండు కళ్ళయ్యారు" అందామె.

"గోపాలరావుతో మాట్లాడాం. ఇక వెళ్తాం" అన్నాడు వాలిగారు.

"అబ్బాయి ఏమన్నాడు?"

"ఈ రాత్రి ప్లేన్‌లో వస్తున్నాడు" అన్నాను.

"మీ అమ్మాయి ఎక్కడుంది?"

"ఇదే పట్నంలో. అది టీ నగర్‌లో వుంటోంది."

"అల్లుడి పేరు?"

"రంగరాజన్."

"వాళ్ళ అడ్రెస్ చెప్పండి!" అన్నాను.

ఆమె చెప్పింది నేను రాసుకున్నాను.

ఇద్దరం బయటకు నడిచాం. ఆమె గుమ్మంలో నిలబడింది. కారును పోనిచ్చాను.

"పూర్ లేడీ!" అని వాలిగారు చుట్ట పొగ వదుల్తూ మౌనంగా వుండిపోయారు.

## 3

హాల్లో గోపాలరావుకి ఎదురుగా వాలిగారూ, నేనూ కూర్చున్నాం.

గోపాలరావు వయసు 28 ఉంటుంది. ఇంకా పెళ్ళి కాలేదు. తండ్రి స్థాపించిన అరడజను ఫాక్టరీలను అతడు నడుపుతున్నాడు.

క్రితం రోజే రామారావు శవం దహనం చేయబడింది.

అప్పటినుంచీ గోపాలరావు ఇంటిలోనే ఉండిపోయాడు.

"అబ్బాయి, నీ తమ్ముడి వయస్సెంత?" వాలిగారు ప్రశ్నించారు.

"నా కంటె రెండేళ్ళు చిన్న సార్. అతడికంటె రెండేళ్ళు చిన్నది మా చెల్లెలు రమా" అన్నాడతను.

వాలిగారు అతడివైపు సూటిగా చూశాడు.

"మీ తమ్ముడికి ఎవరేనా శత్రువులు ఉన్నారా?"

అతడు ఆలోచిస్తూ ఉండిపోయాడు.

"తమ్ముడిని ఎవరేనా చంపారని మీ అనుమానమా?"

"అవును. అందుకు ఆధారా లున్నాయి."

"నాన్నగారు పోయాక అన్ని ఫాక్టరీలను నేను మేనేజ్ చేస్తున్నాను. చెల్లి పెళ్ళి అయ్యాక తమ్ముడు నాకు సహాయపడసాగాడు. రామం నాకెంతో ఆసరాగా ఉండేవాడు. వాడి జీవితం ఇలా ఆకస్మికంగా అంత రిస్తుందని నేను కలలో కూడా అనుకోలేదు."

"నువ్వు చెప్పినది నా ప్రశ్నకు జవాబు కాదు!" అన్నాడాయన బులెట్ లా.

"తమ్ముడికి శత్రువులు లేరు సార్. వాడు బిజినెస్ లోకి దిగి కొద్ది కాలమే అయింది. శత్రువులు ఏర్పడే అవకాశం లేదు."

గదిలో కొంతసేపు నిశ్శబ్దంగా వుంది. "వాలిగారూ, నన్నడిగితే ఇది యాక్సిడెంట్ అయివుండాలని అంటాను. ప్రమాదవశాత్తూ కారుకింద తమ్ముడు పడ్డాడు. కారు ఆపితే ఏం జరుగుతుందో అని భయపడి డ్రయివర్ కారును పోనిచ్చివుండొచ్చు" అన్నాడు గోపాలరావు.

ఆరిపోయిన చుట్టను వాలిగారు లైటర్ తో వెలిగించారు.

"అబ్బాయి, ఇది హత్య అనుకోడం నా పొర బాటేమో! ఏది ఏమైనా త్వరలో నిజానిజాలు మనకు తెలుస్తాయి" అని వాలిగారు కుర్చీలోంచి లేచారు.

అందరం కారువైపు నడిచాం. ముందు సీటుమీద వాలిగారు కూర్చున్నారు. పక్కనే నిలబడ్డాడు గోపాల రావు.

"అబ్బాయి, నీ చెల్లెలు కాపురం సుఖంగా సాగు తోందా?" అడిగారాయన.

"వాళ్ళు ప్రేమించి పెళ్ళి చేసుకున్నారు సార్, ఇద్దరూ సుఖంగా ఉన్నారు."

"నీ బావకు తలిదండ్రులు ఉన్నారా?"

"అతడికి తమ్ముడు తప్ప ఎవ్వరూ లేరు, సార్."

"నీ బావ ఏం చేస్తున్నాడు?"

"ఉద్యోగం చేస్తున్నాడు, భారత్ బాంక్‌లో."

"ఎప్పుడైనా అతను నిన్ను డబ్బు అడుగుతాడా?"

"ఎప్పుడూ నన్ను అడగలేదు. నేనే చెల్లెలికి ఇస్తూ వుంటాను. వచ్చే జీతంమీద అతడు జీవించాలి. మాలా అతడికి ఆస్తి లేదు."

"అతడి తమ్ముడు ఏం చేస్తున్నాడు?"

"ఉద్యోగం కోసం వెతుకుతున్నాడు."

"అతడికి మీ ఫాక్టరీలో ఉద్యోగం యివ్వొచ్చుగా?"

"కొంతకాలం మా కెమికల్స్ ఫాక్టరీలో అతను పనిచేశాడు. అతడు సరిగ్గా పైనుకు వచ్చేవాడు కాదు. చుట్టాలకు ఉద్యోగాలివ్వడం మంచిదికాదని నేను అతడిని పొమ్మన్నాను."

"అతడు అన్నతోటే ఉంటున్నాడా?"

"అతడికింకా పెళ్ళికాలేదు. అన్నతోటే ఉంటు

న్నాడు."

వాలిగారు సౌజ్ఞ గుర్తించి కారును బయటకు పోనిచ్చాను.

# 4

అమావాశ్య రాత్రి అతడు ఒంటరిగా రోడ్డమ్మట నడుస్తున్నాడు. ఇళ్ళలోని వాళ్ళు నిద్రపోతున్నారు.

సిగరెట్ పీలుస్తూ అతడు మెల్లిగా అడుగులు వేస్తున్నాడు. గేటు లోపలనుంచి ఒక కుక్క అతడిని చూసి మొరిగింది.

అతడు ఆగాడు. గేటు దగ్గరకు వెళ్ళాడు—కుక్క అటువైపు వుంది. అతడిని చూసి మొరుగుతోంది. చప్పుడు చేయకుండా అతడు గేటు తెర్చాడు.

కుక్క వెనక్కుపోయి మొరుగుతోంది. జేబులోంచి రెండు బిస్కట్లుతీసి అతడు కుక్కవైపు పడేశాడు. ఆకలితో కుక్క బిస్కట్లను తినేసింది. తోక వూపుతూ అతడి దగ్గరకు వచ్చింది.

కుక్క పీకను అతడి చేతులు చుట్టేశాయి. బలంగా పిసికాడతను. కాస్సేపటిలో కుక్క అతడి చేతుల్లో చచ్చిపడుంది.

కుక్కను నేలమీదకు విసిరి అతడు గేటు మూశాడు. రోడ్డమ్మట మెల్లిగా నడవసాగాడు.

అతడు మరో సిగరెట్ వెలిగించాడు. ఆలోచిస్తూ అడుగులు వేస్తున్నాడు.

తన్ని చూసి మొరిగే కుక్కలు చావాలి!

అతడు మరికొంత దూరం నడిచాడు. చిన్న ఇంటి ముందు ఆగాడు. లోపలకు వెళ్ళి ముందు తలుపుమీద వేళ్ళతో తట్టాడు.

కాస్సేపటిలో తలుపు తెరవబడింది. అతడు లోపలకు మూసుకెళ్ళాడు. ఆమె తలుపు మూసింది. అతడివైపు నవ్వుతూ చూసింది.

"రేఖా!" అన్నాడతను.

"ఇంత ఆలస్యంగా రావద్దన్నాను!" అందామె.

"వస్తే ఏమవుతుంది?"

"అమ్మ పడుకుంది. లేస్తే నన్ను తిడుతుంది!"

అతడు నిర్లక్ష్యంగా నవ్వాడు.

"డోంట్ బాదర్! నీ తల్లి లేవకుండా నేను చూస్తాను!"

అతడు సోఫాలో కూర్చుని ఆమె వంక చూశాడు. తటాలున ఆమెను తనవైపు లాగాడు. ఆమె అతడి ఒళ్లో పడింది. విసుగ్గా లేవబోయింది. అతడామెను నొక్కిపెట్టాడు.

"మై డియర్, ఐ లవ్ యు! నీ కోసం నేను ఏదైనా చేస్తాను" అన్నాడతను.

"నన్ను వదులు!" అర్చిందామె.

"గట్టిగా అరిస్తే మీ అమ్మ లేస్తుంది!" అతడు ఆమెను వారించాడు.

"ప్లీజ్, వెళ్ళిపో! రేపు పార్కులో కలుసుకుందాం" అందామె.

అతడు జవాబివ్వలేదు. పాంటు జేబులోంచి రమ్ బాటిల్ తీశాడు. బాటిల్లోని రమ్ను అలాగే గడగడ తాగేశాడు. మరో సిగరెట్ వెలిగించాడు.

"రేఖా, పార్కులో నిన్ను కల్సుకుంటే నాకు తృప్తికరంగాలేదు. అందుకే నీ ఇంటికొచ్చాను. నన్ను పొమ్మనకు! పోడానికి నేను రాలేదు" అన్నాడతను.

ఆమె మాట్లాడలేదు. అతడి వంక చూస్తూ వుండి పోయింది.

"త్వరలో లక్షలు నా చేతిలోకొస్తాయి. అప్పుడు నిన్ను నాతో అమెరికా, ఇంగ్లండ్, ఫ్రాన్స్ వగైరా దేశాలకు తీసుకువెళ్తాను. మన జీవితం అఖండంగా ఉంటుంది!"

"చూద్దాం!" అందామె.

బాటిల్లో మిగిలిన రమ్‌ను అతడు పూర్తిగా తాగేశాడు. బాటిల్ని హాలు మూలకు విసిరాడు. అది శబ్దం చేస్తూ ముక్కలైంది!

ఆమె తృప్తిపడింది. వికిలించుకుని దూరంగా జరిగింది.

"ప్లీస్, వెళ్ళు! నిజంగా నన్ను నువ్వు ప్రేమిస్తే వెళ్ళిపో! అల్లరిచేస్తే అమ్మకు నీమీద మంచి అభిప్రాయం ఏర్పడదు! నీ గురించి అమ్మతో చెప్పాను. మన ప్రేమకు ఆమె ఎదురుపల్కదు. కాని యీ స్థితిలో నిన్ను చూస్తే ఆమె నిన్ను అసహ్యించుకుంటుంది!" అందామె.

అతడు కుర్చీలోంచి లేచాడు. ఆమె దగ్గరగా వెళ్ళి చేతుల్తో చుట్టేశాడు. ఎర్రటి ఆమె పెదిమలను బలంగా ముద్దెట్టుకున్నాడు.

అతడి కళ్ళల్లోకి చూసిందామె.

"నువ్వు పశువులా ప్రవర్తిస్తావు. అయినా నీ పశుబలం నన్ను ఎంతో ఆకర్షిస్తోంది. నేను ఎప్పుడూ నీదాన్నే! నీవు లేకుండా నేను బతకుండలేను. నా మాటలు నమ్ము! ఇప్పుడు వెళ్ళిపో!" అందామె.

ఆమె తలుపు తెర్చింది. అతడు మెల్లిగా గుమ్మం దాటాడు. ఆమెవైపు నవ్వుతూ చూశాడు.

"రేఖా, మళ్ళీ ఎప్పుడు?"

"రేపు సాయంత్రం, పార్కులో!"

అతడు మెల్లిగా రోడ్డువేపు నడిచాడు. ఆమె తలుపు మూసుకుంది. అతడు రోడ్డమ్మట వేగంగా అడుగులు వేయసాగాడు.

## 5

టెలిఫోన్‌లో మాట్లాడి వాలిగారు ఖంగారుగా కుర్చీ లోంచి లేచారు.

"గిరీ, పద!" అన్నారాయన.

ఇద్దరం గదిలోంచి బయటకు నడిచాం. తలుపు మూసి తాళం వేశాను. ఆయన వెనకనే వెళ్లాను.

XYZ కారు శరవేగంగా గోపాలరావు యింటికి పోనిచ్చాను. అక్కడ ఏం జరిగిందో నాకు తెలియదు. వాలిగారు చెప్పే మూడ్‌లో లేరు. అంతా అగమ్య గోచరంగా వుంది.

కాంపౌండులో కారాపి దిగాం. ఇన్స్పెక్టర్ ముకుంద్‌ను అక్కడ చూసి ఆశ్చర్యపోయాను.

వాలిగారు హాల్లోకి వెళ్లారు. గోపాలరావు గాభరాగా వచ్చాడు. వాలిగారి చేతులు పట్టుకున్నాడు.

"వాలిగారూ, అమ్మను ఎవరో హత్య చేశారు. ఇదంతా చూస్తూంటే నా తమ్ముడు కూడా హత్యచేయబడి వుండాలని నాకు అనిపిస్తోంది" అన్నాడతను.

హాల్లోంచి పక్కనున్న గదిలోకి వెళ్లాం. గోపాలరావు తల్లి నేలమీద పడివుంది. వాలిగారు వంగి కూర్చుని ఆమెను జాగ్రత్తగా పరీక్షించారు.

మెల్లిగా ఆయన లేచి నిలబడ్డారు.

"ఊపిరాడక ఆమె మరణించింది" అన్నాడు వాలిగారు.

ఆయన గోపాలరావు వంక చూశారు.

"అబ్బాయి, ఏం జరిగిందో చెప్పు!"

"వాలిగారూ, నేను తొమ్మిదింటికి ఫాక్టరీనుంచి వచ్చాను. గుడ్డిదైనా కారు వచ్చిన చప్పుడు అవగానే ఆమె గుమ్మం దగ్గరకు వచ్చేది. కాని ఇవాళ రాలేదు. అమ్మా అని పిలుస్తూ ఆమె గదిలోకి వెళ్ళాను. ఆ స్థితిలో ఆమెను చూశాను. వెంటనే మీకూ, పోలీసువార్కీ ఫోన్ చేశాను."

"సాయంత్రం ఇక్కడకు ఎవరొచ్చారో తెలుసా?" వాలిగారు ప్రశ్నించారు.

"పనివాళ్ళు ఏడు లోపల వెళ్ళిపోతారు. అటుపైన ఎవరెవరొచ్చారో వివరంగా తెలియదు."

వాలిగారు అతడివైపు సూటిగా చూశారు.

"నీ బావ వచ్చాడేమో!" అన్నారాయన.

"అమ్మ మరణవార్త నా చెల్లెల్కి చెప్పడానికి ఫోన్ చేశాను. బావా, నా చెల్లెలూ ఇక్కడికొచ్చారు. ఏడున్నరకు వాళ్ళు వెళ్ళిపోయారట" అన్నాడు గోపాలరావు.

"వాళ్ళే నీ తల్లిని ఆఖరుసారిగా సజీవంగా చూసివుండాలి" అన్నారాయన.

"వాళ్ళు వెళ్ళాక ఏం జరిగిందో యెవ్వరికీ తెలియదు, సార్!"

వాలిగారు గంభీరంగా నవ్వారు.

"అటుపైన జరిగింది మనకు తెలుసు, అబ్బాయి. నీ తల్లి మరణించింది! హంతకుడికి ఆమె బలైపోయింది!" అన్నారాయన.

గోపాలరావు వాలిగారివైపు చూశాడు.

"వాలిగారూ, ఆమె వృద్ధురాలు. గుడ్డిది. ఆమెను

చంపితే హంతకుడికి ఏ విధంగా లాభిస్తుంది?"

"అది మనం కనుక్కోవాలి!"

గోపాలరావు నిస్సహాయంగా సోఫాలో కూర్చుని ఏడ్వసాగాడు. ఇన్స్పెక్టర్ ముకుంద్ వాలిగారి దగ్గరకు వచ్చాడు.

"వాలిగారూ, ఇప్పుడు సందేహంలేదు. రామారావుని చంపిన వ్యక్తే ఆమెను హతమార్చి ఉండాలి" అన్నాడు ఇన్స్పెక్టర్.

"ఇదీ, ఇంతకుముందు జరిగినదీ హత్యని భావిస్తున్నందుకు నిన్ను మెచ్చుకుంటున్నాను" అన్నారాయన.

గోపాలరావు ఏడుస్తూ వాలిగారి చేతుల్ని పట్టుకున్నాడు.

"వాలిగారూ, ఎవరో మా వంశాన్ని నాశనం చేయడానికి ప్రయత్నిస్తున్నారు. నేనొక్కడినే ప్రస్తుతం బతికివున్నాను. నన్ను కూడా చంపడానికి వాళ్ళు ప్రయత్నించవచ్చు."

"అబ్బాయి, నువ్వు కూడా పోతే యెవరికి లాభిస్తుంది?" అడిగారాయన.

గోపాలరావు తృళ్ళిపడ్డాడు. వాలిగారివైపు భయంతో చూశాడు.

"వాలిగారూ, నా చెల్లెలు, నా బావ ఇదంతా చేశారంటే నేను నమ్మను!"

"అబ్బాయి, నువ్వు నమ్మినా, నమ్మకపోయినా నిజం మారదు!"

"వాలిగారూ, నాకు ఒక్కతే చెల్లెలు. దానికి ఏం కావలసినా మేం ఇస్తాం. మమ్మల్ని ధ్వంసంచేసి ఆమె

జీవించవలసిన అవుసరం లేదామెకు. బావ చిన్న ఉద్యోగంలో ఉన్నా మంచివాడు. నోరు తెర్చి అతడు నన్ను ఎన్నడూ ఏమీ అడగలేదు. అతడికి ఏం కావలసినా మేం ఇస్తాం. అది అతడికీ, నా చెల్లెలికీ తెలుసు. మీరు దయచేసి వాళ్ళను అనుమానించవద్దు!" అన్నాడు గోపాలరావు.

"అబ్బాయి, నిలకడమీద నిజం తెలుస్తుంది" అన్నారు వాలిగారు.

## 6

వాలిగారూ, నేనూ హాల్లో కుర్చీల్లో కూర్చున్నాం. మాకెదురుగా రమా, రంగరాజన్ ఉన్నారు.

వాలిగారు సూటిగా రంగరాజన్ వైపు చూశారు.

"అబ్బాయి, నిన్న మీరు గోపాలరావు యింటికి వెళ్ళారు. అక్కడ యెంతవరకూ ఉన్నారు?"

"ఏడున్నర దాకా, సార్" అన్నాడు రంగరాజన్.

"అటు పైన ఎక్కడికెళ్ళారు?"

"బీచ్‌కి వెళ్ళాం. ఎనిమిది దాకా అక్కడ కూర్చుని ఇంటికి తిరిగొచ్చాం."

"ఏడున్నర తర్వాత మీరు బీచ్‌కి వెళ్ళడం ఎవరేనా చూశారా?"

"యెవ్వరూ చూడలేదు, సార్."

వాలిగారు జేబులోంచి చుట్టతీసి లైటర్‌తో వెలిగించారు.

"ఏడున్నర తర్వాత మీరు ఏం చేశారో యెవ్వరికీ తెలియదు!" అన్నాయన.

"తెలియదు" అంది రమా.

రంగరాజన్ ఆమెవైపు కోపంగా చూశాడు.

"వాలిగారూ, ఏడున్నరకి మేం గోపాలరావు యిల్లు వదిలిపెట్టాం. స్కూటర్ మీద బీచ్ కి వెళ్ళాం. గోపాల రావు ఇంటి సమీపంలో ఉన్న సిగరెట్ షాపులో నేను సిగరెట్లు కొన్నాను. అప్పటికి టైము ఏడూ ముప్ఫయిఐదు అయివుంటుంది. ఆ షాపువాడిని అడిగితే మా గురించి అతడు మీకు చెప్పొచ్చు" అన్నాడు రంగరాజన్.

వాలి నవ్వి వూరుకున్నాడు.

"మరో విషయం. మేం ఎనిమిదిదాకా బీచ్ లో ఉన్నాం. బీచ్ లో ఐస్ క్రీమ్ తిన్నాం. ఐస్ క్రీమ్ అమ్మిన వ్యక్తితో మీరు మాట్లాడితే 7-45 ప్రాంతంలో మేం ఐస్ క్రీం కొన్నట్లు అతడు చెప్తాడు" అన్నాడు రంగ రాజన్.

అతిడివైపు వాలిగారు సూటిగా చూశారు. "డాక్టర్ రిపోర్టునుబట్టి గోపాలరావు తల్లి ఏడున్నర ఎనిమిది మధ్య మరణించింది. ఆమె మరణించాక మీరు బీచ్ కి వెళ్ళుండొచ్చు!"

రంగరాజన్ కోపంగా కుర్చీలోంచి లేచాడు.

"వాలిగారూ, మేం వెళ్ళేసరికి నా అత్తగారు సజీవంగా వున్నారు. గుమ్మందాకా వచ్చి ఆమె మమ్మల్ని సాగనంపారు. ఆమె ఏడున్నరకు మరణించలేదు. మేం వెళ్ళిపోయాక ఆమె మరణించి ఉండాలి" అన్నాడు రంగరాజన్.

"అబ్బాయి, నువ్వు మాతో సహకరిస్తే నీ అత్తగారి హంతకుడిని నేను పట్టుకోగలను. నువ్వు భయపడవలసిన అవసరంలేదు" అన్నారాయన.

రంగరాజన్ మాట్లాడలేదు. రమా విచారవదనంతో వాలిగారివైపు చూసింది. "వాలిగారూ, అమ్మంటే

నాకెంతో ప్రేమ. ఆమె హంతకుడిని మీరు పట్టుకో వాలని నేను ఆశిస్తున్నాను. మేం వెళ్ళిపోయేసరికి అమ్మ క్షేమంగా వుంది. ఆమె ఇలా హతమార్చబడుతుందని నేనెన్నడూ అనుకోలేదు" అంది రమా.

"అమ్మాయి, మీరు గోపాలరావు ఇంటికి వెళ్తున్నట్లు యెవరికి తెలుసు?" అడిగారు వాలిగారు.

"అనుకోకుండా మేం అమ్మను చూడ్డానికి వెళ్ళాం. మేం వెళ్తూండగా నా మరిది ఎదురయ్యాడు. ఎక్కడికని అడిగాడు. అమ్మను చూడ్డానికని నేనే చెప్పాను. సినిమా చూసివస్తానని అతడు వెళ్ళిపోయాడు. నేనూ, నా భర్తా అమ్మ ఇంటికి వెళ్ళాం" అంది రమా.

అప్పుడే హాల్లోకి ఒక యువకుడు ప్రవేశించాడు. టైటు పాంటు, ప్లాయలో వున్నాడతను. సన్నటి మీసాలు.

"వీడు నా తమ్ముడు జయదేవ్" అన్నాడు రంగ రాజన్.

"నమస్తే" అన్నాడతను.

ఆ యువకునివైపు వాలిగారు పరీక్షగా చూశారు.

"నిన్న సాయంత్రం సినిమాకెళ్తానని చెప్పావట మీ వదినతో. ఏ సినిమాకెళ్ళావు?"

"లవ్ యిన్ ది వుడ్స్ ఇంగ్లీషు సినిమాకెళ్ళాను. మూన్ థియేటర్లో ఆడుతోంది" అన్నాడతను.

"ఇంటికెప్పుడొచ్చావు?"

"సినిమా అయాక బుహారీలో టిఫిన్ తిని పదింటికి వచ్చాను. అన్నయ్యా, వదినా ఇంట్లో లేరు. అమ్మ మరణించిందని ఒక చీటీ రాసి వదిన టేబుల్ మీద పెట్టింది. అది చదివి ఆశ్చర్యపోయాను. ఫోన్ చేసి అన్నయ్యతో

మాట్లాడాను."

"నువ్వు గోపాలరావు ఇంటికి వెళ్ళలేదా?"

"నిన్న వెళ్ళలేదు. ఇవాళ పొద్దుట అందరం కలిసి వెళ్ళాం" అన్నాడు జయదేవ్.

వాలిగారు కుర్చీలోంచి లేచారు. గబగబా బయటకు నడిచాడు. కారులో కూర్చొని తలుపు మూశాడు.

వాళ్ళకు బైబై చెప్పి కారు పోనిచ్చాను.

## 7

పడక కుర్చీలో వెనక్కు జార్లాబడి వాలిగారు తీవ్రంగా ఆలోచిస్తున్నారు. చుట్ట పొగ రింగుల్లో పైకి లేస్తోంది.

తటాలున ఆయన కుర్చీలోంచి లేచాడు. టెలిఫోన్ దగ్గరకు వెళ్ళాడు. రిసీవర్ ఎత్తి ఏదో నెంబరు తిప్పాడు. ఓ నిమిషంపాటు మాట్లాడి రిసీవర్ని పెట్టేశాడు. ఆయన మాటలు నాకు స్పష్టంగా వినపడలేదు.

పడక కుర్చీలో కూర్చొని ఆయన నావైపు నవ్వుతూ చూశాడు. ఆయన కళ్ళు తళతళ మెరుస్తున్నాయి.

"గిరీ, మబ్బులు కదులుతున్నాయి. సూర్యకాంతిని త్వరలో చూస్తాం" అన్నారాయన.

"ఏదేనా తెలిసిందా?"

"తెలియవలసినదంతా తెలిసింది. మనుషులను పావుల్లా బలిచ్చి కొందరు చదరంగం ఆడ్తారు. వాళ్ళ ఎత్తులకు పై యెత్తువేసి ఆటకట్టాలి" అన్నారాయన.

కాస్సేపు గదిలో నిశ్శబ్దంగా వుంది. ఆయనకు ఏం తెలిసిందా అని ఆలోచిస్తున్నాను. ఆయన మాటలు నాకు అర్థంకాలేదు.

"గిరీ, గోపాలరావుకు ఫోన్ చేయి" అన్నారాయన.

రిసీవరెత్తి గోపాలరావుకు ఫోన్ చేశాను. "హలో" అందో కంఠం అటువైపునుంచి.

"మీతో వాలిగారు మాట్లాడతారు" అని రిసీవర్ని ఆయనకిచ్చాను.

"అబ్బాయి, నీ తల్లి మరణంతో ఈ హత్యలు ఆగవని పిస్తోంది. నువ్వు జాగ్రత్తగా ఉండాలి!"

సమీపంలో నిలబడి శ్రద్ధగా వింటున్నాను.

"ఆ అనుమానం నీకే వచ్చిందిగా! నీ వంశాన్ని యెవరో నాశనం చేయడానికి ప్రయత్నిస్తున్నారని నువ్వు నాతో అన్నావు గుర్తుందా?"

అటువైపునుంచి గోపాలరావు ఏమన్నాడో నాకు తెలియదు.

"యెందర్ని చంపినా వేసేది ఉరిశిక్షేగా?" అని వాలిగారు గంభీరంగా నవ్వాడు.

"అబ్బాయి, నువ్వు యెక్కడికేనా వెళ్తే ముందుగా నాకు ఫోన్ చేసి చెప్పు. నాకు చెప్పకుండా వెళ్తే ప్రమాదం రావచ్చు" అన్నారాయన.

కాస్సేపయ్యాక ఆయన రిసీవర్ని పెట్టేసి పడక కుర్చీలో కూర్చున్నారు.

* * *

గోపాలరావు నిద్రపోతున్నాడు. పడగ్గదిలో జీరో వాట్ బల్బు డిమ్‌గా వెలుగుతోంది.

దగ్గరగా మూసిన తలుపును తోసి అతడు లోపలకు వెళ్ళాడు. అడుగులో అడుగేస్తూ మంచంవైపు నడిచాడు.

గోపాలరావు వెల్లకిలా పడుకుని ఉన్నాడు. కాళ్ళ

వైపున్న తలగడను అతడు మెల్లిగా తీశాడు. క్షణకాలం నిద్రిస్తూన్న గోపాలరావువైపు చూశాడు.

అమాంతంగా తలగడను అతడి మొహంమీద పెట్టి బలంగా నొక్కి ఉంచాడు. సకన్లు గడుస్తున్నాయి.

చీకటిలో నిలబడిన వాలిగారిని తట్టాను. ఆయన శర వేగంగా మంచంవైపు వెళ్ళారు. ఎలక్ట్రిక్ స్విచ్ నొక్కాను. గదిలో ఫ్లోరోసెంట్ లైట్ వెలిగింది.

గోపాలరావు పరుపు మీద లేచి కూర్చున్నాడు. వాలిగారి కబంధ హస్తాల్లో ఇరుక్కుని విదిలించుకోడానికి విశ్వప్రయత్నం చేస్తున్నాడు జయదేవ్.

"గిరీ, ఇన్స్పెక్టర్ ముకుంద్ కు ఫోన్ చేసి వెంటనే రమ్మను!" అన్నాడు వాలిగారు గంభీరంగా.

## 8

గోపాలరావు ఇంటిలోని ముందు హాల్లో అందరం కూర్చున్నాం. పైన రెండు ఫానులు తిరుగుతున్నాయి.

ఒకవైపున కుర్చీలో జయదేవ్ కూర్చొని ఉన్నాడు. అతడికిరువైపులా కాన్స్టేబుల్స్ వున్నారు. అతడివైపు క్షణకాలం చూసి వాలిగారు అందరివైపూ చూశారు.

"మొదట్లో నేను రంగరాజన్ని అనుమానించాను. కాని తను చెప్పిన అబద్ధం మూలంగా జయదేవ్ నా అనుమానానికి గురయ్యాడు. గోపాలరావు తల్లి హత్య చేయబడిన సాయంత్రం మూన్ థియేటర్లో ఆదే లవ్ యిన్ వుడ్స్ సినిమాకి వెళ్ళానని జయదేవ్ చెప్పాడు. ఆ థియేటర్ కు ఫోన్ చేశాను. ఆ థియేటర్ ప్రొప్రయిటర్ భార్య పొద్దుటే చనిపోవడం వలన ఆవాడు ఆ థియేటర్ మూసివేయబడిందని మేనేజర్ చెప్పాడు. దానితో

జయదేవ్ హంతకుడై ఉండాలని భావించసాగాను."

వాలిగారు ఆగాడు. జయదేవ్ వైపు సూటిగా చూశాడు.

"జయదేవ్ మామూలు మనిషి కాడు. దుర్మార్గుడు, కిరాతకుడు. నిండు ప్రాణాలు తీయడం అతని హాబీ! కుక్కల్నీ, మేకల్నీ అకారణంగా చంపి పారేస్తాడు. ఇదంతా గిరి కనుక్కున్నాడు."

వాలిగారు నవ్వుతూ నా వైపు చూశారు.

"గోపాలరావు ఆస్తిని కాజేయడానికి జయదేవ్ చదురంగం ఎత్తుల్లా హత్యలు చేయసాగాడు. కారుకింద పడి రామారావు పోయాడు. గుడ్డిదైన తల్లిని హత మార్చాడు. నిన్న రాత్రి ఈ ఇంటిలోనే గోపాలరావును చంపడానికి ప్రయత్నం చేశాడు. నేనూ, గిరీ ఈ హత్య జరక్కుండా చూశాం. జయదేవ్ నాకు చిక్కిపోయాడు. ఈ యత్నం ఫలించి వుంటే తర్వాత అతడు తన అన్ననే చంపేవాడు! అంతా ఆస్తి కోసం! డబ్బు కోసం! జయదేవ్ ఎటువంటి పిశాచమో దీన్నిబట్టి మీరు వూహించుకోవచ్చు" అన్నారాయన గంభీరంగా.

"నువ్వింత పిశాచానివని నేను అనుకోలేదు!" అన్నాడు రంగరాజన్ జయదేవ్ వైపు చూస్తూ.

జయదేవ్ మాట్లాడలేదు. అతడి మొహంలో భయం లేదు. ఎవరేమన్నా లెక్క చేయకుండా అలాగే కూర్చున్నాడు.

వాలిగారు చుట్టు పొగవదులుతూ అందరి వైపు చూశాడు.

"జయదేవ్ అమాయకురాలైన రేఖను తన మాటల్తో

ఆకర్షించాడు. ఆతడు పోలీసులకు చిక్కడం మూలంగా ఆమె రక్షించబడింది" అన్నాడు వాలిగారు.

"వాలిగారూ. మీరు నా కళ్ళు తెరిచారు. నన్ను కాపాడారు" అంది రేఖ ఆయనవైపు చూస్తూ.

"ఈ హత్యల విషయంలో నాకెంతో సహాయపడి నందుకు మీకు నా ధన్యవాదాలు" అన్నాడు ఇన్స్పెక్టర్ ముకుంద్.

—: అ యి పో యిం ది :—

# కత్తిమీద గీతలు

## సికిందర్

తలుపు తీసి లాల్ లోపల శవాన్ని చూశాడు.

దుర్వాసనకి కర్చీఫ్ అడ్డం పెట్టుకొని అతను గదిలోకి వెళ్ళాడు.

వెనుక జాన్, ఇన్‌స్పెక్టర్ బాలకృష్ణన్, సార్జెంట్ నవీన్, డాక్టర్ రఘునాథ్ వెళ్ళారు. మరికొందరు లాబ్ సిబ్బంది కూడా వెళ్ళారు.

కిటికీలు తెరిచారు. ఫ్యాను వేశారు.

"స్వామీ, క్విక్! నువ్వు గబగబా ఫోటోలు గుంజెయ్! డాక్టర్, మీరు వెంటనే శవం సంగతి చూసి డిస్పాచ్ చేసెయ్యండి.... శాస్త ఊపిరి పీల్చుకుంటాను" కర్చీఫ్ వెనుక నుంచి గడబిడ చేశాడు కృష్ణన్.

ఫ్లాష్ బల్బు చకచకా వెలిగింది. బోర్లా పడివున్న శవం పృష్ట భాగాన్ని కొన్ని స్నాప్స్ తీశాడు. వెల్లకిలా తిప్పి మరికొన్ని తీశాడు ఫోటోగ్రాఫర్.

అక్కడే గాయముంది కడుపులో. కత్తి పిడికంటా

దిగింది. అతను బనియన్, లుంగీమీద వున్నాడు. అవి రెండూ రక్తసిక్తమయ్యాయి. నేల మీద కూడా రక్తం ప్రవహించి గడ్డ కట్టింది.

అతనికి ముప్ఫయి అయిదేళ్ళుంటాయి. నల్లటి రంగు. అంత దృఢమైన శరీరం కాదు. నెత్తిమీద వెంట్రుకలు పలచగా వున్నాయి. ఎడమ చేతికి రిస్టువాచీ వుంది.

డాక్టర్ శవాన్ని సమీపించాడు.

డిటెక్టివ్‌లు గదిలో తిరుగుతూ దేన్నీ ముట్టుకోకుండా వస్తువులు పరిశీలిస్తున్నారు.

గదిలో శవం తర్వాత ప్రధానంగా ఆకర్షించేది డ్రెస్సింగ్ మిర్రర్.

సరిగ్గా శవం కాళ్ళకి తిన్నగా గోడదగ్గరున్న డ్రెస్సింగ్ మిర్రర్. పై భాగంలో సగంవరకు పగిలిపోయింది. అది అయిదడుగులు ఎత్తు గల అద్దం. కింద పగిలిన అద్దం ముక్కలు చెల్లాచెదురుగా పడ్డాయి. ఒక బాంబూ సైజు పాండ్స్ టాల్కమ్ పౌడరు డబ్బా వాటి మధ్య పడుంది.

అద్దం పక్కనే కిటికీ వుంది. కిటికీ అవతల పెరట్లోకి పోయే సందు వుంది. కిటికీకి వూచలున్నాయి. మరో కిటికీ ముందు వరండా వైపు వుంది. అక్కడే ఒక డబుల్ కాట్ బెడ్ వుంది. దానిమీద పక్క అస్తవ్యస్తంగా వుంది. ఒక దినపత్రిక, రెండు పుస్తకాలు తలగడ వైపు ఉన్నాయి.

దానికి సరిగ్గా ఇవతలి గోడకి పుస్తకాల రాక్ వుంది. దాని నిండా సైన్సు పుస్తకాలున్నాయి. దాని ముందు టేబుల్, అటొకటీ ఇటొకటీ రెండు కుర్చీలున్నాయి. రెండూ అడ్డదిడ్డంగా వున్నాయి. టేబుల్ మీద చిందర

వందరగా కాగితాలూ, పుస్తకాలూ పడివున్నాయి. రెండు ఖాళీ కప్పు సాసర్లు కూడా అక్కడున్నాయి.

రాక్‌లో కింది వరసంతా 'ఫిరంగి' వార పత్రిక పాత కాపీలతో నిండి వుంది.

అక్కడ్నుంచి చూస్తే వరండా వైపు కిటికీ పైన ఫ్రేము కట్టివున్న ఫోటో ఒకటి వ్రేలాడుతూ కన్పిస్తోంది, కింద ఆధారంమీాంచి జరిగిపోయి.

దాని అద్దం పగల్లేదు.

డాక్టర్ శవం దగ్గర్నుంచి లేచాడు.

కృష్ణన్ వేలిముద్ర|లతనికి సూచనలిస్తున్నాను. అతను ఆయా వస్తువులపైన వేలిముద్రలు తీస్తున్నాడు, యూనివర్సల్ గ్రేపౌడర్ జల్లి, ఆటోమైజర్‌తో.

శవం తక్షణం స్ట్రెచ్చర్ మీాద తరలించబడింది.

డాక్టర్ డిటెక్టివ్‌లని తీసుకుని గది బైటికి నడిచాడు.

## 2

అక్కడ ఓ హాలులాటి ప్రదేశంలో కుర్చీలో కూర్చుని ఏోదిస్తోంది ఓ. యువతి. ఆమె చుట్టూ నల్గురున్నారు. వాళ్ళు ఓదారుస్తున్నారు. ఆమె కుర్చీ పక్కన ఒక సూట్‌కేసూ, ఒక ఏయిర్ బ్యాగూ వున్నాయి.

లాల్ డాక్టర్‌ని ప్రశ్నార్థకంగా చూశాడు. డాక్టర్ అతన్ని పక్కకు తీసుకెళ్ళాడు.

"లాల్, ఈ హత్య మొన్నరాత్రి జరిగివుండాలి. అంటే సుమారు ముప్పై గంటల క్రితం. ఇప్పుడు ఉదయం తొమ్మిదవుతోంది, బుధవారం. చావు మొన్న సోమవారం రాత్రి జరిగింది....రిగర్ మార్టిస్ పూర్తిగా రిలాక్సయింది. శవం కుళ్ళుతోంది. ఎడమ చేతికి రిస్టు

వాచీ చితికి ఆగిపోయింది, మూడున్నర చూపిస్తోంది సమయం. ఇదే హత్యా సమయం అనుకోవచ్చు. సోమ వారం రాత్రి మూడున్నరకి. చావుకి ముందు చాలా ఘర్షణ జరిగినట్లు తెలుస్తోంది.... ఆ కత్తి మామూలు కూరలు కోసుకునేది. దాని చివర మొనదేలి లేదు. గుండ్రంగా వుంది. కానీ హంతకుడు బలిష్టుడయితే సునా యాసంగా దాన్నుపయోగించగలడు. హతుడు బలవంతు డేమీ కాడు.... ఇంతే ఇప్పుడు నేను చెప్పగల్గేది, సెలవు తీసుకుంటాను!"

డాక్టర్ వెళ్ళిపోయాక లాల్ ఆ యువతిని సమీ పించాడు. ఆమెకు ఇరవై ఎనిమిది వుంటాయి. యువతు లంటే సాధారణంగా అందమైన రూపాలే మెదులు తాయి. ఆమె ఫోన్ చేసినప్పుడు ఆమె కంఠం విని లాల్ అలాగే వూహించాడు. కాని వూహకూ వాస్తవానికీ తేడా తెలిసి నీరుగారిపోయాడు. ఆమె అంతటి అనా కారిని అతడెక్కడా చూడలేదు. రంగులేదు, సౌష్టవం లేదు, ముఖంలో కళలేదు—ఆమె విషాదాన్ని పక్కకు పెట్టి చూసినా,

దేశంలో అనాకారులు కోకొల్లలు. అయితే ఇలాటి అనాకారి వితంతువు అయిందంటే, జాన్ కేమాత్రం జాలి కలగడంలేదు. అతను నిర్లిప్తంగా చూస్తున్నాడు.

లాల్ ఆమెని ప్రశ్నించాడు:

"మీ పేరు సుమతి. కానీ మీవారి పేరు చెప్ప లేదు."

"ప్రభాకరరావు...." ఆమె కంఠం లాల్‌ని ఆకట్టు కుంటోంది.

"ఏం చేస్తుంటారు?"

"పటేల్ కాలేజీలో లెక్చరర్, బాటనీ లెక్చరర్."

"డిగ్రీ కాలేజీయా?"

"అవును."

"మీరిప్పుడు వూర్నించి వస్తున్నారా?"

"అవును, మావూరు వరంగల్ వెళ్ళి ఇప్పుడే వస్తున్నాను...."

"వెల్, మీవారిని చంపేశారు. ఎవరో హత్య చేశారు. మీరు చదువుకున్నవారు. చక్కగా వ్యవహారించారు. మీరు బస్సు దిగి ఇక్కడకొచ్చిన వెంటనే శవాన్ని చూసి దేన్నీ కదల్చకుండా, ముట్టుకోకుండా, మాకూ పోలీసులకీ ఫోన్ చేసి ఎంతో మంచిపని చేశారు. ఇప్పుడీ హత్యను పరిశోధించడానికి మా కుపయోగపడే విషయాలు దృష్టిలో పెట్టుకుని మీరు చెప్పండి. మీ కెక్కువ శ్రమ ఇవ్వను, క్లుప్తంగా చెప్పండి."

ఆమె తలూపింది. ఆ తర్వాత నెమ్మదిగా చెప్పసాగింది:

"నాకేం తెలియడం లేదు....ఆయన్ను ఎవరు చంపుతారు? పరీక్షలయిపోయాక సెలవుల్లో నాతో మావూరు రమ్మంటే రాలేదు. ట్యుటోరియల్ కాలేజీలో ఎంట్రెన్స్ క్లాసులు తీసుకోవాలని ఆగిపోయారు. కోఠిలో భారత్ ట్యుటోరియల్సులో చెప్తున్నారు....సరేనని నే నొక్కదాన్నే పోయాను. నెల రోజుల తర్వాత ఇవ్వాళే వచ్చాను. భోజనం ఆయన నల్గొండ క్రాస్‌రోడ్స్‌లో నాయర్ హోటల్లో చేసేవారు. ఇక్కడికి దగ్గరే.

"ఈ నెలరోజులూ మేం ఉత్తరాలూ రాసుకోలేదు. నేను రాస్తే ఆయన సమాధానమివ్వరని నాకు తెలుసు. ఆయన ఉత్తరాల్ని అసహ్యించుకుంటారు."

"నేను వెళ్ళాక ఇక్కడేమేం జరిగాయో తెలీదు. నేను చాలా ఆదుర్దాపడ్డాను. డిటెక్టివ్ గారూ, మా పెవాటాలో వాళ్ళు మంచివాళ్ళు కారు. ఎప్పుడు మాతో తగవులు పెట్టుకుంటారు. కొట్లాటకొస్తారు. చాలా చిన్న కారణాలకే! ఒకసారి శర్మ చంపుతానని బెదిరించాడు. ఆయన భార్య మహా గయ్యాళిది. భర్తని ఆమే రెచ్చగొడ్తుంది.... పైగా మావారిని ఎదురుపడి మాటలంటుంది. నన్ను—నన్ను దెయ్యం అని తిడ్తుంది...."

"వాళ్ళెందుకొస్తారు తగవుకి?"

"చాలా చిన్న కారణాలు.... కాలేజీ నడిచేటప్పుడు. ఆయన ఇంట్లో ట్యూషన్‌లు చెప్పేవారు. ఆ స్టూడెంట్లతో తమకు డిస్టర్బ్ అవుతోందనీ వాళ్ళని మాన్పించాలనీ గొడవ చేసేవారు. పెరట్లో ఇద్దరికీ కలిపి ఒకటే నీళ్ళ టాప్ వుంది. అక్కడా పేచి. ఇంటి మొత్తానికీ కలిపి మా పోర్షన్‌లో ఒక్కటే కరెంట్ మీటరుంది. అక్కడా చిక్కులు పెడతారు. ఒకసారి వాళ్ళబ్బాయి పైకి మెట్లెక్కుతూ జారిపడ్డాడు. దానికీ మామీద కొట్లాటకొచ్చారు. ఆ గయ్యాళి ఇల్లు ఊడ్చి చెత్తంతా మా గుమ్మంలో పోస్తుంది! ఒకసారి నీళ్ళబిందె ఎత్తుకొని మెట్లెక్కుతూ కాలు జారితే నేను నవ్వాపుకోలేక పోయాను .... అప్పుడు నా నెత్తిమీద పైనుంచి ఉల్లి పాయల పొట్టుపోసింది!

"మేం విసిగిపోయాం డిటెక్టివ్ గారూ. వాళ్ళతో వాదానికిపోతే కొట్టడానికొస్తారు. చంపుతామని బెదిరిస్తారు. మేమంటే అంత పగ దేనికో తెలీదు. ఒకసారి స్టూడెంట్లంతా కలిసి వాళ్ళని హెచ్చరించారు కూడా. అయినా వాళ్ళలాగే చేసేవారు...."

"వాళ్ళని మేం ప్రశ్నిస్తాం. మీకింకా శత్రువులు వున్నారేమో చెప్పండి."

ఆమె ముఖం అదోలా అయిపోయింది. తల దించుకుంది.

"శత్రువులు....ఎవరుంటారో తెలియడంలేదు. ఆయన బయట ఎవరితో గొడవలు పెట్టుకునే మనిషి కాదు. కాలేజీ, ఇల్లూ, పత్రిక తప్ప ఆయనకు మరో వ్యాపకం లేదు—"

"ఏం పత్రిక?"

"ఫిరంగి వారపత్రిక. దానికాయన రెగ్యులర్ కాలమిస్టు."

"అదెక్కడ్నుంచి వస్తుంది?" అడిగాడు లాల్.

"గోల్కొండనుంచి" చెప్పిందామె, "ఏళ్ళేళ్ళుగా రాస్తున్నారు. ఆ పత్రిక ధోరణి నాకు నచ్చదు. అందరి రహస్యాలతో ఆటలాడుతూంటారు. అది నాకు నచ్చక పోయినా, పత్రికనుంచి ఆయన ఏ రకమైన చిక్కులూ ఎదుర్కోలేదు. ఆయన రాసే శీర్షిక ప్రత్యేకంగా యే ఒక్కర్నీ ఎత్తి చూపదు."

"డిటెక్టివ్ గారూ, చెప్పడం మరిచాను. శత్రువంటే గుర్తొచ్చింది....పరీక్షలప్పుడు ఆయనొక విద్యార్థిని కాపీ చేస్తోండగా పట్టుకున్నారట, రెండుసార్లు. అతను బీజడ్ సీ ఫైనల్ విద్యార్థి, నాతో చెప్పాడు. పేరు దీపక్ అట. తనని పట్టుకున్నందుకు — కాపీ చేయనివ్వనందుకు అంతు చూస్తానని బెదిరించాడట! అతను చాలా చెడ్డవాడని స్టూడెంట్లంతా చెప్పుకుంటారు. అతని జోలికి యెవరూ పోరు."

"ఇంకా? తర్వాత ఏం చేశాడు?"

"ఆ సాయంత్రం ఇంటికొస్తోంటే బస్టాపులో అడ్డ

గించి కత్తి తీశాడట. కానీ జనం తన్నబోతే పారి పోయాడట! అంతే, మళ్ళీ ఈ నెలరోజుల్లో ఏదైనా జరిగిందేమో తెలియదు...."

ఆమె మళ్ళీ అంది, "నాకిక్కడి విషయాలేమీ తెలియదు! ఆ శర్మ మళ్ళీ గొడవ చేశాడో... ఆ నూటెంటు బెదిరించాడో .... వీళ్ళిద్దరు తప్ప ఆయనకు శత్రువులు తోచడంలేదు! వీళ్ళిద్దరు కాకపోతే మరెవరో తెలుసుకుని మీరు పట్టుకోవాలి, డిటెక్టివ్ గారూ! పోలీసులున్నా ప్రత్యేకంగా మిమ్మల్ని పిల్చాను... ఫీజు ఎంతైనా సరే, మీరు చంపిందెవరో సాధ్యమైనంత త్వరగా పట్టుకోండి. అంతవరకు నాకు మనశ్శాంతి వుండదు...."

"ఎంత కాలమైంది మీ పెళ్ళయి?"

"ఎనిమిదేళ్ళయింది...."

"పిల్లలు....?"

"లేరు. తలరాతని తప్పించలేం" అందామె భారంగా.

# 3

పై వాటాలో శర్మ తలుపు తీసి ఉద్రేకంగా చూశాడు. "ఓహ్, డిటెక్టివ్‌లు, రండి, ఎప్పుడొస్తారా అని చూస్తున్నాను..."

డిటెక్టివ్‌లు లోపలికి వెళ్ళారు.

లోపలి గది తలుపు దగ్గర యాభై ఏళ్ళున్న స్త్రీ కని పించింది. ఆమె వాలకం మర్యాద ఇచ్చే రకంలా లేదు. అయితే ఇప్పుడామె భయం భయంగా ఒదిగి నిల్చుంది.

శర్మకు అరవై ఏళ్ళుంటాయి. ఇనుప ముక్క. అతను పైకి ధైర్యం ప్రదర్శిస్తోన్నా లోలోన కాంప్లెక్స్‌లతో సతమత మవుతున్నాడు.

"హత్య గురించి మీ కెప్పుడు తెలిసింది?" అడిగాడు లాల్.

"ఉదయమే సర్" చెప్పాడు శర్మ. అతని కళ్ళలోకి చూస్తే ఏమేం చెప్పాలో ముందే చర్చించుకుని సిద్ధమైనట్టు తెలుస్తోంది....

"ఈ రెండు రోజులూ మీకనుమానం రాలేదా?"

"లేదు సర్, తాళంవేసి వుంటే ఆయన వూరెళ్ళాడనుకున్నాం."

"హత్య మొన్న రాత్రి జరిగింది. అప్పుడు మీరెక్కడున్నారు?"

"ఇంట్లోనే సర్, నిద్రపోతున్నాను."

"క్రింద మీకేమైనా చప్పుళ్ళు విన్పించాయా?"

"లేదు సర్, ఏమీ విన్పించలేదు."

"లెక్చరర్ గారితో చివరిసారిగా మీరెప్పుడు పోట్లాడారు?"

అతను తీక్షణంగా చూశాడు ఒక్క క్షణం. "చూడండి సర్, మమ్మల్ని ఇందులోకి ఈడ్వకండి. లెక్చరర్ గారి చావుతో మాకు సంబంధంలేదు. మేం పోట్లాడుకున్నాం నిజమే, కానీ దాన్ని మీరు సీరియస్ గా తీసుకోవాల్సిన పనిలేదు, ఎందుకంటే, అది అర్థంలేనిది. తీరి కూర్చుని నా మోస్టు అన్ సివిలైజ్ డ్ వైఫ్ పురెక్కిస్తోంటే బుద్ధిలేక వెళ్ళి పోట్లాడాను. బెదిరించాను. నేను సిగ్గుపడుతున్నాను. నా వైఫ్ తృప్తికోసం లెక్చరర్ గారిని దూషించాను, అవమానించాను. అందుకు మనసులో నేనెంత బాధపడ్డానో నాకే తెలుసు...."

"మీ మిసెస్ తృప్తికోసం మీరంతే చేశారా?"

"సర్, నా యీ మోస్టు టైర్ సమ్ లైఫ్ నన్నెం

తయినా లెచ్చరొట్టుగాక, నన్నెంతయినా సాధించనీ గాక, లెక్చరర్ గారిని చంపే పరిస్థితి ఏర్పడితే నేను చావడమో, దాన్ని చంపడమో జరుగుతుందేగాని, అలాటి పాపపు పని నేను కలలో కూడా తలపెట్టను! ఈ డెవిల్ కోసమే నేనాయనతో దురుసుగా ప్రవర్తించానుగానీ, వ్యక్తిగతంగా ఆయనంటే నాకు చాలా ఇష్టముంది. సదభిప్రాయముంది. మంచి లెక్చరర్ గా, పత్రికలలో కాలమిస్టుగా ఆయనపై నాకెంతో గౌరవముంది. ఎప్పుడైనా బైట దొరికితే చేతులు పట్టుకుని క్షమాపణ కోరుకోవాలనుకున్నవాడిని...."

"నోర్మూయ్యండి!" శర్మ భార్య చేతులూపుతూ ముందుకొచ్చింది, "పొగుడుతున్నారు, పొగడ్తలు! నోర్మూయ్యండి! మంచివాడట మంచివాడు! ఎవరికి తెలీదు ఆ లెచ్చరాయన సంగతీ! ఈ పెద్దమనిషి కేం తెలుసబ్బాయిలూ, పాద సమానం యింట్లో పడుందేదాన్ని నన్నడగండి! అవ్వ! అవ్వ! ఆ లెచ్చరాయనా ఆ బక్క దెయ్యాం ఎలా పోట్లాడుకునేవారమ్మా! అవ్వ అవ్వ! ఆ లెచ్చరాయన్ని క్షణం సుఖంగా బ్రతకనిచ్చిందా బక్క దెయ్యం! అస్తమానం అనుమానాలే! తాను అందగత్తె కాదని ఏడుపు! మొగుడు బయట ఏ కుర్రదానితోనో వూరేగుతున్నాడని ఒకటే పోరు! ఇల్లెగిరిపోయేలా అరుపులూ!

"మరి ఆ లెచ్చరాయన వూరుకుంటాడా? విసిగి విసిగి నిజంగానే ఓ కుర్రదాని వెంటపడ్డాడు! ఇది తెలిసి ఆ బక్క దెయ్యం పోట్లాట వేసుకుని పుట్టింటికెళ్ళిపోయింది నెలక్రితం! ఇంకేముందీ, ఆ లెక్చరాయనకు ఎంత స్వేచ్ఛ! ఆ రెండు జడల కుర్రదీ, ఆయనా ఇక్కడే ఇంట్లోనే అర్థరాత్రుల దాకా ఒకటే పకపకలూ వికవికలూ....

ఏమంటే ట్యూషన్లనే సాకు!"

శర్మ కళ్ళలో వారించి ఆమె నాపాడు.

డిటెక్టివ్‌లు తేరుకున్నారు. "ఇది కొంచెం వింతగా వుంది. మీరు చెప్పేది నిజమా?"

ఆమె జవాబిచ్చింది విసురుగా. "చమన్లు పంపండి-కోర్టుకొచ్చి ఇంకా గట్టిగా చెప్తాను. మీరక్కడ తట్టుకో లేరని వూరుకుంటున్నానుగానీ...."

"ఆమె పేరేమిటి? ఎక్కడుంటుంది?"

"అది నాకు తెలీదు. కానీ అది టక్కరి కుర్రదని తెలుసు."

"మొన్న రాత్రి ఇక్కడుందా?"

"వుంది. మొన్న సాయంత్రం వచ్చి రాత్రి ఎప్పుడు పోయిందో తెలీదు."

"నిన్న వచ్చిందా?"

"నేను చూడలేదు."

"వాళ్ళెప్పుడైనా పోట్లాడుకునేవారా?"

"పోట్లాడుకున్నా బాగుండేది! ఆ పకపకలూ.... అబ్బా!...."

"ఆమె ఎలా వుంటుంది?"

"ఆ కుర్రది...." అంటూ ఆమె చటుక్కున భర్త వైపు తిరిగింది, "మొన్న మనం సినిమా చూశాం, ఏమిటది?"

"క్రోకడైల్స్ .... నో, నో! కొండళ్ళొస్తున్నారు జాగ్రత్త!"

"అందులో కుర్ర కోడలు—ఆ చిన్న కోడలెవరు? అలాగే వుంటుందా కుర్రది...."

అతను తల గోక్కున్నాడు. అంతవరకూ తలుపుకు

వేలాడుతూ వింటోన్న ఎనిమిదేళ్ళ కుర్రాడు వెంటనే అన్నాడు. "గీత! ఫోటో వుంది చూపిస్తా!"

అందరూ విస్తుపోయి చూస్తూండగానే, లోపలికురికి పత్రిక తెచ్చి గబగబా పేజీలు తిప్పి చూపించాడు.

4

"మిస్టర్ లాల్ —" కృష్ణన్ అన్నాడు గదిలో చూపిస్తూ, "వేలిముద్రలు ఈ గదిలో చాలా వున్నాయి. అన్ని వస్తువులమీద అవెప్పుడేర్పడ్డాయో చెప్పలేం. అన్ని వస్తువులమీదా వేలిముద్రలు మనకవసరమనుకోను. కానీ ఈ పౌడరు టిన్ను-ఇది అతి ముఖ్యమైన ఎవిడెన్సు. హత్యా సమయంలో ఇది ఉపయోగించబడింది. దీన్ని విసిరికొట్టడంవల్లనే ఆ అద్దం పగిలింది. ఇద్దర్లో యెవరు విసిరారో చెప్పలేం....

"కానీ దీనిమీద ఇద్దరి వేలిముద్రలున్నాయి. హతుడివి, సుమతివి. ఒక పౌడర్ టిన్నుమీద భార్యాభర్తల వేలిముద్రలుండటం అసహజంకాదు. కానీ అవి ఏర్పడ్డ సమయ సందర్భాలు మనకు సందేహాస్పదం. ఇదే మన ఇన్వెస్టిగేషన్‌లో క్లిష్టమైన అంశం."

"అవెప్పుడేర్పడ్డాయో తెలుసుకోలేమా?"

"అది ఎలిబీమీద ఆధారపడి వుంటుంది, మిష్టర్ లాల్. ఆమె ఈ నెల రోజులూ ఇక్కడ లేదని—ముఖ్యంగా మర్డర్ జరిగిన రాత్రి—తన ఊళ్ళోనే వున్నట్టు సాక్ష్యం వుంటే, ఈ టిన్నుమీద ఆమె వేలిముద్రలు ఆమె ఊరికెళ్ళేముందు ఏర్పడ్డవనుకోవాలి.

"ఈ ఎలిబీ ఆమెకు లేకపోతే, అప్పుడీ వేలిముద్రలు మర్డర్ జరిగిన రాత్రే ఏర్పడ్డాయని అనుకోవలసివస్తుంది. అదామెకు ఇన్‌క్రిమినేటింగ్ ఎవిడెన్సు కానీ ఆమె అంగీక

రించకపోవచ్చు. తనుఊరుకెళ్ళేముందే ఏర్పడ్డాయనవచ్చు. ఇక్కడ బెనిఫిటాఫ్ డౌట్‌కు అవకాశమూ లేదు. ఈ టిన్నుని తామిద్దరు కలిసి వాడుతున్నట్టు ముందే కమిట్ చేసింది గనుక, ఊరికెళ్ళేముందు ఆమె వేలిముద్రలు దీని మీద వున్నా, భర్త వాడకంలో ఈ నెలరోజులూ అవి చెక్కు చెదరకుండా ఉండటం అసంభవం. భర్త ఈ నెల రోజులూ అసలీ టిన్నుని ముట్టుకోలేదనడం కూడా అసహజంగా వుంటుంది."

"వెల్, ఆమె ఎలిబీని చెక్ చేయండి."

"చేస్తాం. ఇక ఈ కత్తిమీద వేలిముద్రల్లేవు. పిడి శుభ్రంగా వుంది. ఈ కత్తి తమది కాదంటోంది సుమతి. ఇంట్లో వున్న రెండు కత్తుల్ని చూపించింది. ఈ కత్తి వాటికంటే పెద్దగాను, మొండిగానూ వుంది. బ్రెడ్ కోసే కత్తిలా వుంది. ఈ కత్తి యెవరిదో తెలుసుకోవాలి...."

"పైన శర్మ ఇంట్లో కత్తులు చూడండి."

"చూస్తాం. తర్వాత....ఇటు చూడండి, ఈ కప్పు సాసర్ల మీద వేలిముద్రలున్నాయి. ఒకదానిమీద హాతుడివి. రెండోదానిమీద మరొకరివి. మర్డర్ కుముందు కాఫీ చేసుకుని తాగివుండాలి. ఈ అతిధి వేలిముద్రలు ఇంకా చాలా చోట్ల వున్నాయి. ఆ కిటికీమీద, ఆ కుర్చీ మీద, టేబులుమీదా. మిష్టర్ లాల్ బెడ్ మీద కూడా. ఇంకా కిచెన్‌లో కొన్ని పాత్రలమీదా .... ఈ వేలి ముద్రలు మనకు తెలియని వ్యక్తివైనా, హాతునికి ఆ వ్యక్తి కొత్తకాదు. కిచెన్‌లోకి వెళ్ళగల్గేంత చనువున్న వ్యక్తి."

"అర్థమైంది, ఇంకా?"

"సుమతివి కూడా చాలా చోట్ల వున్నాయి. అయితే

అవన్నీ ఈ టిన్నుమీద అంతగా ఇన్‌క్రిమినేటింగ్ కావు. వాటి అస్తిత్వంపట్ల సందేహాలు కలగవు."

"ఆ అద్దం ముక్కలమీద?" అడిగాడు జాన్.

"వున్నాయి. రెండింటిమీద వున్నాయి. మిగిలిన ముక్కలమీద మరకలూ లేవు. ఆ రెండింటిమీద వేలి ముద్రలు నాతునివి. మరో రకం పరాయి వేలిముద్రలు ఈ తలుపుమీద వున్నాయి ..."

"ఇక ఆ గోడకి చూడండి — ఆ ఫోటో ఫ్రేము ఆధారంమీంచి తొలగి వేలాడుతోంది. ఆ అద్దం పగల్లేదు. అదెలా తొలగిందో చూస్తే — ఘర్షణలో వస్తువులు విసురుకున్నప్పుడు ఏదో వెళ్ళి తగిలివుంటుందనిపిస్తోంది. కానీ అప్పుడు అద్దం పగలాలి. బహుశ ఏదో మెత్తని వస్తువు....పుస్తకంలాంటిది తగిలివుంటుంది. అద్దం పగల కుండా అది ఆధారంమీంచి మాత్రమే జారిపోయింది. కానీ దానికి తగిలిన వస్తువేదో కిందపడిపోయిలేదు...."

"ఆ సమయంలో కిటికీలు తెరిచి వుండవచ్చా?" జాన్ అడిగాడు మళ్ళీ.

లాల్ అక్కడ్నుంచి కదిలి నెమ్మదిగా సుమతి వున్న చోటికి వెళ్లాడు. ఆమె గాభరాగా చూసింది.

లాల్ సూటిగా చూస్తూ అడిగాడు. "మీ వారి గర్ల్ ఫ్రెండ్ ఎవరు సుమతి?"

ఆమె ఉలిక్కిపడింది. లాల్ ఎదురు చూశాడు.

ఆమె అంది తేరుకొని. "వనజ — శాంతినగర్‌లో వుంటుంది, ఇరవై ఆర్యారో నెంబర్ ఇంట్లో!"

"గుడ్, ఇది ముందే ఎందుకు చెప్పలేదు?"

"ఎలా చెప్పమంటారు?"

"వనజ గురించి మీరు మీ వారితో పోట్లాడి వెళ్ళి

పోయారు."

"అవును. నామీద ప్రేమ తగ్గి ఆమె వెంట పడ్డారు."

"ప్రేమ తగ్గలేదు. మీ ఇన్ఫీరియారిటీ ఆయన్ని వేధించి విసిగించి ఆ దారి పట్టేలా చేసింది. మీరు పోట్లాడి—బహుశ ఇక రానని చెప్పి ఊరెళ్ళిపోయారు. ఈ విషయం అక్కడెవరికీ చెప్పివుండరు. మీవారిమీద మనసులో కక్ష పెట్టుకుని వచ్చి మొన్న కత్తితో పొడిచేశారు—"

"మొన్న రాత్రి నేను మా ఊళ్ళోనే వున్నాను. ఇది రుజువు చేసుకోగలను. నాకే కక్షా లేదు. నేనీ నెల రోజులు బాగా ఆలోచించాను. తప్పు నాదే అనిపించి పశ్చాత్తాప పడ్డాను. నేనెందుకు అందగత్తెని కానని మనసులో మథనపడాలి? ఆ మాట ఆయనెప్పుడూ అనలేదు. ఆయనే నన్నిష్టపడి చేసుకున్నారు. అందువల్ల తిరిగి ఆయనతో మంచిగా వుంటూ నా వైపు తిప్పుకోవాలనే ఉద్దేశ్యంతో వచ్చాను. నేనెలాటి ఆవేశంతో రాలేదు...."

"మొన్న రాత్రి మీకు ఎలిబీ వుంటే, ఇక్కడ ఆ పౌడరు టిన్నుమీద మీ వేలిముద్రలెలా వచ్చాయి?"

"ఇన్స్పెక్టర్ కూడా ఇలాగే ఆలోచించకుండా అడిగాడు. నేనాయన్ని హత్యచేస్తే, కత్తిమీద వేలి ముద్రలు తుడిచినదాన్ని, ఆ టిన్నుమీద తుడవకుండా పోతానా?"

లాల్ శాంతినగర్‌లో ఆ యింటికి చేరుకునేసరికి పద కొండున్నరయింది.

ఆమె ఇంట్లోనే వుంది.

తను చూసిన ఫోటోలోలాగానే వుందామె. వయసు ఇరవై మించదు. శర్మ భార్య అన్నట్టు రెండు జడలున్నాయి.

ఆమె వార్త తెలిసి వెక్కి వెక్కి ఏడిచింది. లాల్ ఆమె ఏడుపులోని మాలికతను పరిశీలిస్తున్నాడు. తల్లి ఆమె తల నిమిరింది. లాల్ ఆమెని తేరుకోనిచ్చాడు. అప్పుడన్నాడు, "ప్రేమించడం, అది ఫలించక ఆశోపహతులుకావడం ప్రపంచంలో మామూలే. ప్రేమించడమంత పొరపాటు మరొకటి లేదు. ప్రేమించబడడంలోని హాయి అందులో లేదు. కనుక మనం ఎప్పుడూ స్వీకర్తలుగానే వుండాలి తప్ప దాతలు కాకూడదు—"

"నేనేం దానం చేయలేదు!" అందామె కోపంగా.

"లెక్చరర్ గారికి మీరు మనసివ్వలేదా?"

"ఎవరన్నారు? ఆయన భార్య అంటోందంటే అవన్నీ అబద్ధాలే. ఆమె అనుమానాలే. ఆయన్ను నేను మా లెక్చరర్ గానే గౌరవించాను. ఆయన కూడా నన్ను విద్యార్థిగానే చూశారు. మరో దృష్టితో నన్నెప్పుడూ చూడలేదు. కొంతకాలంగా ఆయనెందుకో విచారంగా, ఆందోళనగా వుంటూ నాతో చనువు పెంచుకున్నారు. నా సమక్షంలో ఆ వ్యథలన్నీ—అవేమిటో నాకప్పుడు తెలియదు—మర్చిపోయినట్లు కన్పించేవారు. త్వరలోనే మేం మంచి స్నేహితులమైపోయాం. నావల్ల ఆయనకు బాధలు తొలిగితే నాకంతకంటే గర్వకారణమేముంది? కానీ ఆయన భార్య అపార్థం చేసుకుంది మా స్నేహాన్ని."

"మొన్న రాత్రి మీ రెప్పటివరకున్నా రక్కడ?"

"పదిగంటలవరకున్నాను...."

"రోజూ అంత సేపు వుంటున్నారా?"

"లేదు. ఎనిమిది గంటలకే వచ్చేసేదాన్ని. ఆలస్యమైతే అన్నయ్య వచ్చేస్తాడు. కోప్పడతాడు. అతనికిది ఇష్టం లేదు. ఒక రోజు గంట ఆలస్యమైందని బాగా కోప్పడ్డాడు. ట్యూషన్ కైతే ట్యుటోరియల్ కాలేజికే వెళ్ళమన్నాడు. మరోసారి ఆలస్యం జరిగితే నేరుగా అక్కడికే వచ్చి లెక్చరర్ గార్ని తిట్టాడు — భార్య ఇంట్లో లేనప్పుడు నా చెల్లెల్ని వుంచుకుంటావా ఇంత రాత్రి — అని. మళ్ళీ అక్కడికెళితే నన్ను కొడతా నన్నాడు. నేను తెలియకుండా మొండిగా పోతూనే వున్నాను. అతను వచ్చేలోగా ఇంటికొచ్చేస్తున్నాను."

"మరి మొన్న పదిగంటలకొస్తే ఏమీ అనలేదా?"

"మొన్న నేను ఇంటికి రాలేదు. ఫ్రెండ్ ఇంటికెళ్ళి పడుకున్నాను. ఉదయం వచ్చాను. సాయంత్రం స్నేహితులతో సినిమాకెళ్ళి వాళ్ళింట్లో పడుకున్నా నన్నాను. నమ్మాడు."

"బాగా నమ్మించారు!" లాల్ అన్నాడు నవ్వుతూ, "మరి నిన్న వెళ్ళలేదా?"

"వెళ్ళాను. కానీ తాళం వుంది. పనిమీద ఎక్కడికో వెళ్ళారనుకొని వచ్చేశాను...."

లాల్ ఆమె మొహంలోకి గుచ్చి చూశాడు. "నిజం చెప్తున్నారా? నిన్న సాయంత్రం మీరక్కడికి వెళ్ళారా?"

"అబద్ధం ఎందుకు చెప్పాలి?"

"మీ అన్నయ్యలా నమ్మించడానికి, మీ అమాయకత్వాన్ని వెల్లడించడానికి. మొన్న మీరక్కడ చాలా రాత్రి వరకు వుండలేదా? లెక్చరర్ గారితో కాఫీలు తాగుతూ కబుర్లు చెప్పుకుంటూ కాలక్షేపం చేయలేదూ?

ఆ ఏకాంతం చూసి — ఎదురుగా మీ అందచందాలకి చలించి—లెక్చరర్ గారు చొరవతీసుకుని మీతో అతిగా ప్రవర్తించలేదూ? మీరప్పుడు ప్రతిఘటించినా గదంతా తిరగలేదూ? ఇహ ఓడిపోయే స్థితిలో తెగించి మీరక్కడ టేబులుమీద వున్న పేపర్ నైఫ్‌తో ఆయన్ని పొడవలేదూ?"

ఆమె బిత్తరపోయింది. తల్లి చెయ్యి గట్టిగా పట్టుకుంది.

"మీరు—మీరు లెక్చరర్ గార్ని అంత నీచంగా భావిస్తున్నారా?"

"అన్ని పరిస్థితుల్లోనూ మనిషి వున్నతంగా వుండలేడు. మీ ఫ్రెండ్ గురించి—ఎవరా ఫ్రెండ్?"

"ముషీరాబాద్‌లో వుంటుంది. మొన్న రాత్రంతా నేనక్కడే వున్నాను."

"భోజనం అక్కడే చేశారా?"

"నేనెక్కడా భోజనం చేయలేదు! లెక్చరర్ గారితో కలిసి ఎనిమిది గంటలవరకే వున్నాను! ఆ తర్వాత పది గంటలవరకు ఒంటరిగా వున్నాను! ఆ తర్వాత—ఆ తర్వాత వచ్చేశాను—"

"మీరక్కడ ఒంటరిగా ఎందుకున్నారు?"

"ఆయన ఎవరితోనో బయటకెళ్ళారు."

"ఎవరది?"

"అతన్ని రెండు మూడు సార్లు చూశాను. ఫిరంగి అనే పత్రిక ఎడిటర్ కుమారుడని చెప్పారు. రవీందర్ అతని పేరు. అతను ఎనిమిది గంటలకి వచ్చాడు, స్కూటర్ మీద. లోపలికి రాలేదు. వాళ్ళిద్దరు బయటే మాట్లాడుకున్నారు. తర్వాత ఆయన వచ్చి నాతో గంటలోగా వస్తానని చెప్పి వెళ్ళిపోయారు. కానీ గంట దాటి

రెండుగంటలైనా రాకపోయేసరికి- నేనుండలేక అన్నయ్య భయానికి—అతనెక్కడొచ్చేస్తాడోనని భయపడి వెళ్ళిపోయాను, కిటికీలూ తలుపులూ మూసేసి, పది గంటలకి తిన్నగా ఫ్రెండ్ యింటికెళ్ళిపోయాను. ఆయనెప్పుడింటికొచ్చారో తెలీదు."

లాల్ కొన్ని క్షణాలవరకు ఆమెనే చూస్తూండిపోయాడు."

"ఇప్పుడు మీ అన్నయ్య ఎక్కడున్నాడు?"

"ఊరెళ్ళాడు నిన్న ఉదయమే, విజయవాడకి."

"దేనికి?"

"అతని ఫ్రెండ్ పెళ్ళికి. రేపు సాయంత్రం వస్తాడు."

"పేరేమిటి?"

"జయకర్."

లాల్ ఆమె తల్లిని అడిగాడు. "మొన్న రాత్రి అతనెక్కడున్నాడు?"

"తొమ్మిది గంటలకి వచ్చి ఇంట్లోనే వున్నాడు."

"మధ్య రాత్రి ఎక్కడికైనా వెళ్ళాడా?"

ఆమె తెలీదన్నట్లు తలూపింది. లాల్ లేచాడు.

# 5

ఎడిటర్ చొక్కారావు లాల్ని సాదరంగా ఆహ్వానించి కూర్చోబెట్టాడు, రెండు కాఫీలకి బాయ్ని పంపిస్తూ. యాభై ఏళ్ళుంటాయతనికి. పొట్టిగా లావుగా వున్నాడు. తలమీద చాలావరకు వెంట్రుకలూడిపోయాయి. కళ్ళకు బైఫోకల్ అద్దాలున్నాయి. అతని ముందు టేబులుమీద చాలా కాగితాలూ, ఫైరంగి కాపీలూ పడివున్నాయి.

లాల్ వార్త చెప్పేవరకూ అతడు ఉత్సాహంగా వున్నాడు, పశల ప్రశ్నలువేస్తూ. వార్త తెలియగానే

తెల్లబోయాడు. లాల్ తేరుకోనిచ్చాడు. వచ్చిన కాఫీ సిప్ చేస్తూ.

"ఇది నేనూహించనిది! నమ్మలేకపోతున్నాను...." అన్నాడతను ఎలాగో.

"పత్రికల వాళ్ళు వార్తలు నమ్మాలి" అన్నాడు లాల్.

"ప్రభాకరరావు ఎంత మంచివాడు! ఆయన్ని చంపే వారెవరుంటారు దుర్మార్గులు .... నేనేం ఆలోచించలేక పోతున్నాను."

"మీ అబ్బాయి రవీందర్ ఆయన్ని కలిసినట్లు తెలిసింది, మొన్న రాత్రి. అతన్ని కొన్ని ప్రశ్నలడగాలి, ఎక్కడున్నాడు?"

చొక్కారావు ఉలిక్కిపడ్డాడు. ఉలికిపాటుని కప్పిపుచ్చుకుంటూ వెంటనే సిగరెట్ ముట్టించుకున్నాడు, లాల్‌కొకటి ఆఫర్ చేస్తూ.

"వాడు—ప్రభాకరరావుని కలిశాడా?"

"అవును, అతన్ని త్వరగా పిలుస్తారా?"

అతను నిదానంగా ఫోనెత్తాడు. "యింట్లోనే వుంటాడు, పిలుస్తానుండండి" అంటూ నెంబర్ తిప్పి రెస్పాన్స్ వచ్చాక మాట్లాడసాగాడు.

లాల్ అతన్నే గమనిస్తున్నాడు.

అతను ఫోనే పెట్టేస్తూ "పది నిమిషాల్లో వచ్చేస్తాడు" అన్నాడు.

లాల్ తలూపాడు. "మీకు తెలిసి ప్రభాకరరావుకు విరోధు లున్నారా?"

"విరోధులా?" చొక్కారావు భుజాలెగరేశాడు. "ఆయన కెవరుంటారు విరోధులు? పత్రికకు సంబంధించి

నంతవరకు వుండే వీలులేదు. ఆయన మా పత్రికకు ఏడే ళ్ళుగా రెగ్యులర్ కాలమిస్టు మిస్టర్ లాల్. మా పత్రిక కొంచెం అతివాద ధోరణులు కలిగివున్నా, ఆయన ఎవరి మీదా యే ఉద్దేశ్యంతోనూ ఆరోపణలు చేయనూలేదు, కించపర్చనూ లేదు. ఏ ఇజాల జోలికి పోయేవారే కాదు. సమకాలీన పరిస్థితుల్ని, నాగరికత పోతున్న వెర్రి పోకడల్ని వ్యంగ్యంగా చిత్రించేవారు. అంతే. బ్లిట్జ్ కి ఆఖరి పేజి యెలా ఆకర్షణో, అలా మా పత్రిక్కి ఆయన శీర్షిక ఒక ఎస్సెట్."

అతను కాఫీ అందుకొంటూ యింకా చెప్పాడు. "అంతవరకే ఆయన సంబంధం. మేం ప్రచురించే వార్తలతో, మేం ఎదుర్కొనే వివాదాలతో ఆయనకేం సంబంధం లేదు. మా వార్తలు మాకు కొందరు వ్యతిరేకుల్ని సంపాదించి పెట్టింది వాస్తవమే. సరిగా చెప్పాలంటే శత్రువులు లేని పత్రిక మనజాలదంటాను. ఎల్లో జర్నలిజం వర్ధిల్లడానికిదే కారణం - అలాగని మాది ఎల్లో జర్నలిజం కాదు. నిజాల్ని నిర్భయంగా, సభ్యత కలిగిన భాషలో బైటపెట్టే పత్రిక."

అప్పుడొచ్చాడొక పాతికేళ్ళ యువకుడు. అతను జుట్టు బాగా పెంచాడు. తీరుతెన్నులు సినిమా అనుకరణ జాడ్యాన్ని తెలియజేస్తున్నాయి. ముఖభావాలు తీవ్రమయిన అశాంతినీ, అన్నీ సాధించబోయి యేదీ సాధించలేకపోయానన్న అసంతృప్తినీ వెల్లడిస్తున్నాయి.

తండ్రి అతనికి లాల్ని పరిచయం చేస్తూంటే బెదురుగా చూశాడు. కుర్చీలో యిబ్బందిగా కూర్చున్నాడు.

అప్పుడు చూశాడు లాల్. అతని కుడి చేతికి కట్టు వుంది.

ప్రభాకరరావు మరణవార్త అతిన్ని తీవ్రంగా చలింప జేసింది.

"సార్! యిది యెలా జరిగింది? నో, ఆయన పోవ డానికి వీల్లేదు. నాన్నా! యేమిటిది? నమ్మలేకపోతు న్నాను."

"నేనూ నమ్మలేను" అన్నాడు తండ్రి. వాళ్ళిద్దరూ ఒకర్నొకరు అనుమానంగా చూసుకొంటూంటే అది గమ నించాడు లాల్.

"వెల్, రవీందర్. మొన్న రాత్రి మీరు ఆయన్ని కలుసుకున్నట్టు తెలిసింది. ఆ విషయం మాట్లాడడానికి వచ్చాను."

అతను వులిక్కిపడ్డాడు. "ఆ స్టూడెంటు చెప్పిందా? అవును. మొన్న సాయంత్రం లెక్చరర్ గారు నన్ను రమ్మన్నారు. ఎనిమిదిగంటల కెళ్ళాను. అప్పుడామె అక్కడే వుంది. నేను లోపలికి పోలేదు. ఆయనే బయటకొచ్చారు. అప్పుడు మే మిరువురము కలసి బార్ కెళ్ళాం సార్. మే మిద్దరము కలసి పుచ్చుకుని చాలా రోజులయింది. ఆయన నాతో తప్ప పుచ్చుకోరు. అందు కని రమ్మన్నారు. ఆ అమ్మాయిని యింట్లోనే వుంచి వెళ్ళాం. నల్గొండ క్రాస్ రోడ్స్‌లో రీజెంట్ బార్ కెళ్ళాం సార్.

ఆయన మితిమీరి తాగేశారు. అక్కడే చికెన్ తీసు కుందామన్నాను. కానీ ఆయన వెజిటేరియన్. నాయర్ హోటల్ కే వెళదామన్నారు. అక్కడ్నించి వెళ్ళాం. కానీ సార్, దురదృష్టం."

"ఏం జరిగింది?"

"ఆయన ఓవర్ డోస్‌తో తూలిపోతున్నారు. ఏం

మాట్లాడుతున్నాడో ఆయనకే తెలియదు. భోజనం చేస్తూ రెస్టలో రాళ్లొస్తున్నాయని సర్వర్లని తిట్టేరు. అంతటితో ఆగక నాయర్‌నీ పిల్చి తిట్టారు. అతన్నీ, అతని హోటల్నీ దుయ్యబట్టారు. నేను వారించినా వినలేదు. నాయర్ కోపగాడులా వున్నాడు సార్. ఆయన పరిసితిని గమనించక ఆవేశంతో చేయిచేసుకోబోయాడు. జనం పట్టి లాగారు. అప్పుడు లోపలి కెళ్ళి కత్తి పట్టుకొచ్చాడు సార్."

"దాంతో యేం చేశాడు?"

"ఏం చేసేవాడో మేం దాన్ని లాక్కున్నాం సార్. నేను లెక్చరర్ గారితో బయటపడి స్కూటర్ ఎక్కాను. మేం వెళ్ళిపోతూంటే నాయర్ అరుస్తూనే వున్నాడు."

"అప్పుడు?"

"అంతే సార్. ఆయన్ని తిన్నగా తెచ్చి యింటివద్ద డ్రాప్ చేశాను. అప్పటికి చాలా రాత్రయింది. పదకొండు కావస్తోంది. అప్పుడా స్టూడెంటు యింట్లో వుందో లేదో చూడలేదు. నేను బయటనుంచే వచ్చేశాను—యిహ జన్మకి యీ అనుభవం వద్దనుకొని."

"ఆ తర్వాత రాత్రంతా యెక్కడున్నారు?"

"యింట్లోనే వున్నాను. ఫాదర్‌ని అడగండి."

తండ్రి తలూపాడు.

"మీ చేతికి గాయం యెలా అయింది?"

రవీందర్ తడబడ్డాడు. "ఇది నిన్న ఉదయం కోసుకుంది అరచేతిలో. మా వంటవాడు ఆలస్యం చేస్తూంటే నేనే పనిలోకి దిగి కత్తిపీటతో కోసుకున్నాను సార్, ఉల్లిపాయలు తరుగుతున్నప్పుడు."

లాల్ వాళ్ళిద్దర్నీ నిశ్శబ్దంగా కొన్ని క్షణాలు గమ

నించి లేచాడు.

"ఆల్ రైట్. అయితే మీ రిద్దరిప్పుడు క్రైమ్ బ్రాంచి కెళ్ళండి. ఇన్ స్పెక్టర్ కృష్ణన్ వుంటాడు. అతనికి మీ వేలిముద్ర లిచ్చి స్టేట్ మెంట్స్ కూడా యివ్వండి."

వాళ్ళిద్దరి మొహాలు యెర్రబారాయి.

నల్గొండ క్రాస్ రోడ్స్ లో నాయర్ హోటల్ ముందు కారు దిగేసరికి ఒంటి గంట దాటింది. లాల్ లోపలికి నడిచి కౌంటర్ వెనుక నున్న వ్యక్తిని నాయరుగా గుర్తించాడు. నాయర్ నవ్వుతూ ఆహ్వానించాడు.

కానీ లాల్ వార్త చెప్పగానే నిలువునా వణికి పోయాడు.

లాల్ వణకనిచ్చాడు.

అతను వణుకుతూనే చెప్పాడు. "లేదు సార్, లేదు లేదు! మా కత్తులన్నీ ఇక్కడే వున్నాయి! నేనిక్కడే వున్నాను మొన్నరాత్రి! ఆయన నన్ను తిట్టేస్తోంటే చంపుతానని బెదిరించాను ఆవేశంలో. అప్పటి వుద్రేకంలో ఆ పని చేసేవాడ్నేమో! వాళ్ళంతా ఆపారు కాబట్టి.... సరిపోయింది. లేకపోతే .... ఓహ్, తర్వాత నిదానించి ఆలోచిస్తే ఆయనంత మంచివాడు, మా రెగ్యులర్ కస్టమర్, ఎప్పుడు ఇలా ప్రవర్తించలేదు, తాగేశాడు కాబట్టి ఇలా చేశాడు పోనీయ్ అనుకొని క్షమించేశాను.... నా ఆవేశం అణచుకున్నాను. ఆ గొడవ అప్పుడే మర్చిపోయాను...."

"ఆ రాత్రంతా మీ రెక్కడెక్కడున్నారు?"

"పన్నెండు గంటలకి యింటికెళ్ళిపోయాను. మళ్ళీ నాలుగ్గంటలకి లేచి ఇక్కడకొచ్చాను. నా భార్య నడు

గండి! పనివాళ్ళ నడగండి!"

"సరే, మీరిప్పుడు క్రైంబ్రాంచ్ కెళ్ళండి. యిన్స్పెక్టర్ కృష్ణన్ వుంటాడు. మీ వేలిముద్రలిచ్చి అతనికి మీ గోడు విన్పించుకోండి!" అక్కడ్నుంచి వచ్చేశాడు లాల్.

# 6

మధ్యాహ్నం రెండున్నరకి తిరిగివచ్చాడు జాన్.

"పార్టనర్, దీపక్ కుమార్ గురించి వింటావా?"

"ఓహ్, అతని గొడవ ఏమిటి?"

"గొడవా గలాటా! ఏడ్చి మొత్తుకుంటున్నాడు!" అన్నాడు జాన్ సిగరెట్ వెల్గించుకుంటూ, "అటు పరీక్షపోయింది—ఇటు ప్రాణంమీదకొచ్చింది! ప్రభాకర రావు అతన్ని పట్టుకుంటే బెదిరించాడు. అదే పాయంత్రం బస్టాపులో గల్లాపట్టుకుని కత్తి తీశాడు. కానీ జనం తన్నబోతే తప్పించుకు పారిపోయాడు. ప్రభాకరరావు పోలీసు రిపోర్టివ్వలేదు, ప్రిన్సిపాలుకి కంప్లెయింట్ చేశాడు. ఇది జరిగి నెలా పదిరోజులైంది....

"ఆ తర్వాత పదిహేను రోజులకి—ప్రభాకరరావు ఈవెనింగ్ క్లాసులు తీసుకొంటోన్న భారత్ ట్యుటోరియల్స్ దగ్గరా ప్రయత్నించి విఫలుడయ్యాడట! అక్కడి విద్యార్థులు అంటున్నారు. అప్పటికీ ఇతను పోలీసురిపోర్టు ఇవ్వలేదట. అవి ఉట్టి బెదిరింపులే తప్ప — చంపే వాడయితే అన్నివిధాలా కలిసొచ్చే చోటు తన ఇంటికే వచ్చి చంపేవాడని అనేవాడట. అయితే దీపక్ మొన్న రాత్రి ప్రభాకరరావు ఇంటికెళ్ళాడు...."

"ఇంటికెళ్ళాడా?"

"అవును, మొన్న రాత్రి ఒంటిగంటకి ఆ వీధిలోంచి

పరుగెత్తి పారిపోతోంటే ఊరకుక్క వూరుకోక పడిందట అతనివెంట! అప్పుడా అరుపులకి అర్జున్ సింగ్ అనే ఆ పేటకి చీఫ్ గూండా మేల్కొని అడ్డగించి పట్టుకున్నాడట! ఎందుకు ఉరుకుతున్నావంటే కుక్క వెంట పడిందన్నాడట దీపక్. మన చీఫ్ కుక్కనో కిక్ ఇచ్చి, దీపక్ కి గ్రీన్ సిగ్నలు ఇచ్చేశాడట! అతను వున్నత కుటుంబానికి చెందినవాడిలా, మర్యాదస్తుడిలా కనిపించడంవల్ల మన చీఫ్ కి డౌట్స్ రాలేదట—

"కానీ ఇప్పుడు పోలీస్ కస్టడీలో దీపక్ మొత్తుకు నేది వేరుగా వుంది. తను చంపడానికి పోలేదనీ, అసలా వుద్దేశ్యం మానుకున్నట్టూ చెప్తున్నాడు. ప్రభాకరరావు పరువుతీసి బుద్ధి చెప్పాలనుకున్నాడట. వనజతో అతని వ్యవహారం తెలుసుకుని వాళ్ళిద్దర్నీ కలిపి మాంచి ఫోటోలు తీసి సరఫరా చేయాలనుకున్నాడట.

"ఈ ఉద్దేశ్యంతో నే మొన్న రాత్రి కెమెరా పట్టుకుని వెళ్ళాడట. కానీ ఇల్లు చీకటిగా వుందట. తలుపులూ కిటికీలూ మూసి వున్నాయట. లోపల చప్పుడూ లేదట. ముందు తలుపు దగ్గరకు వేసివుండడం చూసి, తీసుకుని లోపల అడుగుపెట్టాడట. అలాగే వెళ్ళి టార్చి వేస్తూ పక్క గదిలో శవాన్ని చూశాడట—"

"ఎన్ని గంటలకి?"

"ఒంటిగంటకి."

"ఒంటి గంటకా?"

"అతనంటున్నాడు. అది చూసి పరుగెత్తాడట వీధిలోకి. అప్పుడా చీఫ్ చేతిలో పడ్డాడట. వాడ్ని వదిలించుకోవడానికి కెమెరా లంచంగా పెట్టాడట. కానీ ఆ చీఫ్ ఇది తిరస్కరిస్తున్నాడు. దొరబాబునుంచి

ఏమీ తీసుకోలేదంటున్నాడు. అతనింటి సోదాలో కెమెరా దొరకలేదు. ప్రస్తుతం వాళ్ళిద్దరు వాదించుకుంటున్నారు...."

"దీపక్ ఒంటిగంటకి శవాన్ని చూశాడా, జాన్?"

"అవునట, పార్టనర్. కానీ తను ఆ పని చేయలేదంటున్నాడు. ఫొటోలు మాత్రమే తీయడానికి వెళ్ళానంటున్నాడు. ఆ సమయంలో అతని దగ్గర అసలు కెమేరానే లేదంటున్నాడు చీఫ్."

"మరి మూడున్నరకు...." లాల్ ఏదో అనబోతూ ఆగిపోయాడు.

ఫోన్ మోగుతోంది.

లాల్ ఎత్తాడు. ఒక వృద్ధ స్త్రీ గొంతు వొణుకుతూ పలికింది అవతలనుంచి. "హలో, డిటెక్టివ్ బాబేనా?"

"అవును...." లాల్ ముఖం చిట్లించాడు.

"డిటెక్టివ్ బాబూ, నేను చెప్పేది జాగ్రత్తగా వినండి...."

"ఎవరు మీరు—ముందు చెప్పండి?"

"అది చెప్పను. మా ఆయనకు తెలిస్తే చంపేస్తాడు. ఆయనకు తెలియకుండా మీకు చెప్తున్నాను.... ఈ రహస్యాన్ని గుండెల్లో పెట్టుకుని వుండలేను. మీరు నా గురించి తెలుసుకునే ప్రయత్నం చేయకండి, డిటెక్టివ్ బాబూ! లేకపోతే మిమ్మల్ని జీవితాంతం అసహ్యించుకుంటాను."

"సరే, చెప్పండి."

"లెక్చరర్ హత్య గురించి....ఆ రాత్రి నేనొకటి చూశాను."

"ఏం చూశారు?"

"మొన్న రాత్రి మా ఆయన నైట్ డ్యూటీకి ఫ్యాక్టరీకెళ్ళిపోయాక నాకేం తోచక కిటికీ దగ్గర కూర్చున్నాను....ఇంట్లో ఎవరూ లేరు. పిల్లలకి రెక్క లొచ్చాయి. నే నొక్కదాన్నే బిక్కు బిక్కుమంటూ గడపాలి. అప్పుడు డిటెక్టివ్ బాబూ, పన్నెండున్నరకి, లెక్చరర్ గారింట్లో యెవరో కన్పించారు. ఆ చీకట్లో సరిగా కన్పించలేదు. ఆ ఆకారం తలుపు దగ్గర్నుంచి కదిలి గబగబా ప్రక్కనే మెట్లెక్కి పైకి వెళ్ళి పోయింది—"

లాల్ కళ్ళు పెద్దదయ్యాయి. "పైకి అంటే శర్మ పోర్షన్లోకా?"

"అవును, డిటెక్టివ్ బాబూ. ఆ మనిషి మళ్ళీ కిందికి రాలేదు. అది శర్మే అనిపించి, గాలికి కిందకొచ్చి పచార్లు చేస్తున్నాడేమో అనుకొని, నేను కిటికీ మూసేసి పడు కున్నాను. పెద్దగా ఆలోచించలేదు. కానీ ఇవ్వాళే ఉదయం జరిగింది తెలిసి.... తెలిసి.... ఈ విషయం మీకు ఉపయోగపడుతుందేమోనని చెప్తున్నాను.

"డిటెక్టివ్ బాబూ, లెక్చరరూ శర్మా ఇద్దరూ రెండు రోజులక్రితమే పోట్లాడుకున్నారు ఇంటికొచ్చే అమ్మాయి గురించి. శర్మ ఏదో అనరాని మాటంటే లెక్చరర్ చెంప దెబ్బ కొట్టారు. అప్పుడు శర్మ—శర్మ చంపుతానని బెదిరించాడు. డిటెక్టివ్ బాబూ, నాకు శర్మమీదే అను మానంగా వుంది! ఆ రాత్రి—"

లాల్ ఫోన్ పెట్టేసి వేగంగా దారితీశాడు బయటికి.

7

"నో సర్, నో! ఆయన చెంప దెబ్బ తిన్నాక నాకు కనువిప్పయింది. నా మోస్టు అన్ సివిలైజ్డ్ బిహేవియర్ని

బొధి వచ్చేలా తిట్టాను....”

“కానీ మొన్న రాత్రి పన్నెండున్నరకి మీరు కిందికి వెళ్ళినట్లు ఇంతకుముందు ఎందుకు చెప్పలేదు?”

లాల్ ప్రశ్నకు శర్మ సందిగ్ధంలో పడ్డాడు.

“సర్, అది తప్పా? కింద ఏదో చప్పుడు వినిపిస్తే వెళ్ళి చూడడం తప్పా?”

“అది మీరు ముందు చెప్పకపోవడమే తప్పు.”

“అవును, ఏదో పగిలిన శబ్దమైతే కిందికి వెళ్ళాను. కానీ తలుపులూ, కిటికీలూ మూసివున్నాయి. చీకటిగా వుంది. మళ్ళీ ఏమీ వినిపించకపోతే నాకెందుకని పైకి వచ్చేశాను.”

“అలాగా.... మీ ఇంట్లో ఎన్ని కత్తులున్నాయి?”

“రెండున్నాయి....” శర్మ భార్య చేత తెప్పించాడు.

వాటిలో ఒక కత్తిని లాల్ అందుకున్నాడు. “ఇది కొత్తగా వుంది, ఎప్పుడు కొన్నారు?”

“నిన్ననే కొన్నాం.”

“ఎందుకు కొన్నారు, ఒకటి వుందిగా?”

“రెండుంటే బాగుంటుందని కొన్నాం.”

“లేక ఒకటి పోయిందని కొన్నారా?”

“ఏమన్నారూ? మాకు పూర్వం ఒక్కటే కత్తి వుంది.”

“ఇన్‌స్పెక్టర్ మీకో కత్తి చూపించాడా?”

“చూపించాడు. అదెవరిదో మాకు తెలీదు!”

లాల్ అక్కడ్నుంచి కదిలి కిందకొచ్చాడు. బయట కారెక్కుతూ ఎదురింటి కిటికీకేసి చూశాడు. అంతవరకూ అక్కడ వుండి గమనిస్తోన్న ఆమె, చటుక్కున లోపలికి మాయమై పోయింది. లాల్ నవ్వుకుంటూ స్టార్టుచేశాడు.

ఆఫీసుకొచ్చాక జాన్ అన్నాడు.

"కృష్ణన్ ఫోన్ చేశాడు, పార్ట్‌నర్ గంటలో వస్తానన్నాడు. ముందు నీకీ విషయం చెప్పమన్నాడు."

"చెప్పు."

"కేసులో ఇంతవరకు సంబంధమున్న వాళ్ళంతా వచ్చి వేలిముద్రలిచ్చి స్టేట్‌మెంట్లు ఇచ్చారట. ఒక్క వనజ అన్న జయకర్ తప్ప. అతను వూళ్ళోలేడు. కృష్ణన్ ఎలా అందరికీ మోటివ్స్ వున్నాయో అలా ఎలిబీలూ వున్నాయంటున్నాడు. రవీందర్ అతని తండ్రీ ఒకరికొకరు ఎలిబీ. నాయర్‌కి అతని భార్య. ఇది నిలబడదు. కాని హోటలులో అతని పనివాళ్ళు ఎలిబీ ఇస్తున్నారట. ఇక జయకర్‌కి అతని తల్లీ, వనజకు ఆమె ఫ్రెండ్ ఇస్తున్నారు.

"సుమతికి ఆమె ఊళ్ళో ఆమె వాళ్లు సాక్ష్యం వున్నారట. ఎంతవరకు నమ్మదగ్గదో చెప్పలేమంటున్నాడు కృష్ణన్. ఆమెను కాపాడే ప్రయత్నాలు జరుగుతున్నట్లు అన్పిస్తోందట. సుమతి బుకాయించింది, ఈ నెలరోజులూ తమ ఊళ్ళోనే వున్నట్లు. కానీ ఆమె ఇక్కడ అన్నగారింటికి రెండుసార్లు వచ్చిందట. అయితే మొన్నరాత్రి ఇక్కడ లేదంటున్నాడామె అన్న. ఆమె సంసారంలో ఏర్పడ్డ కలతలు తెలుసుకొని అతను ప్రభాకరరావుకి రెండుసార్లు నచ్చజెప్పాడట. అతను ఒప్పుకోలేదట. సుమతి ఇక రావవసరం లేదన్నాడట. ఆమెకు విడాకులిస్తానన్నాడట. సుదర్శన్ సుమతి అన్న — పరువు ప్రతిష్టలు పోయే అలాటి పని చేయవద్దని ఎంతో బతిమాలుకున్నాడట. అయినా విన్పించుకోలేదట...."

"ఐసీ.... మొన్న రాత్రి అతనెక్కడున్నాడట?"

"ఒంటరిగా సెకండ్ షో కెళ్ళాడట.... మూడున్నరకి ఇంట్లోనే వున్నాడట."

"నో, నాకు పన్నెండున్నరకి ఎలిబీ కావాలి!" ఆవేశంగా ఫోనెత్తాడు లాల్.

డయల్ చేసిన వెంటనే రెస్పాన్స్ వచ్చింది.

"హలో డాక్టర్, ఏమిటి ప్రోగ్రెస్?" అడిగాడు లాల్.

డాక్టర్ అన్నాడు, "పోస్టుమార్టమ్ అయింది, లాల్. కానీ పోస్టుమార్టమ్ ఇంటర్వెల్ ఈ దశలో సరిగ్గా ఇన్ని గంటలని చెప్పలేను. ఉదయం మీకు ముప్ఫై గంటల క్రితమని చెప్పాను — అంటే మొన్న రాత్రి మూడున్నరకు. నేను ఆటోప్సీ పన్నెండున్నరకి ప్రారంభించాను. ఆ సపోర్టింగ్ ఎవిడెన్స్—హాతుని చేతికి రిస్టువాచీ చూపించే టైమును దృష్టిలో పెట్టుకునిగాక—బాడీ కూలింగ్ రివిడిటీ, రిగర్ మార్టిస్‌ని బట్టి చూస్తే, 2, 3½ గంటలు ఇంకా వెనక్కి పోవాలనిపిస్తోంది.... అంటే పన్నెండు — మూడున్నర గంటలమధ్య ఎప్పుడైనా జరిగివుండవచ్చు."

"వెరీ వెల్, నేనూ అదే అనుకునేది! అయితే ఆల్కహాలు లక్షణాలు కనిపించాయా?"

"ఆల్కహాలా? లేదు లాల్. తీసుకున్నట్లయితే ఈ దశలో చెప్పడం కష్టం. శవం కుళ్ళడం ప్రారంభం కానంతవరకు రక్తంలో ఆల్కహాలు కాన్సెన్ట్రేషన్ స్థిరంగా వుంటుంది. ఆ తర్వాత క్రమంగా కనుమరుగవుతుంది. అది తీసుకున్నట్లు ఐవిట్నెస్‌లుంటే మీకు చాలు. లేకపోతే చెప్పండి—అప్పుడు ప్రయోగాలు చేయాలి. కార్బోహైడ్రేట్స్‌నీ, ప్రొటీన్స్‌నీ ఎనాలిసిస్

చేయవల్సి వుంటుంది.... ఈ కుళ్ళిన దశలో బాక్టీరియా, ఈస్టు, ఎంజైమ్స్ కలిసి ఉత్పత్తిచేసే ఆల్కహాలు శాతం 0.2 వరకు వుంటుంది, అంతకుమించితే అప్పుడు మర ణానికి ముందు ఆల్కహాలు తీసుకున్నట్లు తెలుస్తుంది. ఓ.కే?"

"నో డాక్టర్, మీకా శ్రమ అక్కర్లేదు. సాక్షు లున్నారు."

"అయితే మంచిది. ఇక మీకు కత్తిగురించి చెప్పాలి."

"ఏం చెప్పాలి?"

"రక్తం శుభ్రంచేశాక దానిమీద గీతలు కన్పించాయి. అవి సరికొత్తగా ఏర్పడ్డవి. బ్లేడ్ అంచులు కూడా దెబ్బ తిన్నాయి. దాని మొన గుండ్రంగా వుంది, అది బ్రెడ్ కోసే కత్తి అనుకోవచ్చు. దాన్ని కృష్ణన్‌కిచ్చాడు. అతను లాబ్‌కి పంపాడు, ఆ గీతలేమిటో మైక్రోస్కోప్ కింద తెలుసుకోవడానికి...."

లాల్ సాలోచనగా అడిగాడు. "కత్తి సరికొత్తగా వుందా?"

"లేదు, పాతది. కానీ గీతలు మాత్రం కొత్తగా ఏర్పడ్డాయి."

లాల్ థాంక్స్ చెప్పి పెట్టేశాడు.

## 8

ఇన్‌స్పెక్టర్ కృష్ణన్ వచ్చాడు సాయంత్రం నాలుగు గంటలకి.

అప్పుడు ముగ్గురూ కూర్చుని తమ తమ పరిశోధనా వివరాలు వెల్లడించుకున్నారు. ఆ తర్వాత పరిస్థితిపై చర్చ ప్రారంభించారు.

"ఫ్రెండ్స్! యిప్పటి వరకు తేలిన అనుమానితులు

తొమ్మండుగురు" కృష్ణన్ అన్నాడు సిగరెట్ వెలిగించుకుంటూ. "మాతునికి ఫిరంగి పత్రికతో సంబంధాలున్న దృష్ట్యా యింకెదరున్నారో అనుమానితులు మనకి తెలియకుండా దేవుడెరుగు? ఫిరంగి వ్యవహారాల గురించి నేను కొంత తెలుసుకున్నాను. ప్రతి వొక్క ఆర్టికల్తో కొందరు శత్రువుల్ని ప్రోగుచేసుకుంటోం దా పత్రిక. కానీ మాతునికి వాటితో సంబంధం లేదంటున్నాడు దాని ఎడిటర్. అత నెప్పుడూ వార్తలు సేకరించలేదట. స్కాండల్సు వ్రాయలేదట. ఇది యెంతవరకు నిజమో తెలియదు గానీ, అబద్ధమయితే మాత్రం యింకా లెక్కలేనంతమంది అనుమానితులుంటారు మన నెత్తిమీద.

"కానీ ఫ్రెండ్స్, ముందు యిప్పుడు మనకు తెలిసిన అనుమానితుల సంగతి తేలుద్దాం. వీళ్ళలో దోషి లేనట్లు తేలితే, అప్పుడు యీ తెరచాటు వ్యక్తుల సంగతి పడదాం. ఏమంటారు? ఈ తొమ్మిది మందిలో మోటివ్ అందరికీ వుంది వారి వారి ప్రయోజనాల్ని బట్టి. ఇక ఎలిబీలు — వెల్ — అవి యిప్పుడు అందరి విషయంలోనూ అనుమానాస్పదంగానే వున్నాయి. టైమాఫ్ డెత్ యిప్పుడు మారిపోయింది. హంతకుడు లేక హంతకురాలు ఎలిబీని సృష్టించుకోడానికి తన సౌలభ్యం కోసం టైమాఫ్ డెత్ని కొన్ని గంటలు ముందుకి పొడిగించి సూచించడం జరిగింది - మాతుని చేతికున్న రిస్టువాచీని మూడున్నరకి తిప్పి డ్యామేజి చేయడం ద్వారా.

"కానీ వాస్తవంలో హత్య కొన్ని గంటలముందే జరిగింది. డాక్టర్ మూడున్నర గంటల పీరియడ్ నిచ్చాడు, పన్నెండు నుంచి మూడు మున్నై వరకు అని. దాన్ని మన మింకా కుదిద్దాం. దీపక్ ఒంటి గంటకు వెళ్ళి శవాన్ని

చూశానంటున్నాడు. కానీ అంతకు గంట క్రితమే శర్మ కింద శబ్దాలు విని వచ్చానంటున్నాడు. కాబట్టి హత్య పన్నెండూ పన్నెండున్నరల మధ్యలో జరిగి వుంటుందని భావించాలి.

"ఈ అరగంట వ్యవధిలో మనం ఎలిబీలు చూస్తే కొందరికి వున్నాయి. కొందరికి లేవు. లేని వాళ్ళని అలా వుంచుదాం. ఉన్నవాళ్ళని చూస్తే అవెంతవరకు నిజమయిన ఎలిబీలన్నవీ అనుమానాస్పదమే. అసలు ఎలిబీల గురించి ఆలోచించే ముందు సర్కమ్‌స్టేన్‌షియల్‌గా యీ కేసు యెంతవరకు నిలబడుతుందన్నది చూడాలి.

"ఈ అరగంట వ్యవధిలో ఆ యా అనుమానితుల స్థాన చలనాలు అనుమానాస్పదంగా వున్నంత మాత్రాన వాటిని హత్యా స్థలానికి సంధించలేం. అలా చేస్తే ఒకరి కంటే యెక్కువ మందిని సంధించవలసి వుంటుంది. కానీ అక్కడ నేరం చేసింది అందరిలో యే వొక్కరో, కాబట్టి మై డియర్ ఫ్రెండ్స్, ఈ కేసులో సర్కమ్‌స్టేన్‌షియల్ యెవిడెన్స్ పనికిరాదు. అంత కంటె పటిష్టంగా, నిర్దుష్టంగా వుండే మెటీరియల్ యెవిడెన్స్ అవసరమున్నది" చెప్పాడు కృష్ణన్.

"మెటీరియల్ ఎవిడెన్స్........" లాల్ అన్నాడు సాలోచనగా. "అదెక్కడా నాకు నిర్దుష్టంగా కన్పించడం లేదు. ముఖ్యంగా హత్యాయుధమే యే క్లూ ఇవ్వ లేకపోయింది. దానిమీద వేలిముద్రలు లేవు. అదెక్కడ్నుంచి వచ్చిందో తెలుసుకోలేకపోయాం. ఆ కత్తి యిళ్ళల్లో వాడే రకంలా లేదు. శర్మ అది తమది కాదు అంటున్నాడు. నాయర్ కూడా అలాగే అంటున్నాడు. కానీ అది హోటల్లలో ఉపయోగించే కత్తిలాగానే

వుంది—

"వెల్. ఆ కత్తి యెవరిదయినా అది బయటనుంచే వచ్చింది. ఆ వచ్చిన హంతకుడు—సారీ—అనుమానితులలో యిరు లింగాల వారూ ఉన్నారు కాబట్టి దోషి అనడం బాగుంటుంది. వెల్, ఆ వచ్చిన దోషి హత్య చేసే ఉద్దేశ్యంతోనే ఆ కత్తి పట్టుకొని వచ్చినట్టు అనిపిస్తోంది. అంతేగాని వున్నట్టుండి మామూలుగా వున్న పరిస్థితి విషమించి క్షణికావేశంలో జరిగిన హత్యలా అనిపించడం లేదు. ఎందుకంటే అప్పుడు అందుబాటులో కత్తి యెక్కడ వుంటుంది? అది పేపర్ నైఫా? కాదు, అక్కడే టేబుల్ మీద వుందనడానికి! ఆ కత్తి సొంతదారుని కనుక్కుంటే ఈ కేసు క్షణంలో తేలిపోతుంది.

"మరో ఎవిడెన్స్—పౌడరు టిన్ను, దానిమీద వేలిముద్రలు. ఆ వేలిముద్రల గురించి సుమతి దొక వివరణ వున్నది. కత్తి మీద వేలిముద్రలు తుడిచినదాన్ని ఆ టిన్నుమీద తుడవకుండా పోతానా అని. అది నేనంగీకరించను. నేరం చేసిన మనిషి ఆధారాలన్నీ తొలగించాలని లేదు.

ఆమె వాదన నాకు నచ్చడంలేదు. ఆమె విషయాలు దాస్తోంది. మోటివ్ బలంగా తోస్తోంది. భర్త యెవరి మాటా వినక విడాకుల ఆలోచన పెట్టుకున్నాడు. అలాటి భర్త మరో యువతితో సుఖపడకూడదనుకొని వుంటుంది. ఆమె అన్నగారింట్లో రెండు సార్లు గడిపిన విషయం కూడా దాచింది. అన్నతో జరిపించిన రాయబారాలు కూడా దాచింది. యెందుకు దాచింది? మనం మోటివ్ వూహిస్తామనా? ఆపైన ఎలిబీని అనుమానిస్తామనా? ఆమె ఎలిబీని వెరిఫై చేయండి కృష్ణన్."

"అలాగే, లాల్."

లాల్ అన్నాడు: "ఇక వనజ అక్కడ పది గంటల వరకే వున్నా నంటోంది. రవీందర్ ప్రభాకరరావుని పదకొండు గంటలకి యింటి బయటే డ్రాప్ చేసి వెళ్ళి పోయా నంటున్నాడు. వనజ తన స్నేహితురాల్ని సాక్ష్యం చూపిస్తోంది. కానీ ప్రభాకరరావు వచ్చేవరకు ఆమె అక్కడే వుంటే, అప్పు డతను తాగిన మైకంలో ఆమె మీద దాడి జరిపి వుంటే ఆమె దుస్తులు చాలా విషయాలు చెపుతాయి. అవి మనం పరిశీలించలేదు. మొన్న రాత్రి ఆమె ఏ బట్టల్లో వుందో తెలుసుకొని వాటిని పరిశీలించాలి కృష్ణన్. అలాగే ఆమె వొంటిని లేడీ డాక్టరు చేత పరీక్ష చేయించాలి."

"ఓ. కే. లాల్!"

"ఇక ఆమె అన్న జయకర్ కు తల్లి ఎలిబీ యివ్వలేక పోతోంది. అతను నిన్న ఉదయం పెళ్ళికి విజయవాడ వెళ్ళిపోయాడు. మోటివ్ ఎంతో వుంది. అతని వేలి ముద్రలు దొరకలేదు. కానీ ఎలిబీ యెలా యిచ్చు కుంటాడో చూడాలి. ఆ పెళ్ళి నుంచి అతను యెటూ వెళ్ళిపోకుండా చూడండి కృష్ణన్. కత్తి పట్టుకు వెళ్ళిన దోషిగా అతను చక్కగా కుదురుతాడు.

"మరో సస్పెన్స్. దీపక్ వేలిముద్రలు తలుపు మీద దొరికాయన్నారు. అతను కత్తిపట్టుకెళ్ళాడో, కెమెరా పట్టుకెళ్ళాడో యింకా తేలలేదు. అతన్ని, అతన్ని పట్టు కున్న రాడీని నాలుగు తగలనిస్తే తప్ప నిజం తెలిసేలా లేదు. వాళ్ళిద్దరి వ్యవహారం త్వరగా తేల్చాలి కృష్ణన్.

"మరో రకం వేలిముద్రలు — వనజవి కప్పు సాసర్ మీద, మరో కొన్ని చోట్లా వున్నాయన్నారు. సుమతివి

టిన్ను మీద వున్నాయి. దీపక్ వి తలుపుమీద వున్నాయి. ఒకేచోట యిందరి అనుమానితుల వేలిముద్రలతో మనం ఎక్కడికీ పోలేం! ఏదీ సాధించలేం! కేసులో మీ రడిగే నిరుపమయిన యెవిడెన్స్ నా కెక్కడా కన్పించడం లేదు."

"కానీ లాల్, రవీందర్ చేతికి గాయమయింది."

"అవును. కత్తిపీట కోసుకుందన్నాడు నిన్న ఉదయం. దానికి వంటవాడు సాక్ష్యం చెప్తున్నాడు. తండ్రి ఎలిబీ యిస్తున్నాడు. వేలిముద్రలు మనకు దొరక లేదు. తను ప్రభాకరరావుని బయటనుంచే డ్రావ్ చేసి వెళ్ళిపోయాడనడానికి యిదో ఆధారం. మోటివ్ మనకి తెలీదు. కానీ ఈ హత్యను అతడు చేసివుంటే, అతను ముందు చూపుతో చేశాడనుకోవాలి. కానీ దాన్ని నిరూపించేందుకు మనకు ఆధారాలు లేవు."

"ముందు చూపుతో యెలా చేస్తాడు?"

"నాయక్ హోటల్లో ప్రభాకరరావు గొడవ పడ్డప్పుడు యెవరికీ తెలియకుండా ఆ కత్తిని అక్కడ్నించి తస్కరించి తెచ్చి వుండాలి. దాంతో ప్రభాకరరావుని పొడిచి, ఆ నేరాన్ని నాయర్ మీదకు నెట్టాలనుకుని వుండాలి. ఆ పొడిచే టప్పుడే యెలాగో చెయ్యి కోసుకుని వుండాలి. కేవలం వూహిస్తున్నాం. అతనికి చంపే అవసర మేమిటి?

"మీ రన్నట్టు హత్య పన్నెండు – పన్నెండుర మధ్య జరిగితే, రవీందర్ చేసి పారిపోతే, ఒంటి గంటకి దీపక్ వెళ్ళినప్పుడు తలుపు లెలా తెరిచి వున్నాయి? తర్వాత తాళం యెలా పడింది? తాళం వేసిన మనిషి వేరొకరా? ఇంపాసిబుల్. హత్య చేసినవాడే తాళం వేసి వెళ్ళి

పోవాలి. దీపక్ ఒంటి గంటకి యింట్లోకి వెళ్ళి శవాన్ని చూశాననడం అతన్నే చిక్కుల్లో పడేస్తుంది తప్ప, రవీందర్‌ని యిరకాటంలో పెట్టదు."

ఫోన్ మోగింది.

జాన్ ఎత్తి విని కృష్ణన్ కిచ్చాడు. "మీ కే, లాబ్ డైరెక్టర్ నుంచి."

కృష్ణన్ అందుకొని మాట్లాడాడు. రెండు నిమిషాలు మాట్లాడి పెట్టేశాడు.

"ఏమిటి?" అడిగాడు లాల్.

"ఆ కత్తిమీద గీతలు. అవి సన్నని వెంట్రుకవాసి మందంలో వున్నాయట. అవన్నీ కత్తిమొన వయిపుకే నిలువు గీతలుగా యేర్పడ్డాయట. బ్లేడు సగ భాగం వరకు అవి వ్యాపించాయట. అక్కడి వరకు కత్తి ఇరు వయిపులా అంచులు ఎగుడు దిగుడుగా వున్నాయి. సమ తలంగా లేవట. కత్తి దేనితోనో రాపిడికి గురయి దెబ్బ తిన్నదట. ఇంకా బ్లేడు, పిడి కలిసే భాగంలో సన్నని మట్టి రేణువులు యిరుక్కుని వున్నాయట."

"మట్టి రేణువులా?"

"అవును. మట్టి రేణువులు."

లాల్ చెంప రుద్దుకుంటూ జాన్ కేసి చూశాడు. "కత్తిమీద గీతలు....మట్టి రేణువులు .... ఓ.కే., జాన్, నువ్వు డాక్టర్‌ని కాంటాక్టు చెయ్యి ఫోనుమీద!"

జాన్ డాక్టర్‌ని కాంటాక్టు చేసి రిసీవర్ని లాల్ చేతి కిచ్చాడు.

"హలో, డాక్టర్. ఆ కత్తిమీద లాబ్ రిపోర్టు అందింది. బ్లేడు మీద గీత లున్నాయి. పిడిలో మట్టి రేణువులు యిరుక్కున్నాయి. ఈ రెండింటికీ సంబంధం

మీరు ఊహించుకోగలరు. కానీ నాకో సందేహం వచ్చింది డాక్టర్! నే నా గాయం గురించి తెలుసుకోవాలి!"

"ఏం తెలుసుకోవాలి?"

"దాని పూర్తి డేటా — డైమెన్షన్స్. గాయం లోతు, పొడవు, వెడల్పు వగైరా. ఇంకా గాయంలో ఫారెన్ బాడీస్—అంటే మట్టిరేణువుల్లాంటివి వుంటే ఆ వివరాలు కూడా కావాలి.

"మిస్టర్ లాల్! దీనికి రేడియోపక్ ఇంజక్టు చేసి ఎక్స్‌రే తీయాలి. టైము పడుతుంది."

"ఎంత?"

"రెండు గంటలు పట్టవచ్చు."

"సరే, యెదురుచూస్తాను."

ఫోన్ పెట్టేసి లాల్ కళ్ళు మూసుకున్నాడు.

"ఏమిటి లాల్, మీ రేం చేస్తున్నారు?" అడిగాడు కృష్ణన్.

"నన్ను ఆలోచించుకోనివ్వండి. నే ననుకున్నట్టే డాక్టర్ రిపోర్టు వచ్చిందా, మనం దోషికి చాలా చేరువయిపోతాము. నే ననుకున్నది తప్పకూడదు."

జాన్ అన్నాడు కృష్ణన్‌తో, "ఆ కత్తి ఎవరిదో తెలుసుకోనట్టే, యింటికి తాళం వేసిందెవరో కూడా తెలుసుకోలే మనుకుంటాను."

"హత్య చేసిన మనిషే తాళం వేయాలి."

"మరి ఒంటి గంటకు దీపక్ యింట్లోకి యెలా వెళ్ళగలిగాడు? రెండే రెండు అవకాశా లున్నాయి. దీపకే హత్యచేసి ఒంటి గంటకి తాళం వేసుకొని వెళ్ళిపోయి వుండాలి. లేదా అంతకు ముందే మరెవరో చంపి పారి

పోయి వుండాలి. తర్వాత దీపక్ వచ్చి వెళ్ళిపోయాక, తిరిగి వచ్చి తాళం వేసి వుండాలి."

"తిరిగి వచ్చి వేస్తారా! ఏ మవసరం?"

"ఎవరో దూరంగా వుండేవారయితే ఆ అవసరం వుండదు. కానీ ఒకే యింట్లో వుండే వాళ్ళకయితే అవసరం. కొన్ని అవాంతరాల్ని, కొన్ని చిక్కుల్ని తప్పించుకొని నిమితపడడానికి కొంత వ్యవధి అవసర మవుతుంది. అంతవరకు శవం బయట పడకూడదు."

"ఆ పని ఎవరు చేస్తారు?"

"పై వాటాలో శర్మ చేయవచ్చు. పన్నెండున్నరకి పైకి ఉరుకుతూ యెవరో కన్పించారట ఎదురింటామెకు. అది శర్మే కావచ్చు. అతనే పొడిచి పైకి పారిపోయి వుండొచ్చు కంగారుగా. తర్వాత నిదానపడి ఆలోచించి ఆధారాలు తొలగించడానికి వచ్చి వుండొచ్చు, ఒంటి గంట తర్వాత. అప్పుడతనే తాళం వేసుకుని పోయి వుండొచ్చు.

"అంతే! ఆ కత్తి అతనిదే కావాలి. దాన్ని కూర గాయలు తరగడానిక్కాకుండా అవుట్ డోర్లో ఉపయోగిస్తూ వుండాలి."

"అవుట్ డోరా?" కృష్ణన్ అడిగాడు.

"మొక్కలు నాటడానికి, పాదులు తీయడానికి. ఆ మట్టిరేణువులూ, గీతలూ యేమిటనుకున్నారు? అతనింట్లో కొత్తగా తీసిన పాదుల్ని చూస్తే తెలిసిపోతుంది. ఆ మట్టిరేణువుల సహాయంతో తవ్విన ప్రాంతం అదేనని తెలుసుకోవచ్చు."

"పోండి, జాన్!"

"ఎందుకు పోవాలి?"

"శర్మకు పెరడే లేదు. అతను పై వాటాలో వుంటు న్నాడు.

జాన్ కోపంగా చూశాడు.

కృష్ణన్ పకపకా నవ్వాడు.

లాల్ కళ్ళు తెరిచాడు. "నవ్వకండి ఇన్‌స్పెక్టర్. నా కో విషయం చెప్పండి."

కృష్ణన్ నవ్వాపుకుని "అడగండి!" అన్నాడు.

"ఆ గదిని మీరు సీలు చేశారా?"

"మొత్తం యింటికే తాళం వేశాను. ఆమె అన్నగా రింటికి వెళ్ళిపోయింది."

"అయితే పదండి! ఆ యింట్లో మనకు పనుంది."

"ఏం పని?"

"ఒక అనుమానం తీర్చుకోవాలి."

"ఏమిటా అనుమానం?"

"అక్కడే తెలుస్తుంది. ఆ అద్దం ముక్కలన్నీ గది లోనే వున్నాయా?" అన్నాడు లాల్ లేస్తూ.

# 9

ఆ గది తెరిచి ముగ్గురూ లోపలికి వెళ్ళారు.

గది వదిలి వెళ్ళినప్పుడు యెలా వుందో, యిప్పుడూ అలాగే వుంది యథాస్థితిలో.

ముగ్గురూ ఓ మూల కుప్పగా పోసివున్న గాజు పెంకుల వద్దకు నడిచారు.

అందులో పెద్ద ముక్కల్ని ఏరి పక్కన పెట్టారు.

అప్పుడు డ్రెస్సింగ్ మిర్రర్‌ని నేలమీద పడుకో బెట్టారు.

దాని పగిలిన భాగంలో ఒక్కో ముక్కని తీసి అవె

క్కడ రావాలో అక్కడ అతికినట్టు అమర్చసాగారు.

పెంకులన్నీ అయిపోయాయి. కానీ మధ్యలో ఒక చోట ఖాళీ ఏర్పడింది. మళ్ళీ మూలనున్న చిన్న చిన్న ముక్కలు తెచ్చి ఆ భాగంలో పెట్టి చూశారు. వాటి ఆకారాలు కుదరక అక్కడ సరిపోలేదు.

లాల్ తల విదిలిస్తూ లేచాడు.

"లేదు, ఇక్కడ ఒకటే పెద్ద ముక్క వుండాలి. ఇరువైపులా మొనదేలి. తొమ్మిదంగుళాలు పొడవు, మూడంగుళాల వెడల్పుతో, చేప ఆకారంలో వుండాలి-వెతకండి!"

"గదిలో ఎక్కడా లేదు!" కృష్ణన్ అన్నాడు.

"వెల్, ఇలాగే వుంచి ఈ ఖాళీ భాగాన్ని కాగితం మీద ట్రేస్ చేయండి! ఆ ముక్క ఆకారం, సైజు తెలుస్తాయి...."

కృష్ణన్ లేచి, కాగితం కోసం టేబులు దగ్గరికి వెళ్ళాడు.

లాల్ ఫోన్ దగ్గరికి వెళ్ళి ఒక నెంబర్ తిప్పాడు. హాస్పిటల్లో రిసెప్షన్స్ వచ్చింది.

"డాక్టర్, నేను లాల్ ని."

"ఓహ్ లాల్, మీ ఆఫీసుకి ఫోన్ చేశాను—"

"మేమిక్కడున్నాం, హాత్యాస్థలంలో."

"అక్కడేం చేస్తున్నారు?"

"డాక్టర్, ఆ ఎక్స్‌రే ఏమైంది?" లాల్ ఎదురు ప్రశ్న వేశాడు అసహనంగా.

"ఎక్స్‌రేలో హాత్యాయుధం గురించి అనుమానాలున్నాయి, లాల్."

"గుడ్, చెప్పండి."

"గాయం ఏదో మొనదేలిన వస్తువుతో అయింది. కానీ కత్తి మొన గుండ్రంగా వుంది. పెద్ద పేగుని కత్తి కంటే వెడల్పయిన వస్తువు చీల్చింది. ఆ వస్తువు కత్తి కంటే దళసరియైనది కూడా. గాయంలో ఫారెన్ బాడీస్ ఏవీ లేవు—"

"వెల్, నేనదే అనుకున్నాను."

"ఏమనుకున్నారు?"

"గాయం అద్దం ముక్కతో అయుండాలని, కత్తి తర్వాత వచ్చి అందులో ఇరుక్కుందని—"

"థాంక్ గాడ్!"

"వెల్, మీ సహాయానికి చాలా థాంక్స్ డాక్టర్."

లాల్ ఫోన్ పెట్టేస్తుంటే, కృష్ణన్ అరిచాడు. "ఇటు రండి, లాల్!"

లాల్ ఆ గదిలోకి నడిచాడు. కృష్ణన్ ఉద్రేకంగా కన్పించాడు. అతని చేతిలో ఏదో కాగితం ముక్క వుంది. దాన్ని లాల్ కిచ్చి, "నేను తెల్ల కాగితం కోసం చూస్తుంటే, పాడ్ కింద ఇది దొరికింది!" అన్నాడు.

"దమ్మూరీ ప్రభాకరరావుదే.... ఏమిటది?" అన్నాడు లాల్, దానిమీద కొన్ని పేర్లనూ, వాటి పక్కన మరి కొన్ని మారు పేర్లనూ చదువుతూ.

"ఆ జోగ్లేకర్ అలియాస్ అశోక్ రాయ్ పెద్ద చీట్!" అన్నాడు కృష్ణన్.

"ఐసీ.... ఏం చేస్తుంటాడు?"

"ఇతనికో ముఠా వుంది, చీటింగ్ గ్యాంగ్ అని వ్యవహరిస్తుంటాం. మొత్తం ఎనిమిదిమంది వున్నారు. ఇంటర్ స్టేట్ ఆపరేటర్స్. అనేక నగరాల్లో పెద్ద పెద్ద

వ్యాపారస్తుల్ని వంచిస్తుంటారు."

"ఎలా?"

"ముందు జోగ్లేకర్ ఏ బొంబాయిలో, కలకత్తాలో బయల్దేరతాడు. మారువేషాలు వేయడంలో అతను ఘటికుడు. అక్కడ పెద్ద పెద్ద వ్యాపారస్థుల్ని పరిచయం చేసుకుంటాడు. హైదరాబాదులో తనకు ఫలానా వ్యాపారముందని చెప్పుకుని, తను ఓ బిజినెస్ మాన్ గా సమర్థవంతంగా నటిస్తాడు. తన హోదా, దర్పం ప్రదర్శిస్తాడు. ఇంకా మాటలతో ఆకట్టుకొని వాళ్ళని వశపర్చుకుంటాడు.

"అప్పుడు హైద్రాబాద్ నుంచి మిరపకాయలో, జొన్నలో అక్కడికి ట్రెయిన్ కి బుక్ చేసినట్లూ, అవి రవాణా అవుతున్నాయనీ, ఒకటి రెండు రోజుల్లో చేరుకుంటాయనీ చెప్పి బేరం మొదలుపెడతాడు. మార్కెట్ రేటుకంటే తక్కువ ధర చెప్తాడు. ఇంకా కమీషన్ లు వగైరా డిస్కౌంట్ లు ఎర చూపుతాడు. ఇంకా మొత్తం డబ్బు వెంటనే చెల్లించనవసరం లేదంటాడు. సగం ఇప్పుడు, మిగతా సగం సరుకు అందాక అంటాడు. ఈ షరతులకి ఆకర్షితులై ఎవరో ఒకరు ఆ రైల్వే కన్ సైన్ మెంటుని తీసుకోవడానికి ఉత్సాహపడతారు. సగం డబ్బిచ్చేసి రైల్వే రశీదులు తీసుకుంటారు. అంతే, అక్కడికి బేరం ముగుస్తుంది....

"కానీ ఒకటి రెండు రోజులు..వారం పదిరోజులు... నెలా.... రెండు నెలలూ గడిచినా సరుకు చేరే సూచనలుండవు! స్టేషన్ చుట్టూ తిరిగి వాళ్ళు తెలుసుకునేదేమిటంటే, అసలా సరుకు రైలుకి బుక్ చేయనేలేదు! ఆ

ఆ రశీదులు ఫోర్జరీవనీ!"

"ఎంత కాలంనుంచి సాగుతోంది?"

"రెండేళ్ళనుంచీ. వాళ్ళంతా వంచనా శిల్పంలో ఆరితేరినవాళ్ళు. ఒక్కొక్కడు ఒక్కొక్క పనిలో నిపుణుడు. దాదాపు అన్ని రాష్ట్రాల పోలీసులూ వాళ్ళని గాలస్తున్నారు. కానీ యింతవరకు ట్రాప్ చేయలేక పోయారు."

"ఇప్పుడీ ప్రభాకరరావు వాళ్ళ అరాలు తీశాడా?"

"అలాగే అనిపిస్తోంది ఆ లిస్టుని చూస్తే! అతను తప్ప కుండా వాళ్ళ ఫోటోలు సేకరించాడెక్కడ! అదే అతనికి ప్రమాదం తెచ్చి పెట్టింది."

"వెల్, అయితే యిప్పుడు సులభం! కమాన్, హాత్యాయుధం వెతుకుదాం! లాల్ బయటకు దారి తీశాడు టార్చి పట్టుకుని. ఏడు కావస్తోంది. బయటంతా చీకటిగా వుంది. అతను కాంపౌండ్ గోడ వారగా నడుస్తూ, అక్కడున్న పూల మొక్కల్ని వంచి చూస్తూ, టార్చి కాంతిలో నేలని పరిశీలిస్తున్నాడు.

"అక్కడేముంది?"

"అద్దంముక్క. అదే హాత్యాయుధం!" అంటూ అతను ఒక చోట ఆగిపోయి బంతిపూల మొక్క దగ్గర కూర్చున్నాడు. "యిక్కడే. యిక్కడ మట్టి త్రవ్వినట్టుంది" అని కట్టెపుల్ల అందుకుని గబగబా త్రవ్వసాగాడు.

జాన్ పక్కన కూర్చుని మట్టిని తీయసాగాడు.

"జాగ్రత్త. అది తగిలితే ముట్టుకోకు. కర్చీఫ్‌తో పట్టుకో!"

అడుగులోతు త్రవ్వాక జాన్ కర్చీఫ్‌తో పట్టుకుని దాన్ని వెలుపలికి తీశాడు.

కృష్ణన్ ఉద్రేకంగా అరిచాడు. "అద్దం ముక్క. యిది యిక్కడికి యెలా వచ్చింది?"

లాల్ దాన్ని అందుకుని టార్చి వెలుగులో పరిశీలించాడు. చేప ఆకారంలో తొమ్మిదంగుళాల పొడవున్న ఆ అద్దంముక్క మునాపాతిక వంతు రక్తం అంటుకుని ఆరిపోయి గట్టిపడి వుంది. అతను నోటితో వూది మట్టిని తొలగించాడు. అప్పుడు చూశాడు. అతని కళ్ళు మెరిశాయి.

"ఇట్సెడామ్ పర్ఫెక్ట్ ఎవిడెన్స్!" అన్నాడు జాగ్రత్తగా కృష్ణన్ కిస్తూ. "ఆ కత్తిమీద గీత లేరవ్వడాయని చెప్పినప్పుడు, పిడిలో మట్టిరేణువులు యిరుక్కున్నాయన్నప్పుడు నా కొకటే బలంగా తోచింది కృష్ణన్. ఆ కత్తి యెక్కడో తవ్వకానికి ఉపయోగించబడింది. యెక్కడ తవ్వారనేది కాదు ముఖ్యం, యెందుకు తవ్వారనేది కావాలి. యింకా యెప్పుడు తవ్వారనేది కూడా ముఖ్యం. యెప్పుడు తవ్వారు? ఆఫ్కోర్స్, హత్యకు తరువాత. యెందుకు తవ్వారు? ఎవిడెన్స్‌ని దాచడానికి. ఏమిటా ఎవిడెన్స్? అప్పుడే నాకు ఆ అద్దం ముక్కలు స్ఫురించాయి. అది క్షణికావేశంలో జరిగిన హత్య ఎందుక్కాకూడదు? అప్పుడు కత్తి అందుబాటులో వుండదు. అద్దం ముక్కతో యెందుకు పొడవకూడదు? అలా అనుమానించాను.

"వెల్, ఈ అనుమానంతో డాక్టర్ సహాయం కోరి, ఇక్కడికి వచ్చాను అద్దం ముక్కల్ని చూద్దామని. అనుకున్నట్లే ఒకటి తక్కువ వుంది. డాక్టర్ రిపోర్టు కూడా నేను అనుకున్నట్లే వుంది. హత్య యీ అద్దం ముక్కతో జరిగింది. కానీ దీన్ని అలాగే వదిలేస్తే తనని పట్టిస్తుంది

కాబట్టి, మన దృష్టిని మళ్ళించడానికి దాన్ని తొలగించి కత్తి కోసం వెళ్ళడం జరిగింది. కత్తి తెచ్చుకొని ముందిక్కడ తవ్వి ఈ అద్దం ముక్కని పాతిపెట్టేసి అప్పుడు కత్తిని తుడిచి ఆ గాయంలోకి దింపి వెళ్ళిపోయాడు."

"ఎవరు? యెవరు చేశారు యీ పని?"

"దాన్ని జాగ్రత్తగా చూడండి తెలుస్తుంది. ఆ రక్తం మరకలో క్లూ వుంది. బొటనవేలిముద్ర అచ్చొత్తినట్లుంది. మీరు సేకరించిన వేలిముద్రలతో దాన్ని టాలీ చేసి చూడండి. హంతకుడు దొరికిపోతాడు!" అన్నాడు డిటెక్టివ్ అక్కడ్నుంచి కదుల్తూ.

"వెల్ .... వెల్ .... వెల్! పగిలిన అద్దం పట్టిచ్చింది!" అరిచాడుజాన్ అతన్ని అనుసరిస్తూ.

# 10

రవీందర్ తండ్రి వంక భయంగా చూశాడు.

తండ్రి అసహనంగా చూసి పెరిగిపోతూన్న కోపంతో టీపాయ్ మీద కొట్టాడు. "అసలేం జరిగిందో చెప్పరా సన్నాసీ! ఆ చేతికి కట్టు ఏమిటి? డిటెక్టివ్‌తో అబద్ధం యెందుకు చెప్పావు?"

రవీందర్ ఉలిక్కిపడి చేతిని చూసుకున్నాడు. దాన్ని నిమురుకుంటూ తల దించుకున్నాడు.

"నా కొంపలు ముంచేలా వున్నావురా!"

"నే నేం ముంచలేదు నాన్నా!"

"అయితే యేం చేశావో చెప్పి ఏడవరా?"

"మరి నన్ను రక్షిస్తావా నాన్నా!"

"నిన్ను రక్షించడానికే కదరా నేను కన్నది?"

"లేదు. నువ్వు కనలేదు. అమ్మ కన్నది. నువ్వు చెడగొట్టావు. అమ్మ వుంటే నే నిలా అయ్యేవాడ్నా?"

"నేను నిన్ను చెడగొట్టానా?"

"మరి నీ బుద్ధులు నా కొస్తూంటే నన్నాపే దెవరు? అమ్మ వుంటే నాకీ రోజు పెళ్ళికూడా అయిపోయేది. మర్యాదగా బ్రతుకుతూ వుండేవాడ్ని. నీకు నా గురించి ఏ పట్టింపూ లేదు."

"సరే....సరే....నీ పెళ్ళి త్వరలోనే చేసేస్తానుగానీ, ఏం జరిగిందో ముందు చెప్పి ఏడ్వరా సన్నాసీ!"

క్షణ మాలోచించి "సరే చెప్తాను" అన్నాడు రవీందర్ అలాగే నిల్చుని. "మరి నన్ను రక్షించాలి నాన్నా! నీ క్షేమం కోసమే చేశాను యీ పని! నువ్వు నా మీద ఒక బాధ్యతను వేశాక దాన్ని పూర్తి చేయడానికే యీ పని చేయవలసి వచ్చింది. నాకేం తృప్తిగా లేదు. ఇలా చేయవలసివస్తుందనుకోలేదు. చీటింగ్ గ్యాంగ్ గురించి నీకు తెలుసు కదా, నాన్నా? ఆ వ్యవహారంలో ప్రభాకర రావుని ఒప్పించే బాధ్యత నా మీద వేశావు—"

"అవును.... నెల పైనే అయింది" అన్నాడు తండ్రి మధ్యలో. "ఆ గ్యాంగ్ వ్యవహారాల్లో ఆసక్తి కలిగి ప్రభాకరరావు ఫోటోలతో సహా వివరాలు సేకరించి మనకు పంపాడు. అదే అతని మొదటి రిపోర్టు. దాంతో ఆ గ్యాంగ్ మొత్తం క్షణాల్లో పట్టుబడడం ఖాయం!"

"ఖాయం!" రవీందర్ అందుకున్నాడు, "అతనికి అంత గొప్ప పనిచేసే ఆలోచన ఎందుకు కలిగిందో అంత రిస్కు తీసుకుని, ఎలా సాధించాడో మనకు తెలియదు. కానీ నువ్వు మాత్రం నెల కావస్తోన్నా ఆ రిపోర్టుని పత్రికలో వేయకుండా జాగుచేస్తూ వచ్చావు. అతను అడుగుతోంటే, అదుగో వచ్చేస్తుంది—ఇదిగో వచ్చేస్తుందని మభ్య పెట్టావు. అసలు నీ ఉద్దేశ్యం వేరు! ఆ

రిపోర్టుని ముందు ప్రచురించకుండా దాన్నాధారంగా ఆ ముఠాని బ్లాక్ మెయిలు చేద్దామనుకున్నావు, చాలామందిని చేస్తున్నట్టుగానే.

"ఆ గ్యాంగ్ చిత్రంగా నీకు లొంగిపోయింది. పదివేలు గుంజావు, మొన్న పదిరోజుల క్రితం. ఇక రిపోర్టు వేసే ప్రశ్నే లేదు! ప్రభాకరరావు మాటిమాటికీ అడుగుతోంటే, వేయకపోతే తిరిగి ఇచ్చేయమంటోంటే, నచ్చచెప్పలేక కిందామీదయ్యావు. అతన్ని ఒప్పించే బాధ్యత నాకిచ్చావు—"

"ఇచ్చానురా! అయితే నువ్వేం చేశావు?"

"నువ్విచ్చిన రెండు వేలు పట్టుకుని పోయాను అతని దగ్గరికి. మొన్న సాయంత్రం వెళ్ళాను. అతన్ని బార్ కి తీసుకెళ్ళి బాగా తాగించి, యింటికి తెచ్చి పని ముగించుకోవాలనుకున్నాను. కానీ అతను నాయర్ హోటల్లో గొడవ పడటం వల్ల కొంత ఆలస్యం జరిగింది. మేమింటికొచ్చేసరికి ఆ న్యూడెంటు లేదు. తలుపు గొళ్ళెం పెట్టి వెళ్ళిపోయింది. నేను స్కూటర్ని లోపలికి పోనిచ్చి కాంపౌండ్ లో ఆపాను. అప్పుడు పదకొండు అవుతోంది. మేం యింట్లో కెళ్ళాం. అతను బట్టలు మార్చుకుని తన ఆర్టికల్ విషయం ఎత్తేవరకు ఆగాను. అప్పుడు పన్నెండు గంటలకి ఆ ప్రస్తావన వచ్చింది, చాలా సేపు నాయర్ గురించే మాట్లాడుతున్నాక!"

"ఏమంటాడు?"

"అదింకెపుడో స్తుందని! కానీ నాన్నా, నేను సంకోచిస్తూనే చెప్పాను—అతడెలా రియాక్టు అవుతాడోనని- ఆ ఆర్టికల్ ఎక్కడో పోయిందని! అతను ఉగ్రుడయ్యాడు. ఎలా పోయిందని ఉరిమాడు. పొరపాటున

చితు కాగితాలతో కలపి తగలెట్టారని చెప్పాను—"

"ఏమన్నాడ్రా?"

"రెచ్చిపోయాడు, నాన్నా! కుర్చీలోంచి లేచి తిట్లు లంకించుకున్నాడు! నిన్నూ నీ స్టాఫ్‌నీ చెడామడా తిట్టిపోశాడు! శాంతపర్చి, అందుకే నష్టపరిహారం ఇద్దామని వచ్చాననన్నాను. డబ్బుతీసి ముందుపెట్టాను. దాన్ని చూస్తూ ఆలోచనల్లో పడ్డాడు. అప్పుడు నువ్వు చెప్పినట్లే తెల్ల కాగితం, కలంకూడా తీసి ముందుపెట్టాను. డబ్బు తీసుకుని ముట్టినట్లు సంతకం పెట్టమన్నాను. అంత డబ్బుని చూసి ఆ మైకంలో ఆ పని చేసేస్తాడనే అనుకున్నాను. అప్పుడా బ్లాంక్ పేపరుమీద మనకనుకూలమైన మేటర్ వ్రాసుకుని, ఈ బ్లాక్ మెయిల్‌లో అతను కూడా భాగ స్థుడని రుజావుచేసే పత్రం సృష్టించవచ్చు. మళ్లెప్పుడైనా ఆర్టికల్ గురించి గొడవపెడితే, ఆ నోట్ చూపించి అతని నోరు నొక్కవచ్చు. అంతే కదా నాన్నా, నువ్వనుకున్నది?"

"అవున్రా, అయితే ఏం చేశాడు?"

"పసిగట్టేశాడు నాన్నా, అంత మైకంలోనూ! ఆ కాగితం, కలం విసిరేసి, నోట్లకట్టల్ని కిటికీకేసి గిరావాటేశాడు! కిటికీ అప్పుడు మూసివుంది. లేకపోతే బయిటికి వెళ్ళిపోయేవి. ఒకటి రెక్కలకు కొట్టుకుంది, మరొకటి పైన ఫోటోకి వెళ్ళి కొట్టుకుని కిందపడింది. అప్పుడు నామీద పడి పీక పుచ్చుకున్నాడు, నాన్నా!"

"నువ్వేం చేశావురా?"

"కళ్లు తేలవేశాను, నాన్నా! ఊపిరాడలేదు! నన్నింత మోసంచేస్తావా రాస్కెల్ అంటూ నా గొంతు వదల్లేదు. ఆర్టికల్ పోయింది అబద్ధం, దాన్ని దాచిపెట్టి

బ్లాక్ మెయిల్ చేస్తున్నారు వాళ్ళని, నీ బాబు సంగతి నాకు తెలీదనుకోకు, మొదట్నుంచీ నాకనుమానంగా వుంది. ఇప్పుడు నిజమైందంటూ నా గొంతును పిసికేయ సాగాడు. నేనెలాగో అతన్ని తోసేశాను. అప్పుడు అద్దం దగ్గరకి దూకి పౌడరు డబ్బా అందుకున్నాడు. దాన్ని నా మీదికి విసరబోతే చుట్టూ తిరిగి అద్దం దగ్గర కొచ్చాను. అది వచ్చి అద్దానికి కొట్టుకుంది. అద్దం ముక్కలై కిందపడింది! అప్పుడతను వచ్చే సంచికలో ఆర్టికల్ రాకపోతే, పోలీసులకి ఫోన్ చేస్తానన్నాడు-"

"అలా అన్నాడా!"

"అవున్నాన్నా! ఎంత ప్రమాదమో చూడు! అలా ఫోన్ చేశాడంటే, ఆ ముఠావాళ్ళు డబుల్ క్రాస్ చేస్తారా అని మనమీద వచ్చి పడతారు కదా నాన్నా? రక్తపాతం జరుగుతుంది. ఎంత ప్రమాదమో చూశావా? అందుకని నేనొక్కటే ఆలోచించాను. మనం బ్రతకాలంటే అతను బ్రతకక్కూడదు! వెంటనే అతనిమీదికి లంఘించి కడుపులో ఒక్క పోటు పొడిచాను—"

"ఓరి—ఓరి—"

"ఆగు నాన్నా, ఆగు అంతా విని నా తెలివిని మెచ్చుకో! అతన్ని పొడిచింది అద్దం ముక్కతో. మరేదీ దొరకలేదు. నా చెయ్యి కోసుకుంది! వెంటనే రక్తం కారకుండా కర్చీఫ్‌తో అదిమిపట్టాను. అతను కిందపడి తన్నుకుని ఇట్టే చచ్చిపోయాడు, నాన్నా! నాకప్పుడు గాభరా పుట్టుకొచ్చింది! పారిపోదామనుకున్నాను. కానీ అప్పుడే బయట మెట్లమీదనుంచి అడుగులు విన్పించాయి. వెంటనే లైట్లార్పేసి చీకటి చేశాను. ఆ మనిషి తిరిగి పైకి వెళ్ళాక వేగంగా ఆలోచించాను—"

"ఏం ఆలోచించావురా, భడవా! నా కొంప ముంచావు!"

"లేదు నాన్నా, నన్నెవరూ పట్టుకోలేరు! అతని కడుపులో అద్దం ముక్కని అలాగే వదిలేసే నా చేతిని చూసి వాళ్ళనుమానిస్తారు. అద్దం ముక్కతో హత్య జరిగిందని వాళ్ళకి తెలియకూడదు! అందుకని కత్తి కోసం ఇంట్లో చూశాను—కానీ ఇంటి కత్తికంటే మరోకరిదైతే బాగుంటుందనుకున్నాను. అప్పుడు నాయర్ గుర్తొచ్చాడు. వెంటనే అతని హోటలుకెళ్ళి ఎలాగైనా ఒక కత్తిని సంపాదించుకున్నాను. స్కూటర్ని కాంపౌండు వారగా చీకట్లో పెట్టి, నడిచి వెళ్ళిపోయాను. కానీ అక్కడ హోటలు మూసివుంది—ఏం చేయాలో పాలుపోలేదు. ప్రక్కనే ఇరానీ హోటలు కన్పించింది. అక్కడికెళ్ళి రెండు కేకులు పార్సిలు కట్టిస్తూ, కౌంటర్ మీద వున్న బ్రెడ్ కోసే కత్తిని తీసేసుకున్నాను—

"అంతే నాన్నా, తిరిగి ఇంటికొచ్చేటప్పటికి ఒంటిగంటన్నరయింది. గబగబా వాకిట్లో కత్తితో గొయ్యి తవ్వి, ఆ అద్దం ముక్కను తెచ్చి అందులో పాతిపెట్టేశాను. కత్తిని గాయంలోకి దింపాను. అక్కడ నాకు సంబంధించిన ఆధారాలన్నీ తొలగించి, అతని చేతిగడియారంలో టైమును మూడున్నరకి పెట్టి డ్యామేజ్ చేసి, యింటికి తాళంవేసి, తాళంచెవిని విసిరేసి, స్కూటర్ని నెట్టుకుంటూ దూరంగా తీసుకెళ్ళి స్టార్టు చేసుకుని వచ్చేశాను, నాన్నా!"

తండ్రి అలాగే చూస్తూండిపోయాడు కొడుకుని.

"హత్య చేయవలసి వస్తే నేనీ బిజినెస్ వదిలివేయాలనుకునేవాడ్ని. నువ్వు చేసేశావు! నాకు సమస్యలు

తెచ్చిపెట్టావు! ఇప్పుడు నిన్ను కాపాడుకోవాలి! ఆ గ్యాంగ్ వారినుండి కంటే పోలీసులనుంచి కాపాడుకోవటం కష్టమని నీకు తెలియదట్రా, సన్నాసీ!"

"అనూహ్యం నాన్నా, అలా జరిగిపోయింది!"

"అక్కడ నువ్వేమీ ఆధారాలు వదల్లేదుగా?"

"లేదు—అన్నీ తీసేశాను. నువ్వు ఎలిబీ ఇస్తావు. వంటవాడు ఈ గాయానికి సాక్ష్యం ఇస్తాడు. అంతవరకు నాకు ప్రమాదం లేదు, నాన్నా. వాళ్లు ఎందర్నో అనుమానిస్తున్నారు. పనిగట్టుకుని నా ఒక్కడి గురించే ఆలోచించే అవకాశం నేనివ్వలేదు...నామీద వాళ్ళ దృష్టి మళ్ళదు. నాకు మోటివ్ ఏమని వూహిస్తారు నాన్నా?"

రవీందర్ ఛాతీ ఎగరేసి గర్వంగా నవ్వాడు.

తండ్రీ కొడుకులు మాటల్లోపడి బయట ఏం జరుగుతోందో గ్రహించలేదు.

ఇన్స్పెక్టర్ కృష్ణన్ తన బలగంతో అప్పుడే జీపు దిగి ఇంట్లోకి కూడా వచ్చేశాడు. అప్పుడుగానీ తెలుసుకోలేదు వాళ్ళిద్దరూ. కృష్ణన్ని చూస్తూనే బెదిరిపోయారు. మాటలాపేసి బొమ్మల్లాగుండిపోయారు.

కృష్ణన్ నవ్వి వాళ్ళని విష్ చేశాడు. అతను మాటలతో ఇబ్బంది పెట్టక, అద్దం ముక్క తీసి గర్వంగా చూపించాడు.

తండ్రి కళ్ళు తేలవేశాడు.

రవీందర్ గావు కేక పెట్టి పడిపోయాడు.

మర్నాడు పత్రికలలో ఈ వార్త వచ్చింది.

లెక్చరర్ హత్యకేసు-స్థానిక పత్రికాధిపతి కుమారుని అరెస్టు.

—:అయిపోయింది:—

సీరియల్

# రక్తపుటేర్లు

వసుంధర

(గత సంచిక తరువాయి)

"హలో—ఒక్క నిమిషం ఆగుతావా?"

ప్రతాప్ ఆగి వెనక్కు తిరిగేసరికి భీమసేనుడతణ్ని సమీపించి—"నేను నీ పేరు తెలుసుకోవచ్చా?" అనడిగాడు.

"ఎందుకు?"

"అన్నీ చెబుతాను..." అన్నాడు భీమసేనుడు.

ప్రతాప్ తన పేరు చెప్పి—"నువ్వెవరు?" అనడిగాడు.

"నా పేరు చెబుతాను. వివరాలు చెబుతాను. కాస్త పార్కులోకి వస్తావా?" అన్నాడు భీమసేనుడు.

ఎందుకూ అని అడగలేదు ప్రతాప్. ఇద్దరూ కలిసి పార్కులోకి వెళ్ళారు.

అది మధ్యాహ్న సమయం కావడంవల్ల పార్కు నిర్మానుష్యంగా వుంది. ప్రతాప్ భీమసేనుడి వంక చూసి-"నీ వ్యవహారం చాలా తమాషాగా వుంది. నాతో నీకు పనేమిటి?" అన్నాడు.

"నీకు మధురిమ తెలుసుగదా—నేనామె భక్తుడిని. ఆమె కోసం ఏమైనా చేస్తాను. ఆమె మనసును ఎవరైనా కష్టపెడితే సహించలేను—"

ప్రతాప్ అసహనంగా— "ఎవరి బలహీనతలు వాళ్ళకుంటాయి. అవన్నీ వినే తీరుబడి నాకు లేదు—" అన్నాడు.

"నా బలహీనత గురించి తెలుసుకున్నావు గదా— మరి బలం గురించి కూడా తెలుసుకోవూ—" అన్నాడు భీమసేనుడు.

ప్రతాప్ అసహనంగా అతడి వంక చూసి ఆశ్చర్యపడ్డాడు. భీమసేనుడు అప్పుడే చొక్కా విప్పి కండలు పొంగించాడు. చూడ్డానికతడు చాలా పెద్ద వస్తాదులా వున్నాడు. ఆ ఆకారం ప్రతాప్‌కు భయం కూడా కలిగించింది.

"నీ బలం గురించి నాకు ఆసక్తి లేదు—" అన్నాడు ప్రతాప్.

"నేనేం చేసినా నా ఇష్టప్రకారం చేస్తాను—" అన్నాడు భీమసేనుడు.

"ఏం చేస్తావేం?" అన్నాడు ప్రతాప్.

"నువ్వన్నది లేకుండా చేస్తాను...." అన్నాడు భీమసేనుడు.

కొద్దిక్షణాలు ఇద్దరి మధ్యా మాటలులేవు. భీమసేనుడు క్రూరంగా ప్రతాప్ వంక చూస్తున్నాడు. ప్రతాప్ ముఖంలో క్రమంగా భయం చోటుచేసుకుంటున్నది. భీమసేనుడు వున్నట్లుండి ఒకడుగు ముందుకువేసి ప్రతాప్ చేయి పట్టుకున్నాడు. ఆ పట్టు ఉడుం పట్టులాగున్నది.

"నువ్విక బయటపడడం కల్ల—" అన్నాడు భీమసేనుడు.

"నేను నీకేం అపకారం చేశాను?" అన్నాడు ప్రతాప్.

"అలాంటి చెత్త ప్రశ్నలతో కాలం వృధా చేయకు. నేను మనుషుల్ని రెండు రకాలుగా చంపుతాను. అందులో ఒకటి ఒక దెబ్బ చావు. రెండోది రెండు దెబ్బల చావు. ఒక దెబ్బ చావు చాలా సుఖంగా వుంటుంది. రెండు దెబ్బల చావులో మొదటి దెబ్బకీ రెండో దెబ్బకీ మధ్య నరకయాతన వుంటుంది. ఇప్పుడు నువ్వు గనుక మధురిమ నామస్మరణ చేసి ఆమెను దేవతగా అంగీకరించి కొద్ది సేపటి క్రితం ఆమెను అన్న మాటలకు పశ్చాత్తాపపడితే ఒక దెబ్బ చావు లభిస్తుంది. లేదా రెండు దెబ్బల చావు తప్పదు. ఆలోచించుకుందుక్కూడా ఎంతో వ్యవధి లేదు. తొందరగా తేల్చుకో—" అన్నాడు భీమసేనుడు.

"నువ్వు నన్ను చంపడం ఎవరైనా చూశారంటే ఆ తర్వాత నీ గతేమిటో ఆలోచించుకున్నావా? నీకు చట్టమంటే భయంలేదా? నేరమంటే భయంలేదా?" అన్నాడు ప్రతాప్.

"నాకు చట్టం, న్యాయం, ధర్మం, దేవుడు—అన్నీ కూడా మధురిమ. ఇంక ఎవరైనా నన్ను చూస్తున్నారంటావా? ఈ పార్కులో ఈ సమయంలో ఎవ్వరూ లేరు. అన్నీ చూసుకునే నిన్నిక్కడకు తీసుకుని వచ్చాను—"

"అక్కడే పొరబడ్డావు నాయనా!" అన్న మాట ఒకటి వినిపించి ఉలిక్కిపడ్డాడు భీమసేనుడు. అది ప్రతాప్ కంఠం కాదు.

"ఎవరది?" అన్నాడు భీమసేనుడు.

పక్కనున్న పొదల్లోంచి ఓ వృద్ధుడు ముందుకు వచ్చాడు.

అతణ్ణి చూడగానే బాగా ముసలివాడనిపిస్తుంది. వళ్ళంతా ముడతలు పడివుంది. మనిషి అస్థిపంజరానికి తోలు కప్పినట్లున్నాడు. అతడి చూపులు మహా భయంకరంగా వున్నాయి. భీమసేనుణ్ని చూసి అతడు నవ్వాడు. ఆ నవ్వు కూడా భయంకరంగా వుంది.

"ఎవర్నువ్వు? భీమసేనుడు తన ప్రశ్నను రెట్టించాడు.

"అఘోరీ బాబా!" అన్నాడు ప్రతాప్ అప్రయత్నంగా.

"తెలిసిందిగా నా పేరు" అన్నాడు చాలా తీవ్రంగా భీమసేనుడి కళ్ళలోకి చూస్తూ. ఆ చూపులకు భయపడ్డాడో ఏమో భీమసేనుడు ప్రతాప్ చేయి వదిలి పెట్టాడు.

"ఎందుకొచ్చావిక్కడికి?" అన్నాడు భీమసేనుడు.

"నూరేళ్ళ జీవితం నీది. దాన్ని జైలుపాలు చేసుకుంటావా? వారించడానికి వచ్చాను—" అన్నాడు అఘోరీబాబా.

"అందువల్ల నీకు లాభం?"

"మహాత్ములు తలపెట్టిన కార్యక్రమాలకు లాభనష్టాల బేరీజు ఉండదు. మూర్ఖ ప్రశ్నలు వేయక వచ్చిన దారినే వెళ్ళు—" అన్నాడు బాబా.

ఏమనుకున్నాడో భీమసేనుడు వెళ్ళిపోయాడు.

"బాబా—నువ్వు నా ప్రాణాలు రక్షించావు—" అన్నాడు ప్రతాప్.

"నీ ప్రాణాలు నా ప్రాణాలతో సమానం నాకు. రక్షించుకోక తప్పుతుందా?" అని నవ్వి—"బేతాళపూజ సక్రమంగా చేస్తున్నావా?" అన్నాడు బాబా.

"చేస్తున్నాను బాబా — ఫలితం ఎప్పటికి కనిపిస్తుందో మాత్రం తెలియడంలేదు—" అన్నాడు

ప్రతాప్.

"కనిపిస్తుంది-నీబండి నత్త నడక నడుస్తోంది. ఇప్పటికి ఎందర్ని పట్టావ్? అయిదుగురి నేకదా.... ఇంకా అయిదుగురు కావాలి...."

"ఇంకా అయిదుగురు కావాలి" తనలో తా ననుకున్నట్లు అన్నాడు ప్రతాప్. అతడి ముఖంలో అసంతృప్తి వుంది.

"నువ్వు చాలా గొప్పవాడివి అవుతావు. త్వరగా ప్రయత్నించు" అన్నాడు అఘోరీబాబా.

ప్రతాప్ అక్కడ్నించి కదిలేక తనలో తానే ఓసారి నవ్వుకున్నాడు బాబా. ఆ నవ్వు కూడా ఎంతో భయంకరంగా వుంది.

* * *

"నీకు మధురిమ అన్న పేరు సరయినది కాదు. క్లియోపాత్రా అనాలి నిన్ను" అన్నాడు రామకృష్ణ.

"ఏదో ఓ పేరు" అన్నది మధురిమ.

"అలాగనకు. పేరులోనే వుంది అంతా! సాధారణంగా ఆడవాళ్ళకు అందముంటే తెలివి వుండదు. తెలివుంటే అంద ముండదు. రెండూ వున్నవాళ్ళే రాజ్యాలేలుతున్నారు. లక్షలార్జిస్తున్నారు. అందుకే నిన్ను క్లియోపాత్రా అంటానన్నాను. అభ్యంతరమా?"

"నువ్విక్కడుండడమే నాకు అభ్యంతరం. వెడతావా?"

"వెళ్ళను" అని నవ్వాడు రామకృష్ణ. "నీ ప్రాణాలు నా కూడా తీసుకుని వెళ్ళాలి కదా!"

"అంటే?"

రామకృష్ణ చేతిలోని రివాల్వర్ రెండు సార్లు

పేలింది. చూస్తూండగా మంగళ, మధురిమ స్పృహతప్పి పడిపోయారు. రామకృష్ణ సమయం వృధా చేయలేదు. అతడు గదంతా సోదా చేశాడు. కావలసినదేమీ దొరికి నట్లు లేదు. ఆఖరికి యేదో ఆలోచించి ఆడవాళ్ళ నిద్దర్ని శోధించాడు. వారి జాకెట్సు లోపలా, అండర్ వేర్సు లోపలా అతడికి కొన్ని కాగితాలు దొరికాయి. అతడు తన పనిలో ఎంతగా నిమగ్నమైవున్నాడంటే, మధురిమ అందానికి ఆవేశపడలేదు. తనకు దొరికిన కాగితాల నతడు పాంటు జేబులోకి తోసేసి క్షణాలమీద అక్కడ నుంచి బయటపడ్డాడు. అతడు అలా బయటకు వెళ్ళిన కొద్ది క్షణాలకే డేంజర్ ఆ గదిలోకి ప్రవేశించాడు. గదిలో నేలమీద పడివున్న ఆడవాళ్ళ నిద్దరినీ చూశాడు.

గదిలోంచి రామకృష్ణ బయటకు వెళ్ళడం అతను చూశాడు. అయితే అతడు మధురిమకు తెలిసిన వ్యక్తే అని డేంజర్ అనుకున్నాడు. లోపల అడుగు పెట్టాక పరిస్థితి మరోలా వుంది.

డేంజర్ మధుసూదనరావును కలుసుకుని మధురిమ విధించిన షరతు గురించి చెప్పాడు. ఎట్టి పరిస్థితుల్లోనూ తా నా షరతుకు లోబడననీ, మధురిమ మాత్రమే ఏకాంతంగా కావాలనీ ఆయన అన్నాడు. అతను తిరిగి గదికి వచ్చి జరిగింది శ్రీకాంత్ నుంచి తెలుసుకుని తనే స్వయముగా వ్యవహారం నడపాలనుకుని మధురిమ దగ్గరకు బయలుదేరాడు.

అతడు ఆమె గదికి కొంత దూరంలో వుండగా రామకృష్ణ అక్కడనించి బయటకు రావడం చూశాడు. అయితే మధురిమను చాలా మంది కలుసుకుంటున్నారన్నమాట - అనుకుంటూ అతడు గదిలో అడుగు పెట్టి పరిస్థితి చూసి

తెల్లబోయాడు.

ఒక్క క్షణం మాత్రం డేంజర్ అలాగుండిపోయాడు. తర్వాత అతను తేరుకుని నెమ్మదిగా గదంతా తిరిగి కాసిని నీళ్ళు వాళ్ళిద్దరి ముఖాన చల్లి వాళ్ళకు త్వరగా స్పృహ వచ్చేలా చేశాడు.

ఇద్దరూ తేరుకుని యీ లోకంలోకి వచ్చేటప్పటికి కొంతసేపు పట్టింది. అప్పుడు మధురిమ డేంజర్ వంక తిరిగి "ఎవరున్నవ్వు?" అనడిగింది.

డేంజర్ కొంతవరకూ నిజమే చెప్పాడు. ఎవరో గది లోంచి వస్తూంటే చూసి అనుమానించి తను లోపల ప్రవేశించానన్నాడు.

రామకృష్ణ గదిలో యెందుకు ప్రవేశించాడో మధురిమకు తెలుసును. అందువల్ల ఆమెకు తామేం పోగొట్టుకున్నామో తెలిసిపోయింది. వంట్లో భద్రపరచిన విలువయిన కాగితాలు పోయాయి. ఆమె కనుసైగలతో మంగళతో మాట్లాడింది. ఇద్దరికీ రామకృష్ణ ఏం తీసుకుపోయాడో అర్థమయింది.

"అతడెలా వెళ్ళాడో, ఎక్కడకు వెళ్ళాడో నీకు తెలుసా?" అంది మధురిమ.

డేంజర్ ఆమె కంఠంలోని ఆత్రుతను చదివాడు. ఒక్కసారిగా అతడి బుర్ర పనిచేయ నారంభించింది. "తెలుసు!" అన్నాడు.

"ఎలా?"

"నాతో పాటు నా మిత్రుడు కూడా వున్నాడు. నా మిత్రుడు మీ మంగళకు తెలుసుకూడా!" అన్నాడతను.

"అయితే!"

"అతను ఆ వ్యక్తిని అనుసరించి బంధిస్తాడు........"
అన్నాడు డేంజర్ గర్వంగా.

"అతన్ని బంధించడం అంత సులభం కాదు" అంది మధురిమ.

"కానీ నా మిత్రుడికి సులభమే" అని — "ఒకసారి మా వాడికి ఫోన్ చేసి కనుక్కుంటాను" అంటూ గదిలోంచే ఏదో నంబర్ డయల్ చేసి ఏదో మాట్లాడి పెట్టేశాడు.

"వాటే బ్యూటీ! మా వాడు చేర్చవలసిన చోటికే చేర్చాడు వాడ్ని. కావాలంటే యిప్పుడే యిక్కడకు తీసుకునివస్తానంటున్నాడు" అన్నాడు డేంజర్.

"వాడు చాలా ప్రమాదకరమయిన మనిషి. ఎలాంటి వారినయినా యిట్టే కన్నుగప్పి పారిపోగలడు. మీ వాడికి దొరకడమే ఓ పెద్ద విశేషం. అతడ్ని మళ్ళీ బయటకు తీసుకుని రావద్దు. మనమే వెళ్ళి కలుసుకుందాం. అతడితో నేను యేకాంతంగా మాట్లాడాలి" అంది మధురిమ.

"అందుకు నాకు బహుమతి?" అన్నాడు డేంజర్.

మధురిమ తమాషాగా నవ్వి, "నా వేపు చూస్తే ఏమనిపిస్తోంది?" అనడిగింది.

డేంజర్ ఆమె వైపు ప్రత్యేకంగా చూశాడు. మగాడ్ని పిచ్చెక్కించే అందమామెది. "ఏమనిపించాలి?" అన్నాడతను.

"బహుమతి అన్న పదం - చాలా చిన్నదని!"

"మరి నీ వరతు?" అన్నాడు డేంజర్ మంగళను భయంగా చూస్తూ.

"నా వరతు సంగతి నేను చూసుకుంటాను. నీ

కెందుకు?"

డేంజర్ యింకేమీ మాట్లాడ లేదు.

మధురిమ మంగళతో "మంగళా! నేను మారు వేషంలో బయటకు వెడుతున్నాను. గదిలోకి యెవ రొచ్చినా, ఆఖరుకు భీమసేనుడు వచ్చినా నేను లేనన్న విషయం చెప్పొద్దు. మంచం మీద పడుకున్నాననీ, డిస్టర్బ చెయ్యొద్దన్నాననీ చెప్పు. వీలైనంత త్వరగా వెనక్కి వచ్చేస్తాను" అంది.

మంగళ అన్నింటికీ తల ఊచింది.

మధురిమ పురుష వేషంలో డేంజర్ని అనుసరించింది. హోటల్ బయటకు వచ్చాక డేంజర్ ఆమెకు అక్క డున్న కారు చూపించాడు. ఆమె కారులో కూర్చున్నాక అతను డ్రైవింగ్ సీటులో కూర్చున్నాడు.

కారు మధుసూదనరావు యింటివయిపు వెడుతోంది.

* * *

"అలా కూర్చో. నా పేరు మధుసూదనరావు" అన్నా డాయన.

మధురిమ కూర్చుంది.

"నిన్ను చూడ్డం నాకు చాలా సంతోషంగా వుంది" అన్నా డాయన మళ్ళీ.

"నాకూ చాలా సంతోషం. అయితే నేను మీరు బంధించిన వ్యక్తిని చూడాలని ఆత్రపడుతున్నాను" అంది మధురిమ.

"అదంతా మోసం. నేను ఏకాంతంగా నీ డ్యాన్సు చూడాలని నిన్నిక్కడకు రప్పించాను" అన్నాడు మధు సూదనరావు.

"వ్వాట్!" అంటూ లేచి నిలబడింది.

"నువ్వు ఎంతో బాగా నృత్యం చేస్తావు. ప్రతి కదలికా నీ శరీరంలో చేరితే కొత్త సొగసులు వస్తాయి. నువ్వు అంత మంది మగాళ్ళ ముందు నాట్యం చేస్తూంటే నాకు చూడ బుద్ధి వేయదు. నా కోసం....ప్రత్యేకంగా యిప్పుడు ఆడాలి. ప్రపంచంలో యెలాంటి సంగీతం యిష్టమంటే ఆ రికార్డు వేస్తాను. అదు....నన్ను సంతోష పెట్టు" అన్నాను మధుసూదనరావు.

"ఇదేం కోరిక?" అంది మధురిమ. "అక్కడ అంత మందిలో చూసేదానికి, యిక్కడ యేకాంతంగా చూసే దానికీ తేడా యేమీ వుండదు."

"ఓ పెద్ద తేడా వుంది. నీ నాట్యంలో ఆఖరి భాగం వరుసగా దుస్తులు తీసి వేయడం. అప్పుడు క్రమంగా లైట్సు డిమ్ అవుతాయి. నువ్వు మొత్తం దుస్తులు తీసి వేయగానే ఒక్కసారి చీకటై మళ్ళీ వెలుగు వస్తుంది. వెలుగులో నువ్వుండవు. ఇప్పుడు నేను చూడదల్చు కున్నది పూర్తి వెలుగులో నీ నృత్య ప్రదర్శన."

"దాని కోసం?"

"ఊఁ....దాని కోసం యిప్పటికి యిరవై వేలు ఖర్చు పెట్టాను."

"నేను నాట్యం చెయ్యను" అంది మధురిమ.

"చేస్తావు" అన్నాడు మధుసూదనరావు.

"చెయ్యను" అంది మధురిమ.

ఈసారి మధుసూదనరావు మాట్లాడలేదు. అతడి చేతిలో వున్నట్లుండి కొరడా వెలిసింది. దాంతో అతను ఛెళ్ళుమన్న శబ్దం చేశాడు.

"నువ్వు .." అని ఆగింది మధురిమ.

"ఇంకా రాక్షసుణ్ని కాలేదు. కానీ కాగలను."

"ఇది చాలా పెద్ద మోసం."

మధుసూదనరావు కొరడా నేలమీద ఛళ్ళుమంది.

"ఈ శబ్దం నీ శరీరంమీంచీ రాకూడదని నా ఆశ".

మధురిమ నృత్యం ప్రారంభమయింది.

మధుసూదనరావు టేపు రికార్డరు ఆన్ చేశాడు.

మధురిమ సంగీతానికి అనుగుణంగా ఆడుతోంది. మొదట ఆమె అయిష్టంగానే ప్రారంభించింది. సంగీతం వినేసరికి ఆమెలో ఆవేశం క్రమంగా కలిగింది. అందులో లీనమై ఆమె నృత్యం చేయసాగింది.

ఓ అరగంట సేపు ఆమె ఆడి అలసిపోయింది.

"ఇంక చాలా?"

"నీ నృత్యానికి ముగింపు యిలా వుండదు."

మధురిమ మాట్లాడలేదు.

"ఊ...." అన్నాడు మధుసూదనరావు.

మరో అయిదు నిముషాల్లో నృత్యం మధుసూదనరావు కోరిన విధంగా ముగిసింది. ఆయన ఆమెను సమీపించాడు.

"ఓడిపోయాను" అందామె.

"అంటే?"

"ఇంతవరకూ నేను అనాఘ్రాత పుష్పాన్ని. నృత్యం చేశాను కానీ నగ్నంగా యిలా యే పురుషుడి ముందూ నిలబడలేదు. చివరి క్షణాల్లో చీకటిలో అదృశ్యమయేదాన్ని. ఈ రోజు నా కిలాంటి గతి పట్టింది" అంది మధురిమ.

"నువ్వు అనాఘ్రాత పుష్పానివే అయితే ఈ రోజు నీలో యెలాంటి మార్పూ తీసుకురాదు" అన్నాడు మధుసూధనరావు.

ఆమె ఆశ్చర్యంగా అతడి వంక చూసింది.

"నేను నిజమే చెబుతున్నాను. నాకు నీ అవసరం లేదు. నువ్విక బట్టలు వేసుకోవచ్చు" అన్నాడాయన.

ఆమె క్రింద పడి వున్న దుస్తులు తీసుకోబోయింది.

"అవి కాదు. అవి!" అంటూ ఆయన మారంగా చూపించాడు. అక్కడ ఆమె గురించి వేరే దుస్తులు ఉన్నాయి.

"ఏం?" అన్నదామె.

"నాకు కావలసినవి నీ దుస్తులు. ముఖ్యంగా లో దుస్తులు."

"అవి ఎందుకు?"

"జవాబు నీకు తెలిసే ఉంటుంది. తెలియని పక్షంలో తెలుసు కుందుకు ప్రయత్నించకు" అన్నాడు మధుసూదన రావు.

ఆమె మారు మాట్లాడకుండా అతడు చూపిన దుస్తులు వేసుకుంది. "మరి నేను వెళ్ళవచ్చా?"

మధుసూదనరావు నవ్వి "ఎక్కడకు వెడతావు?" అనడిగాడు.

"ఎక్కడనుంచి వచ్చానో అక్కడికి!"

"నీకై నువ్వు వస్తే కదా నీకై నువ్వు వెళ్ళడానికి."

"అంటే?"

"నువ్వెక్కడికీ వెళ్ళనవసరం లేదు. నిన్ను పంపే ఏర్పాట్లు నేను చేస్తాను. నీ కిక్కడ ఏ లోటూ జరగదు. ఆత్మబంధువులా నేను చూసుకుంటాను."

మధురిమ దిగులుగా "ఈ రాత్రి నా నృత్య ముంది. నృత్యం జరక్కపోతే చాలా గొడవవుతుంది" అంది.

"నృత్యం జరక్కూడదనే గదా నిన్నిక్కడకు రప్పిం

చింది. నీ విలువ నీ కంటేకూడా నాకు బాగా తెలుసు" అన్నాడు మధుసూదనరావు.

మధురిమ యేమీ మాట్లాడలేదు. మధుసూదనరావు ఆ గదిలోంచి బయటకు వెడుతూ తలుపు తాళం వేశాడు. తర్వాత ఆయన మరో గదిలోకి వెళ్ళాడు. అక్కడ గోడలో మామూలుగా కంటికి కనిపించని అరను తెరిచాడు. అందులో ఫోన్ వుంది. అది టెలిఫోన్ ఎక్స్ఛేంజికి అందని ఫోను.

ఆయన ఓ నెంబరు తిప్పాడు. ఓ నిముషం ఆగాడు.

"హలో!" అంది అవతలి కంఠం.

"హలో! స్వప్నా హోటల్ ప్రొప్రయిటరుగారేనా?"

"ఆఁ.... మీ రెవరు?"

"ఈ రాత్రి మీ హోటల్లో మధురిమ నృత్యం జరగాలంటే నాకు అయిదు లక్షలు యివ్వాలి. ఓ.కే." అన్నాడు మధుసూదనరావు.

"ఎందుకు?"

"ఎందుకేమిటి? మధురిమ నా వద్దనే ఉన్నది కనుక."

"మీ రెక్కడనుంచి మాట్లాడుతున్నారు?"

"డబ్బు ఎక్కడకు తెచ్చివ్వాలీ అన్నది మాత్రమే మీరు తెలుసుకోవాలి" అంటూ నవ్వాడు మధుసూదనరావు.

"సరే! డబ్బు ఎక్కడికి తెచ్చివ్వాలి?"

"జ్యోతీ విలాస్ కాఫీ హోటల్ తెలుసా?"

"తెలియదు."

మధుసూదనరావు హోటల్ పరిసరాలు వర్ణించాడు.

"ఆ ప్రాంతం నాకు బాగా తెలుసు. కానీ అక్కడ

జ్యోతీ విలాస్ కాఫీ హోటలేమీ లేదే!"

"జ్యోతీ విలాస్ కాఫీ హోటలంటే పెద్ద బిల్డింగేమీ కాదు. చిన్న పాక. అందులోని ప్రొప్రయిటరుకి డబ్బిం చిన బ్రీఫ్ కేసు అందజేయి. అన్నీ ఈ సాయంత్రం ఆరింటి లోగా జరగాలి. అప్పుడే మధురిమ మీ హోటల్ చేరు కుంటుంది. అర్థమయిందా?"

"అలాగే. కానీ తొందరపడి మధురిమను యేమీ చేయొద్దు. మీ రడిగింది చాలా పెద్ద మొత్తం. ఆరింటికి కాకపోతే ఏడింటికి....ఏడింటికి కాకపోతే ఎనిమిదింటికి మాత తప్పక డబ్బు అందజేస్తాం. దయుంచి కాస్త సహనం చూపించండి. ఆమె ప్రాణాలతో ఆడుకో కండి."

"ఆల్ రైట్!" అని ఫోన్ పెట్టేశాడు మధుసూదన రావు.

• • •

మంగళ స్వయంగా తలుపు తీసింది.

అవతల మనిషి ఆయాసపడుతూ—"చూడమ్మా— గదిలో మధురిమ ఉన్నదా?" అన్నాడు.

"వుంది—నిద్రపోతోంది!"

అవతల మనిషి నమ్మలేనట్లు-"ఒక్కసారి చూడమ్మా- ఆమె నిజంగా గదిలో ఉందా?" అన్నాడు.

"అసలేం జరిగింది?" అంది మంగళ.

"నేనీ హోటలు ప్రొప్రయిటర్ని. మధురిమ నెవరో కిడ్నాప్ చేసినట్లు నాకిప్పుడే ఫోన్ వచ్చింది. అయిదు లక్షలు రాన్సమ్ అడిగారు. అందుకే కంగారుగా ఇలా పరుగెత్తుకు వచ్చాను...." అన్నాడు ప్రొప్రయిటరు.

అది వింటూ మంగళ కంగారుపడింది. అయినా పైకి

తేలకుండా "చాలా మంచివార్త చెప్పారు. యెవరో మధురిమను అపహరించడానికి పటిష్టమైన పథకం వేసు కున్నారన్నమాట. అ నమ్మకంలోనే ముందుగా హెచ్చరించగలిగారు. మేమిక్కడ మా జాగ్రత్తలో వుంటాం. ఎందుకైనా మంచిది—మీరు డబ్బు సిద్ధంచేసి వాళ్ళకు అందజేయండి...." అంది.

"మధురిమ ఇక్కడే వుంటే వాళ్ళకు డబ్బు పంపడం మెందుకు?"

"డబ్బు పంపకపోతే వాళ్ళు మధురిమను ఎత్తుకు పోతారని నా అనుమానం. వారి శక్తిమీద వారికి బాగా నమ్మకమున్నట్లుంది—" అంది మంగళ.

"అదంతా వాళ్ళభ్రమ. మా హోటల్లోంచి మధురిమను తీసుకుపోవడమన్నది అసాధ్యం—"

"మీకా నమ్మకముందనుకోను. వుంటే ఫోన్ వినగానే కంగారుపడి పరుగున వచ్చి వుండేవారుకాదు—" అంది మంగళ హేళనగా.

"నువ్వు చెప్పిందీ పాయింటే.... అయితే ఇంట్లో మనిషిని పెట్టుకుని సెక్యూరిటీకోసం వాళ్ళకివ్వడానికి అయిదులక్షలు సామాన్యమైన మొత్తమా ఏమన్నా నా?" అన్నాడు ప్రొప్రయిటరు.

"మధురిమ కోట్లు విలువ మనిషని మీకు తెలియంది కాదు ..."

"కానీ అయిదు లక్షలు నేనెక్కణ్నించి తెచ్చేది?"

"ఒకవేళ రాత్రికి మధురిమ నృత్యం జరక్కపోతే అప్పుడు మీరేం చేయగలరు? అయిదు లక్షలొక లెక్కా అని అప్పుడనుకుంటే ప్రయోజనముంటుందా?" అంది మంగళ.

"ఏమ్మా—ఇంతకీ మధురిమ గదిలో వుందా, లేదా?" అనుమానంగా అడిగాడు ప్రొప్రయిటరు.

"ఆ విషయంలో మీరేం అనుమానం పెట్టుకోకండి. ఈ రాత్రికి మధురిమ నృత్యం జరిగితీరుతుంది. అయితే ఆమెకు ప్రమాదం జరుగుతుందని కూడా నా మనసు నాకు సూచిస్తోంది. ఈ విషయంలో మీకో చిన్న క్లూ ఇవ్వగలను. మధురిమను అపహరించాలని డేంజర్ అనే అతను ప్రయత్నిస్తున్నాడు—...."

"డేంజరా?" అన్నాడు ప్రొప్రయిటరు.

"అవును. అతను గదికి వచ్చి బెదిరించి వెళ్ళాడు. ఈ రోజు అతడి కదలికలను శ్రద్ధగా గమనిస్తే.... బహుశా...."

"ఈ మాత్రం క్లూ ఇచ్చావు చాలు....ఓసారి మధురిమను పిలుస్తావా?" అన్నాడు ప్రొప్రయిటరు.

"ఆమె స్నానాల గదిలో వుంది. ఇప్పుడెవరితోటీ మాట్లాడదు...."

ప్రొప్రయిటరు వెళ్ళిపోయాడు.

మంగళ భీమసేనుడి వంక తిరిగి-"ఈ రోజు మధురిమ చెప్పిన ముఖ్యమైన పని సాధించుకురాలేక పోయావు. ఆమె మనసు కష్టపెట్టిన వాడిని వదిలిపెట్టేశావు. అయితే ఇప్పుడు నీకు మరో పని తగిలింది. ఇది జాగ్రత్తగా చేసుకురావాలి—" అంది.

"ఏమిటిది?"

"ఈ ఊళ్ళో మనకే ఇబ్బంది వచ్చినా విజయబాబును కలుసుకోవాలని ఆదేశముంది. నువ్వు రహస్యంగా ఆయన్ను కలుసుకుని నేనిచ్చిన ఉత్తరం అందచేయగలవా? అంతా రహస్యంగా చేయగలవా?"

"ఎందుకు చేయలేను?"

"నీ ఆకారం అలాంటిది! నీ రూపమే మన రహస్యాలు సగందాకా బయట పెడుతుంది—" అంది మంగళ.

"ఇంతకీ ఏం చేయాలో చెప్పు!"

"ఈ రోజు మధుంమను అపహరించే ప్రయత్నం జరుగుతుందని నాకు భయంగా వుంది. కాబోయే కిడ్నా పర్సుకు డబ్బిచ్చే ఏర్పాటు చేయమని విజయబాబుకి చెప్పాలి. తర్వాత వాళ్ళెవరో తెలుసుకోవాలి—"

"తెలుసుకుని?" అన్నాడు భీమసేనుడు.

"ముందు — తెలుసుకో! అప్పుడు నీకు తోచినట్లు చేయి—" అంది మంగళ.

* * *

సాయంత్రం ఏడు గంటలు....

జ్యోతీవిలాస్ కాఫీ హోటలు....

ఆ పాక ముందుకు ఓ మనిషి వచ్చి ఆగాడు. అతను సన్నగా పొడుగ్గా వున్నాడు. బట్టలు, గెడ్డం మాసి వున్నాయి. అతని చేతిలో ఓ పాత బ్రీఫ్ కేసు వుంది.

అతను నెమ్మదిగా పాకలో అడుగు పెట్టాడు.

బక్కపలచగా వున్నాడు ప్రొప్రయిటరు. అతడి ముందున్న బల్లమీద బ్రీఫ్ కేసు వుంచాడతను.

"ఎవరయ్యా నువ్వు?" అన్నాడు ప్రొప్రయిటరు.

"ఇది మధుసూదనరావుగారికి పంపించు—"

ప్రొప్రయిటరు బ్రీఫ్ కేసు వళ్ళో పెట్టుకున్నాడు.

అతను వెళ్ళిపోయాడు. కానీ హోటలుకు దూరంగా మారువేషంలో నిలబడి వున్న భీమసేనుడు మాత్రం అక్కడే వున్నాడు కదలకుండా.

ఇక్కణ్నించి ఆ పెట్టె ఎక్కడకు వెళుతుంది?

అయిదు నిమషాలు గడిచాయి.

హోటల్లోంచి ఓ కుర్రాడు బైటకు వచ్చాడు. వాడి చేతిలో బ్రీఫ్ కేసు వుంది. భీమసేనుడు వాణ్ని చూశాడు. అనుసరించడం ప్రారంభించాడు.

కుర్రాడు చకచకా నడుస్తున్నాడు. వాడి చూపుల్లో బెదురులేదు. నడకలో కంగారులేదు. హుషారుగా ఈల వేసుకుంటూ మరీ నడుస్తున్నాడు.

వాడు ఈలవేయడం భీమసేనుడికి వీలుగా వుంది. మనిషిని చూడకుండా ఈల వింటూనే అనుసరించుకుంటూ పోవచ్చు.

కుర్రాడు జనసంచారం లేని సందులోకి దారి మళ్ళించాడు. అతడికి బాగా దూరంగా వుంటూ అనుమానం రాని విధంగా అనుసరిస్తున్నాడు భీమసేనుడు.

కుర్రాడు చాలా సందులు తిరిగాడు. ఎక్కడా జన సంచారంలేదు.

వున్నట్టుండి ఓ సందులో కుర్రాడు వెనక్కి తిరిగాడు. భీమసేనుడు చురుగ్గానే వున్నాడు. చటుక్కున అతడి కళ్ళబడకుండా తప్పుకున్నాడు.

కుర్రాడు బ్రీఫ్ కేసు రోడ్డుమీద పెట్టాడు. మళ్ళీ ఓసారి అటూ ఇటూ చూశాడు. నెమ్మదిగా పాంటు జిప్పు లాక్కుంటూ పక్కనే వున్న ఓ ఇరుకు సందులోకి దూరాడు.

సందులోకి కుర్రాడెందుకు వెళ్ళాడో భీమసేనుడూ హించగలిగాడు. తనిప్పుడేం చేయాలి? కుర్రాణ్ని అనుసరించడమా లేక బ్రీఫ్ కేసు తస్కరించుకుని వెనక్కి పోవడమా? వెనక్కి పోతే ఆ కిడ్నాపర్సు ఆచూకీ ఎలా తెలుస్తుంది?

భీమసేనుడు ఒకటి .... రెండు .... అయిదు .... పది నిమిషాలు ఎదురు చూశాడు. ఇరుకుసందులోని వస్త్రాడు రాలేదు.

ఏం జరిగింది? ఆ వస్త్రాదేమయ్యాడు?

అతను అడుగు ముందుకు వేశాడు. బ్రీఫ్ కేసును సమీపించాడు. ఇరుకు సందుకేసి దృష్టిసారించాడు. ఎవ్వరూ లేరు.

భీమసేనుడు సందులోకి కూడా వెళ్ళాడు. సందులోంచి ఎటైనా పోవడానికి మూడు దార్లున్నాయి. అంటే వస్త్రాడు ఆ మూడు దార్లలో ఓ దారిన బయల్దేరి అక్కణ్ణించి వెళ్ళిపోయాడు. అయితే అలా ఎందుకు చేశాడు? బ్రీఫ్ కేసును నడిరోడ్డున వదిలేశాడు. అదిప్పుడు వేరెవరైనా తీసుకుని వెడతారా?

భీమసేనుడు సందులోనే కాసేపు ఎదురు చూశాడు. ఎక్కడా నరసంచారం లేదు. యెవ్వరూ బ్రీఫ్ కేసు కోసం రాలేదు. చూసి చూసి అతను విసిగిపోయాడు. బ్రీఫ్ కేసును సమీపించాడు.

తనిప్పుడేం చేయాలి?

బ్రీఫ్ కేసును అక్కడ అలాగే వుండనిచ్చి కాపలా కాయడమా లేక అది తీసుకుని పోవడమా? ఏం చేస్తే మంచిది? ఎటూ తేల్చుకోలేక పోతున్నాడతను.

చిట్టచివరకు అతడి చేయి బ్రీఫ్ కేసుమీద పడింది. అతను దాన్నందుకుని తెరిచాడు. డబ్బు భద్రంగా వున్నదా అని చూడాలనుకున్నాడు. అయితే బ్రీఫ్ కేసు తేలికగా వుంది. అదతను తెరవగానే తెరచుకుంది. లోపల ఓ చిన్న కాగితం.

"మిస్టర్ భీమసేన్! నువ్వింక నీ గదికి పోవచ్చు."

ఇదీ ఆ కాగితంమీద వ్రాసి వుంది.

భీమసేనుడి పిడికిళ్ళు బిగిశాయి. వాళ్ళు చాలా తెలివిగా తన్ను ట్రిక్ చేశారు. ఇప్పుడు తనేంచేయాలి?

మరోసారి అతడా కాగితం చదివాడు.

"మిస్టర్ భీమసేన్! నువ్వింక నీ గదికి పోవచ్చు...."

* * *

"వెరీ గుడ్! వెరీ గుడ్!" అన్నాడు మధుసూదనరావు.

డేంజర్ వినయంగా తలవంచి—"ఈ పథకం వాడి కాదు. నా స్నేహితుడు శ్రీకాంత్ ది...." అన్నాడు.

భీమసేనుడలా వెళ్ళగానే బ్రీఫ్ కేసులోని రెండు సంచీలనూ సులభంగా మధుసూదనరావుకు చేర్చడమైంది.

మధుసూదనరావు ప్యాకెట్లు విప్పాడు.

కట్టలు....వందరూపాయల నోట్ల కట్టలు....

"ఎంత సార్!" అన్నాడు డేంజర్.

"అయిదు లక్షలు...." అన్నాడు మధుసూదనరావు.

"బుర్రంటే మీదీ బుర్ర...." అన్నాడు డేంజర్.

"మధురిమను వారికి తిరిగి అప్పజెప్పడం మర్యాదకదా- ఆ పనికి కూడా నీ దగ్గర ఏదైనా పథకం సిద్ధంగా వుందా?" అన్నాడు మధుసూదనరావు.

"ముందు డబ్బు లెక్క పెట్టండి సార్!"

"అవును—అదీ పాయింటే!"

మధుసూదనరావు లెక్క పెట్టడం మొదలుపెట్టి ఉలిక్కిపడ్డాడు.

"ఏమయింది సార్!"

"మోసం—పచ్చి మోసం...."

డేంజర్ అతన్ని సమీపించి ఓ నోట్ల కట్ట తీశాడు.

అతడికేమీ తెలియలేదు—"ఏమిటి సార్!" అన్నాడతను.

"ఇవి దొంగనోట్లు...."

"ఎలా తెలిసింది?"

"దొంగనోట్లు ఏ సీరీస్‌లో వస్తున్నాయో నాకు కంఠో పాఠం...."

మధుసూదనరావుకు అవి దొంగనోట్లని తెలియడానికి మరో కారణముంది. ఆయనకు దొంగనోట్ల మార్పిడీలో భాగముంది. ఈ విషయమై ఊళ్ళో ఆయనకు కొందరు భాగస్వాములున్నారు. వారిలో స్వప్నా హోటలు ప్రొప్రయిటరు లేడు. భాగస్వాములందరికీ దొంగనోటు సీరీస్ గురించి బాగా తెలుసు....

"అయితే ఏం చేస్తారు?"

మధుసూదనరావు ఆలోచనలోపడ్డాడు. దొంగనోట్లు స్వప్నా హోటలు ప్రొప్రయిటరుకెలా వచ్చాయి? ఎవరో తన భాగస్వాములే వీటి మార్పిడీకి అతడినుపయోగించు కుంటూ వుండాలి. ఈ డబ్బు అతడీ విధంగా ఉపయోగించుకున్నాడు. మధురిమను అపహరించినది తానని ఎవరికీ తెలియదు. తెలిసుంటే ఈ నోట్లు తనదాకా వచ్చి వుండేవి కాదేమో....

ఆయన మళ్ళీ రహస్యమైన టెలిఫోనున్న గదికి వెళ్ళాడు. స్వప్నా హోటలు ప్రొప్రయిటరుకు ఫోన్ చేశాడు.

"హలో!" అంది అవతలి స్వరం.

"నువ్వు నాకు దొంగనోట్లు పంపావు. అందువల్ల మధురిమను నేను వదలడంలేదు—" అన్నాడు మధుసూదనరావు.

"దొంగనోట్లు పంపడమేమిటి? నేనసలు ఏ నోట్లూ

పంపలేదు...."

ఈ సమాధానం విని తెల్లబోయాడు మధుసూదనరావు ఇద్దరూ ఒకరొన్నొకరు అర్థంచేసుకుందుకు కాసేపు పట్టింది.

"అయితే ఈ రాత్రికి మధురిమ నృత్యం నీ హోటల్లో వుండదు...."

"హలో మిస్టర్ డేంజర్! ఈ రాత్రి పన్నెండింటికి మా హోటల్లో మధురిమ చేయబోయే నృత్యానికి రావల సిందిగా నిన్ను కూడా కోరుతున్నాను...."

మళ్ళీ దెబ్బతిన్నాడు మధుసూదనరావు—

"ఏమన్నావ్?"

"నీ పేరు డేంజర్ అని నాకు తెలుసంటున్నాను...."

"అయితే అనుభవిస్తావ్!" అంటూ ఫోన్ పెట్టేశా డాయన. తర్వాత డేంజర్ దగ్గరకు వెళ్ళి—"నువ్వు నీ గురించి తెలిసిపోయేలా మసిలావా?" అన్నాడు.

"అంటే?"

"స్వప్నా హోటలు ప్రొప్రయిటర్—మధురిమ అప హరణ గురించి నిన్నే అనుమానిస్తున్నాడు.." అన్నాడు మధుసూదనరావు.

"అనుమానించనివ్వండి. అందువల్ల మీకు నష్టమేమిటి?"

"అవును-నాకు నష్టమేమిటి?" అని గొణుక్కున్నాడు మధుసూదనరావు. తర్వాత ఆయన — "వాడు చాలా ధైర్యంగా మాట్లాడుకున్నాడు మధురిమ గురించి. కొంప దీసి ఆమె తప్పించుకుని పారిపోలేదుగదా!" అన్నాడు.

"ఈ ఇంట్లోంచి పారిపోవడమా!" అని నవ్వాడు డేంజర్.

మధుసూదనరావు మధురిమనుంచిన గదిలోకి వెళ్ళి తలుపు తోశాడు. లోపల మధురిమ సోఫాలో కూర్చుని

వుంది.

"హలో!" అన్నాడాయన.

"నన్ను వదిలి వెడతావా?" అంది మధురిమ.

"నిన్ను వదలడమా—అప్పుడేం?"

"నువ్వు కోరినట్లు ఆడాను. ఇంకేం చేయాలో చెప్పు!"

"ఈ రాత్రికి హోటలు స్వప్నాలో నీ నృత్యం ఉండకూడదు—...."

"ఆ నృత్యాన్ని ఆపడం నీ వల్ల కాదు" అంది మధురిమ.

"ఆపడానికే కదా నిన్నిక్కడ వుంచింది" అన్నాడు మధుసూదనరావు.

మధురిమ నవ్వి, "అలాగని నువ్విక్కడే ఉండిపోకు. ఏకాంతంలో కంటె పది మంది మధ్యనే నా నృత్యం యింకా బాగుంటుంది. ఆ అవకాశం పోగొట్టుకోకు. వెళ్ళి నా నృత్యం చూడు" అంది.

"వెడతాను. కానీ!"

"నా గురించి బెంగపడకు. అన్న టైముకి గాలిలో యెగిరయినా వెళ్ళి ప్రదర్శన యిస్తాను" అంది మధురిమ.

• • •

అదొక పెద్ద హాలు. అలంకరణ చాలా ఆడంబరంగా ఉంది.

సుమారు వంద మంది కుర్చీలలో కూర్చుని పానీయాలు సేవిస్తూన్నారు. వారంతా ఖరీదయిన మనుషులని చూడగానే చెప్పవచ్చు.

హాలు మధ్యన అందమయిన గుండ్రని తివాచీ ఉంది.

"సమయం - పదకొండు గంటల నలభైఅయిదు నిము

పాలు........" స్పీకర్‌లో ఎవరో అనౌన్స్ చేశారు.

అప్పుడు తివాచీ మీదకు ఓ యువకుడు నడుచుకుంటూ వెళ్ళాడు. మధ్యలో ఆగాడు. ఓసారి తివాచీ వంకా తన కాళ్ళవంకా చూసుకున్నాడు. తర్వాత అందరివంకా చూసి "సుతిమెత్తని యీ తివాచీని నేను నా అడుగులు మోపి బాధించాను. అయితే ఈ తివాసీమీద నడిస్తే తన అడుగులు నొచ్చే ఓ సుకుమారి ఉంది. ఆమె ఎవరో తెలుసా?" అన్నాడు.

ఎవ్వరూ మాట్లాడలేదు. అందరూ ఊపిరి బిగబట్టి అతడు చెప్పబోయేది వింటున్నారు. మధురిమ నృత్యాల్లోని ప్రత్యేకత అది. ఆమె యెప్పుడు యెలా స్టేజి మీదకు వస్తుందో యెవరికీ తెలియదు. ప్రతిసారీ ఒక వినూత్న విధానం.

మధుసూదనరావు కుర్చీలోంచి యిబ్బందిగా కదిలాడు. అక్కడున్న ఫోన్ ఉపయోగించాడు.

అవతల డేంజర్ పలికాడు.

"హలో! ఆమె ఉందా?"

డేంజర్ కొద్ది క్షణాలు వ్యవధి తీసుకున్నాడు. "ఉంది సార్!"

మధుసూదనరావు తృప్తిగానే ఫోన్ పెట్టి మళ్ళీ తన సీట్లో కూర్చున్నాడు.

తివాచీమీద యువకుడు ఓ అజ్ఞాత స్త్రీ అందాల గురించి యింకా యింకా మాట్లాడుతున్నాడు.

ఆఖరున "ఆ యువతి, ఆ సమ్మోహనాంగి - ఆమె... మిస్ మధురిమ!" అన్నాడు.

ఉన్నట్టుండి గడియారం పన్నెండు గంటలు కొట్టింది. మైక్‌లో "సమయం....పన్నెండు గంటలు...." అని

వినిపించింది.

అంతా ఊపిరి బిగబట్టి చూస్తున్నారు.

తివాచీ మీద యువకుడు గాలిలోకి లేచాడు. తివాచీ గాలిలోకి లేస్తోంది. ఇది యెవరూ ఊహించనిది.

కొద్ది క్షణాల్లో హాలు మధ్య గుండ్రటి బోను ఒకటి వెలిసింది. దాని పైన ఆ యువకుడున్నాడు....లోన అప్సరసలను మించిన ఒక యువతి ఉన్నది.

చటుక్కున బోను తలుపులు తెరుచుకున్నాయి.

ఆ యువతి బయటకు పరుగెత్తింది.

బోను మళ్ళీ కిందకు దిగిపోయింది. మళ్ళీ హాలు మధ్య తివాచీ....తివాచీపై ఆ యువకుడు.

"మిస్ మధురిమ!" అన్నాడతను.

"అవును. మధురిమను నేనే!" అందా యువతి.

ఆ గొంతులోని తియ్యదనం నిర్వచనాల కందనిది.

"నీకు స్వతంత్రం వచ్చింది. నువ్వింక బందీవి కాదు. ఉరకలు వేసే నీ ఉత్సాహాన్ని నువ్వు ఏ విధంగానయినా ప్రదర్శించుకోవచ్చు" అన్నా డా యువకుడు.

ఒక్కసారిగా హాల్లో ఎన్నో వాయిద్యాలు ప్రతి ధ్వనించాయి.

మధురిమ కాలు కదిలింది.

మధుసూదనరావా మెను పరీక్షగా చూస్తున్నాడు.

ఆమె మధురిమ! అందులో సందేహం లేదు. కానీ ఆమె యిక్కడకు యెలా వచ్చింది? యెలా రాగలిగింది?

మధురిమ తన శరీర భాగాలను అపూర్వంగా కదిలిస్తూ అక్కడ సంచలనం సృష్టిస్తూంటే - ఆమె వునికి మధు సూదనరావు మెదడులో సంచలనాన్ని సృష్టిస్తోంది.

మధురిమ అక్కడ హాల్లో కూర్చున్న మనిషి మనిషి

దగ్గరకూ వెడుతోంది. ప్రతీఒక్కడూ ఆమెను తడిమి ఆనందిస్తున్నాడు. ఆమెకు వందరూపాయల నోట్లు, చెక్కులు బహుమానంగా అందుతున్నాయి. అవన్నీ ఆమె భద్రంగా తాను వేసుకుని వున్న పొడవయిన అంగీలో దాస్తోంది. ఆ విధంగా ఆమె చాలా సేపు ఆ హాల్లో నృత్యం చేసింది. తర్వాత సంగీతం వేగం పెరిగింది. మధురిమ తివాచీ మీదకు పరుగెత్తింది.

ఇప్పుడు మధురిమ ఆడే పద్ధతి మారింది.

చూపరుల గుండె లదిరేలా! సంగీతానికి అనుగుణంగా ఆమె ఒక్కటొక్కటిగా బట్టలు తీసేస్తోంది. ఒకో వస్త్రమే ఆమె శరీరం నుంచి దూరమవుతూంటే హాల్లో చప్పట్లు మార్మ్రోగుతున్నాయి.

ఇప్పు డామె కేవలం బికినీతో మిగిలింది.

"ఒకేసారి!" మైకులో ఓ కంఠం పలికింది.

మధురిమ ఓ చేయి బ్రా మీదకు వెళ్ళింది. రెండో చేయి పాంటీ మీదకు వెళ్ళింది. కొద్దిగా వదులుగా రెండింటినీ ముందుకు లాగి పట్టుకున్న దామె.

"రెడీ....వన్!"

స్పీకర్‌లో కంఠం ఖంగుమంటోంది.

మధురిమ తానేం చేయబోతున్నదీ సూచిస్తూ మరి కాస్త వదులుగా లాగింది ఆ రెంటినీ. కూర్చున్న వాళ్ళ ఆత్రుత పెరిగిపోతోంది.

"టూ...."

బ్రా కాస్త పైకి వెళ్ళింది. పాంటీ కాస్త కిందకు దిగింది.

"త్రీ...."

మధురిమ చేతులు వేగంగా పనిచేశాయి.

ఒక్క క్షణం జనం ఏం చూశారో తెలియదు. అక్కడ కారు చీకటి అలుముకుంది.

"వాట్ హేపెన్డ్...." చాలా మంది అరిచారు.

"సమానం.... సమానం...." స్పీకర్లో స్వరం పలికింది.

కొద్ది క్షణాల్లోనే హాల్లో దీపాలు వెలిగాయి.

హాల్లో మధ్య తివాచీ.... తివాచీపై యువకుడు....

"ఐ థ్యాంక్యూ ఆల్! ఐ హోప్.... యూ ఎంజాయ్డ్ దీ ప్రోగ్రాం!" అంటున్నాడతను అందరి వైపూ చూస్తూ.

"మధురిమ కావాలి. ఆమె ఎక్కడ?" కొన్ని కంఠాలు అరిచాయి.

"ఆమె వెళ్ళిపోయింది. అయాం సారీ!" అన్నాడా యువకుడు. జనంలో అసంతృప్తి కనబడుతోంది. అయితే మధురిమ కార్యక్రమా లలాగే ఉంటాయి. ఆమె తివాచీ అడుగున ఉన్న గదిలోకి జారిపోయింది. అక్కణ్ణించి తిన్నగా తన గదికి వెళ్ళింది. గది తలుపులు తానే తీసింది. గదిలో అడుగుపెట్టి తలుపు లోపల్నుంచే లాక్ చేసింది. తాను ధరించిన అంగీలోంచి కాగితాలన్నీ తీసింది. అందులో చెక్కులున్నాయి. డ్రాఫ్టులున్నాయి. వందరూపాయల నోట్లున్నాయి. వాటి కేసి చూసి ఆమె కళ్ళలో తిరిగిన నీళ్ళు తుడుచుకుని, "ఇప్పుడు నేనేం చేయాలి?" అని అప్రయత్నంగా పైకే అను కుంది. అవన్నీ తిరిగి అంగీలోనికి తోసేసింది.

"ఎలా? యిప్పుడెలా?" అన్న ప్రశ్న ఆమె బుర్రలో తిరుగుతోంది.

తన వద్ద నున్న అమూల్యమయిన కాగితాలు మాయ మయ్యాయి. వాటిని రామకృష్ణ అపహరించుకుపోయాడు.

ఆ కాగితాలు లేందే యీ డబ్బుకు ప్రయోజనం లేదు. ఆ కాగితాలు పోవడం వల్ల ఈ డబ్బు తనకు ప్రమాద కారి కూడా అవుతుంది. అయితే ఆ కాగితాలవల్ల రామ కృష్ణకు మాత్రం ప్రయోజన మేముంటుంది?

అతడు మళ్ళీ తన వద్దకు రాక తప్పదు. అప్పుడు తనేం చేయాలి?

ఆలోచిస్తూ ఆమె కాస్త వెనకగా ఉన్న తన మంచాన్ని సమీపించింది.

ఉన్నట్టుండి మంచంమీద దుప్పటిలోంచి ఓ ఆకారం లేచి రివాల్వర్ ఆమె వైపు గురిపెట్టింది.

ఉలిక్కిపడింది మధురిమ.

అతను రామకృష్ణ.

"మళ్ళీ వచ్చాను మధురిమా! అంతా నా అదృష్టం! యిప్పుడూ భీమసేనుడు లేడు" అన్నాడతను.

• • •

"మీ కా అనుమాన మెందుకొచ్చింది?" అన్నాడు డేంజర్.

"అన్నీ తర్వాత చెబుతాను. ముందు గది చెక్ చేయనీ!"

మధుసూదనరావు గది తలుపులు తీసి చూశాడు. లోపల మధురిమ నిద్రపోతోంది.

ఆయన ఆమెను సమీపించాడు.

సందేహం లేదు. ఆమే మధురిమ.

మరి .... తా నామె నృత్యం స్వప్నా హోటల్లో చూశాడు.

ఇదెలా సాధ్యం?

ఆయన మధురిమను తట్టి లేపాడు.

ఆమె గాఢ నిద్రలో ఉంది. లేవడానికి కాసేపు పట్టింది. లేవగానే మధుసూదనరావును చూసి, "అరే! నువ్వా! నా నృత్యం నీకు నచ్చిందా?" అంది.

"ఏ నృత్యం?"

"స్వప్నా హోటల్లో చూసినది."

"చెప్పు. అక్కడి కెలా వచ్చావ్?"

"నువ్వు నాకు మగాళ్ళని కాపలా పెట్టకూడదని ఇప్పుడయినా తెలుసుకో!"

"అంటే?"

"అంతా ఆవూ పులీ కథ. మాడతల్లి అని ఆవుమీద పులి జాలిపడగలనప్పుడు-ఓ అందమైన ఆడదానిమీద మగాడు జాలిపడలేడా? అతను నన్ను కాసేపు వదిలిపెట్టాడు. నాట్యం చేయడంవల్లనే నా ప్రాణాలు నేను రక్షించుకో గలిగాను. అన్న మాట నిలబెట్టుకుని డ్యాన్సు కాగానే యథాస్థానంలోకి వచ్చి పడుకున్నాను."

"ఇంపాసిబుల్!"

"ఇట్స్ పాసిబుల్" అంది మధురిమ. "ఇంక నువ్వు నన్ను వదిలిపెట్టడం మంచిది. నావల్ల నీకు ఒక్క పైసా కూడా రాదు సరికదా - ఊళ్ళో గొప్పవాళ్ళతో శత్రుత్వాలు వస్తాయి. అది నీకే ప్రమాదం."

"ఊళ్ళో గొప్పవాళ్ళెవరు?"

"ఉదాహరణకు విజయబాబు!"

"విజయబాబు నీకు తెలుసా?"

"ఈ ఊరికి నేను రావడానికి ముఖ్య కారకుడు విజయబాబు!"

మధుసూదనరావు తమాషాగా నవ్వాడు. "విజయబాబు నా వాటాదారు. అయితే మే మిద్దరం ఒకర

నౌకరు దెబ్బతీయాలనుకుంటున్నాం. నువ్వే నాకు అస్త్రంగా పనికొస్తావు. నీ నుంచి రహస్యాలు రాబడతాను."

"నా నుంచి నీకు ఎటువంటి రహస్యాలు లభించవు. నన్ను రహస్యాలకని వేధిస్తే నన్ను నేను చంపుకోగలను కూడా!" అంది ఆమె.

"ఈ యింట్లోకి మృత్యువు కూడా నా అనుమతిలేందే ప్రవేశించదు. నీ చావయినా, బ్రతుకయినా నా చేతుల్లో ఉంది" అన్నాడు అతను.

"అలాగా!" అని నవ్వింది ఆమె.

"నువ్వెప్పుడూ యిలాగే నవ్వుతూండాలన్నదే నా కోరిక. కానీ మరో యిరవయినాలుగ్గంటల్లో నీ ముఖాన చిరునవ్వు ఉంటుందన్న నమ్మకం మాత్రం నాకు లేదు. ఆలోచించుకో!" అన్నాడు అతను.

"నాకు ఆలోచించుకునేందుకు వ్యవధి కావాలి. ఎంత గడువు యివ్వగలవు?" అనడిగింది ఆమె.

"ఇరవయినాలుగు గంటలు."

"అన్నెందుకు? ఓ గంట చాలు నాకు. ఏకాంతంగా ఆలోచించుకోనీ నన్ను" అంది ఆమె.

మధుసూదనరావు గది బయటకు వెళ్ళి తలుపులు వేశాడు. డేంజర్ వద్దకు వెళ్ళి ఆమె అన్న మాటలు చెప్పాడు.

"అన్నీ అబద్ధాలు. నేను దాన్నెందుకు వదుల్తాను?" అన్నాడు డేంజర్.

"నేను నిన్ను కాక దాన్నెందుకు నమ్ముతాను!" అన్నాడు మధుసూదనరావు నవ్వుతూ. ఇద్దరూ విజయబాబు గురించి చర్చించారు.

విజయబాబు అంటే ఊళ్ళో చాలా మంది భయపడ తారు. డేంజర్ కు కూడా అతడంటే భయమే!

అలాగని విజయబాబుకు వయసెంతో లేదు. అతడి వయసు పాతిక్కి మించదు. మనిషి కూడా ఆకర్షణీయంగా ఉంటాడు. అయితే అతడిది దురుసు స్వభావం. వెనకా ముందూ ఆలోచించకుండా ఎదుటివాణ్ణి ఎంత మాటైన అనేస్తాడుతను. కోపం వస్తే అతడికి వళ్ళు తెలియదు. నాలుకను అదుపున ఉంచుకోడు. అతణ్ణి ఎదిరించినవాళ్ళు బ్రతకరని చాలా మంది చెప్పుకుంటారు.

అతను డబ్బు సంపాదించడానికి వక్రమార్గాలనే యెన్నుకున్నాడంటారు. ఖర్చుపెట్టడానికి మాత్రం అతడు మంచి మార్గాలను కూడా యెన్నుకున్నాడు. అత డెన్నుకున్న మార్గాల్లో దైవకార్యాలు మాత్రం లేవు. ఏటా పేద విద్యార్థుల చదువు నిమిత్తం అతను పదివేల రూపాయలు ఖర్చుపెడతాడు. ఊళ్ళో ఉన్న రెండు సేవా సంస్థలు, శరణాలయం అతడి నుంచి భారీ విరాళాలు పొందగలుగుతున్నాయి. అందువల్ల విజయబాబును దేవుడనుకునేవారూ ఉన్నారు.

మొత్తంమీదవిజయబాబు వార్తల్లో మనిషి. అతడి గురించి ఏదో విశేషం - మంచికో, చెడుకో రోజూ అంతా చెప్పుకుంటారు.

మధుసూదనరావుకు డబ్బుంది కానీ ఊరూ పేరూ లేనట్లే లెక్క!

ఆయనకు విజయబాబు అంటే అసూయ ఉంది. ఆయనకు అతడి మీద అనుమానమూ ఉంది. దొంగనోట్ల వ్యాపారంలో అతడు తన వాటాదారు. కమిషన్ పద్ధతి మీద ఆ నోట్లు చలామణీ చేయిస్తున్నాడు విజయబాబు.

కమిషన్ విషయంలో అబద్ధం చెప్పి ఎక్కువ లాభం కొట్టేస్తున్నాడని మధుసూదనరావు అనుమానం.

ఇప్పుడాయనకు నోట్ల మార్పిడికి విజయబాబు అవసరం లేదు. ఈ రెండు సంవత్సరాల్లోనూ చాలా మంది ఏజంట్లు ఆయనకు పరిచయమయ్యారు' ఎటొచ్చీ విజయబాబుతో వాటాదారయ్యాక - అతను వద్దంటే తప్ప విడిపోవడానికి లేదు. గత రెండు సంవత్సరాలలోనూ అలా విడిపోయి - నాశనమయిన వాళ్ళను మధుసూదనరావు కళ్ళారా చూశాడు. అందుకని ఆయన విజయబాబు ఆయువుపట్లు పట్టాలని చూస్తున్నాడు.

ఇప్పుడాయనకు మధురిమ దొరికింది.

మధురిమ తెలివి తక్కువదయి మధుసూదనరావు వద్ద నోరు జారలేదు. విజయబాబు ఆమెకు చెప్పి వున్నాడు - "మా ఊళ్ళో ఏ వెధవ నిన్ను నిర్బంధించినా నా పేరు చెప్పు. వాడలిపోయి వదిలేస్తాడు."

మధుసూదనరావు నిద్రపోలేదు. సరిగ్గా గంటసేపు ఆయన దేంజర్‌తో కబుర్లాడాడు. అప్పుడుత్సాహంగా వెళ్ళి మధురిమ గది తలుపు తీశాడు.

ఇప్పుడు మధురిమ ఏమంటుంది? విజయబాబును గురించిన వివరాలు చెబుతుందా .... లేక .... ఏదైనా నాటకమాడుతుందా?

ఆయన గదిలో ప్రవేశించాడు.

మధురిమ సోఫాలో లేదు.

"మధురిమా!" పిలిచాడాయన.

బదులు లేదు.

బాత్రూం తలుపులు తెరిచి ఉన్నాయి.

మధురిమ గదిలో లేదు. ఆయన బాత్రూంలోకి

వెళ్ళాడు. ఆమె అక్కడ కూడా లేదు. కంగారుగా అంతా వెతకసాగాడు. కొద్ది నిమిషాలు గడిచాక ఆయనకు మధురిమ అక్కడలేదని అర్థమయింది. బయటకు వచ్చి దేంజర్ని పిలిచాడు. ఇద్దరూ కలిసి కొంత సేపు వెతికారు.

ఉన్నట్లుండి—"ఇది చూడండి!" అన్నాడు దేంజర్.

సోఫామీద ఒక మూలగా వుందా కాగితం.

"అసలింకా ముందే వెళ్ళిపోయేదాన్ని. నేనుండగా ఏం కేళాకోళమాడినా — నేను లేనప్పుడు ఒక అమాయకుణ్ని అనుమానించడం నాకిష్టముండదు. నువ్వు దేంజర్ని అనుమానించకూడదని ఈ ఉత్తరం పెడుతున్నాను...."

"ఎలా పోయిందీ—బయిటికి!"

"బాత్రూం కిటికీ తలుపు తెరిచివుందండి ..."

"అందులోంచి కనుక క్రిందకు దూకిందంటే చచ్చి పూరుకుంటుంది. ఇది మూడో అంతస్థు కూడాను...." అన్నాడు మధుసూదనరావు.

"చచ్చిందేమో చూస్తానుండండి.." అంటూ దేంజర్ కిటికీ దగ్గరకు వెళ్ళి క్రిందకు తొంగి చూశాడు. నేలమీద దరిదాపుల్లో శవమన్నది కనిపించడంలేదు.

* * *

ప్రతాప్ కి రాత్రంతా నిద్రలేదు. కన్ను మూసినా తెరచినా అతడి కనులముందు మంగళ కనబడుతోంది.

చెవుల్లో అఘోరీబాబా మాటలు మార్మోగుతున్నాయి. "నీ బండి నత్తనడక నడుస్తోంది. ఇప్పటికి ఎందర్ని పట్టావ్? అయిదుగురినే కదా....ఇంకా అయిదుగురు కావాలి...."

అతడి దృష్టిలో ఇప్పుడు సావిత్రిలేదు. శ్యామలలేదు. తనకు పరిచయమైన ఏ యితర స్త్రీ లేదు. కేవలం మంగళ వుంది.

మంగళ పరిచయం తనకు లభిస్తే....

ఆమె నంబరు ఆరు అవుతుంది.

అతను మంచం వీధి అరుగుమీద వేసుకున్నాడు. అది మడతమంచం. ఆలోచనలతో చిరాకు పడ్డపుడల్లా అతను పైకి చూసుకుంటున్నాడు. అలా మూడు గంటలు దాటేవరకూ చూసుకుంటూనే వున్నాడు. ఆ ప్రాంతాల యెవరో అతడి ఇంటిముందు ఆగడంకూడా అతను గమనించాడు.

"ఎవరది?" గట్టిగా అన్నాడతను.

"ఇది ప్రతాప్ ఇల్లేనా?" అన్నదో కంఠం. ఆ కంఠం చాలా తమాషాగా వుంది.

"నేనే ప్రతాప్‌ను...." అతడు లేచి కూర్చున్నాడు.

"ఎంత అదృష్టం?" అందా కంఠ స్వరం.

"ఎవర్నువ్వు?"

"నా పేరు మంగళ...."

ప్రతాప్ చటుక్కున మంచం దిగాడు. అప్పటికతడి కామె గొంతు గుర్తుకొచ్చింది. అవును అది మంగళ కంఠమే! మధ్యాహ్నం తను విన్న కంఠం అంత తొందరగా ఎలా మర్చిపోగలిగాడు?

అతడామెను సమీపించాడు. ఆమె నిండా ముసుగులో వున్నది. రెండు కళ్ళు మాత్రం మిలమిల మెరుస్తూ కని పిస్తున్నాయి.

"మంగళా!" అంటూ అతడామె చేయి పట్టు కున్నాడు. ఆమె చేతికి గ్లవ్స్ వున్నాయి.

"ఇష్!" అన్నదామె. ఇద్దరూ అరుగుమీదకు వచ్చారు. అరుగుమీద బాగా చీకటిగా వుంది. ఆ చీకట్లో అతడామెను బలంగా ముద్దుపెట్టుకున్నాడు.

ఆమె మృదువుగానే అతణ్ని విడిపించుకుని—"నీ అడ్రసు వెతుక్కుంటూ...." అంది.

"ఎందుకు?"

"నన్ను మనసారా కాంక్షించిన మొదటి మగాడివి."

ప్రతాప్ ఆమెను దగ్గరగా లాక్కుని—"మంగళా! నిన్ను చూసినప్పట్నించీ నాకు నిద్రలేదు. నీకోసం కలవరించి పోతున్నాను—" అన్నాడు.

"నిజంగా!" అందామె ఆశ్చర్యంగా.

"నిద్రపట్టక పోవడంవల్లనే కదా—నువ్వు మా ఇంటి ముందు ఆగిన వెంటనే పలకరించాను...." అన్నాడు ప్రతాప్.

"అవును ప్రతాప్! నీ అడ్రసు దేంజర్నడిగి తెలుసుకున్నాను. నీ మీద యెన్నో ఆశలు పెట్టుకుని వచ్చాను. నాకు కొన్నాళ్ళు ఆశ్రయ మివ్వగలవా?"

ఆ గొంతు దీనంగా ఉంది.

"నీకు ఆశ్రయమా! ఎందుకు?" ఆశ్చర్యంగా అడిగాడు ప్రతాప్.

"నే నిప్పుడు నిరాశ్రయురాలిని."

"మధురిమ అండ ఉండగా నువ్వు నిరాశ్రయురాలివెందు కవుతావు?" అన్నాడు ప్రతాప్.

"ఇప్పుడు మధురిమ లేదు[illegible]!" అంది మంగళ.

"ఏమయింది - మధురిమ[illegible]?"

"మధురిమ చచ్చిపోయిం[illegible]

ప్రతాప్ షాక్ తిన్నాడు.

"మధురిమ చచ్చిపోయిందా? ఎలా?"

"ఎవరో ఆమెను చంపేశారు."

"ఎలా?" మళ్ళీ అడిగాడు ప్రతాప్.

"రివాల్వర్‌తో కాల్చి" — అంది మంగళ. ఆమె గొంతులో ఏడుపు ధ్వనించింది. ప్రతాప్ నమ్మలేనట్లు తనలో తనే ఏదో గొణుక్కున్నాడు.

"ప్రతాప్! యిప్పుడు నా ప్రాణాలు కూడా అపాయంలో వున్నాయి. నేను ఆమె పక్కన నిలబడ్డం తప్ప మరేమీ తెలియనిదాన్ని. ఆమె చనిపోగానే యెన్నో ప్రశ్నలకి బదులివ్వాల్సి ఉంటుంది. ఆమెను చంపినవాళ్లు నన్నూ చంపే అవకాశముంది. అందుకే నేను పారిపోయి వచ్చాను" అంది మంగళ.

"భీమసేనుడేమయ్యాడు?"

"తెలియదు."

"పారిపోతే పోలీసులు నిన్ను అనుమానించరూ?"

"పోలీసులు నన్నుమానించినా ఫరవాలేదు. వాళ్ళు గవర్నమెంటు ఉద్యోగులు. వాళ్ళు నన్ను వేటాడాలని ప్రయత్నించరు. దొరికితే పట్టుకోవాలని చూస్తారు. కానీ హంతకులు అలా కాదు. వాళ్ళు నేను పోలీసు రక్షణలో ఉన్నా చంపాలనే అనుకుంటారు. నా కేవో రహస్యాలు తెలుసునని అనుమానిస్తారు" అంది మంగళ.

"అయితే ఏం చేస్తావ్? మా యింట్లో ఉంటే మా అమ్మా నాన్నా అనుమానిస్తారు. అందులోనూ యెక్కడున్నా నిన్ను సులభంగా గుర్తించేయవచ్చు. నీ రూపం అలాంటిది. ఎక్కడుంటావో చెప్పు........" అన్నాడు ప్రతాప్.

"నా రూపం గురించే యీ బురఖా వేశాను. మీ యింట్లో వుండడానికి వీలవదూ?" అంది మంగళ.

ప్రతాప్ కొద్ది క్షణాలు ఆలోచించాడు. "చూడు. నిన్ను కొందరు దుర్మార్గులు తరుముతూంటే వచ్చి నా మంచం చాటున దాగావు. వాళ్ళకు నీ ఉనికి తెలియ లేదు. నీకు నా అన్నవాళ్లెవ్వరూ లేరు. ఎవరో మోసం చేసి నిన్ని ఊరు తీసుకొచ్చారు. నువ్వొక ముస్లిం యువ తివి. ఈ కథ గుర్తుంచుకుంటావా?"

మంగళ తల ఊపింది.

ప్రతాప్ తలుపు తట్టాడు. యీ కథ తల్లిదండ్రులకు చెప్పడానికి. అతడి మనసులో మాత్రం "యింకా నలు గురు కావాలి!" అనుకున్నాడు.

* * *

చిరాగ్గా తలుపు తీశాడు రఘురాం.

"మిమ్మల్ని చాలా యిబ్బంది పెట్టాను" అన్నాడు రామకృష్ణ లోపల అడుగు పెడుతూ.

"ఇబ్బంది నీ వల్ల కాదు, మా యింటి వల్ల. అద్దె కివ్వడానికి అనుగుణంగా కట్టలేదది. ఫరవాలేదు. నువ్వు మాత్రం ఆ స్తమానూ ట్రబులివ్వడం లేదు గదా! తలుపు తట్టి పిలవడం నీకూ యిబ్బందే! ఇంతకూ విశేష మేమిటి? ఇంత రాత్రివేళ యెక్కణ్నించి వస్తున్నావ్?" అన్నాడు రఘురాం.

"అవన్నీ మీరు పట్టించుకోకండి. నాదంతా ప్రాణా లతో చెలగాటం. ఒకోసారి నా ప్రాణాలు ప్రమా దంలో ఉంటూంటాయి. ఒకోసారి నా కారణంగా మరొకరి ప్రాణాలు ప్రమాదంలో పడుతూంటాయి" అన్నాడు రామకృష్ణ.

రఘురాం రామకృష్ణను పరీక్షగా చూశాడు. మని షిలో యేదో కంగారు కనపడుతోంది. దా న్నాయన గుర్తించనట్లుగా, "ప్రాణాల ప్రమాదం సంగతి అలా గుంచు. నువ్వు ప్రాణాల్ని రక్షించే ఏర్పాట్లేమయినా చేయగలవా?" అన్నాడు.

"అంటే?" అన్నాడు రామకృష్ణ.

"అమ్మాయికి పెళ్ళిచూపులు నిశ్చయం చేస్తే వచ్చిన మొదటి పెళ్ళికొడుకు హత్యచెయ్యబడ్డాడు. రేపు మళ్ళీ అమ్మాయికి పెళ్ళిచూపులు. ఈసారి అలాంటిదేమీ జర క్కూడదని ఆశపడుతున్నాను" అన్నాడు రఘురాం.

రామకృష్ణ ఆశ్చర్యంగా — "అబ్బాయి చావుకూ, అమ్మాయి పెళ్ళిచూపులకూ సంబంధ ముందని మీ రెందు కనుకుంటున్నారు? అదేదో కాకతాళీయం. అంతే!" అన్నాడు.

రఘురాం దిగులుగా ముఖం పెట్టి — "మన దేశంలో ఆడపిల్లల కష్టాలు నీకు తెలియవు. తన అభిమాననటుడి పిక్చర్ ఫ్లాప్ అయితే - అది కూడా పెళ్ళాం అడుగు పెట్టిన వేళావిశేషమని నమ్మే కుర్రకారున్న యీ రోజు లలో - ఆడపిల్లకు కాకతాళీయా లుండాలి. మరోసారి అలా జరిగిందంటే అమ్మాయికి పెళ్ళిచూపుల ఏర్పాటే కష్టమయిపోతుంది. మొదటి సారికే అలా జరిగినందుకు మరో సంబంధం దొరకడం కష్టమయింది. నీ వల్లనైతే కాస్త ఆ పెళ్ళికొడుకును జాగ్రత్తగా కనిపెట్టి ఉండు" అన్నాడు.

రామకృష్ణకు లోలోన నవ్వు వచ్చినా పైకి మాత్రం బాగుండదని దిగులుగా నటించాడు. జాహ్నవికి అంత తొందరగా సంబంధం కుదరకూడదని అతడికీ ఉంది. ఆ

మాట పైకి అనకుండా అతడు తన గదిలోకి వెళ్ళి పోయాడు.

రఘురాం తనూ తన గదిలోకి వెళ్ళి పడుకున్నాడు. అయితే ఆయన కో పట్టాన నిద్రపట్టలేదు. మర్నాటి ఏర్పాట్ల గురించే ఆలోచిస్తున్నాడాయన.

పెళ్ళివారు గుడివాడ నుంచి వస్తున్నారు. వరుడిది హైదరాబాదులో ఉద్యోగం. పేరు జగన్మోహన్. జాహ్నవికి తగ్గ వరుడిలా ఉంటాడు. ఫోటో చూసి అతడు పెళ్ళిచూపులే అవసరం లేదన్నట్లు మాట్లాడాడు. ఏమయితేనేం పెద్ద లీ ఏర్పాటు చేశారు. వాళ్ళు కార్లో వస్తారు.

మర్నాడు లేచాక ఇంట్లో హడావుడి ప్రారంభమయింది. సుకుమార్ కూడా ఎక్కడికీ వెళ్ళకుండా ఇంట్లోనే వున్నాడు.

ఇంట్లో నిర్లిప్తంగా వున్నది జాహ్నవి ఒక్కతే!

"ప్రతాప్ — నీకోసం నన్నెలా కాపాడుకోను?" అని ఆలోచిస్తున్నదామె. ఈ పెళ్ళి ఆమెకు సుతరామూ ఇష్టంలేదు. అయితే ఏం చేస్తుంది? ఏమని మాట్లాడుతుంది? తనను కాదంటున్న ప్రతాప్ కోసం ఎంత కాలమని ఎదురుచూస్తుంది?

సరిగ్గా మూడింటికి పెళ్ళివారి కారు ఇంటిముందాగింది.

కార్యక్రమం యథావిధిగా కొనసాగింది.

అంతా అయ్యాక వరుడి తండ్రి — "అబ్బాయికి పిల్ల నచ్చింది. మాకూ నచ్చింది. ఇతరాలంటారా-మాకే కోరికలూ లేవు. అంతా మీ యిష్టం. మీరు ఎలా చేస్తే అలా ఒప్పుకుంటాం—" అన్నాడు.

(ఇంకా వుంది)

## "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్క-మాటలోగాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డు సైజు తెల్ల కాగితంపై వ్రాసి, ఈ నెల 7 వ తేదీ లోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి. సభ్యులు కానివారు తమ వ్యాఖ్యలతో 50 పైసల స్టాంపులు పంపాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రు. 25/- లు నగదు బహుమతితోపాటు 6 నెలలు "సప్లిమెంట్" కూడా పంపుతాము.

## "హోమ్ డెలివరీ"

మీరు 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరితే, నెల నెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 10/- లకే మా ఏజెంట్ ద్వారా గాని, వి.పి. ద్వారాగాని మీ యింటి దగ్గర అందజేస్తాము. ఇందుకు అయ్యే ఖర్చులన్నీ మావే.

మీరు చేయవలసిందల్లా రు. 5/-లు పంపి 'హోమ్‌డెలివరీ' సభ్యత్వము పొందటమే.

'హోమ్ డెలివరీ' వల్ల మీకు కాపీలు నెలనెలా గ్యారంటీగా, త్వరితంగా చేరుతాయి. మీ ఇంటిదగ్గరనే డబ్బు చెల్లించి కాపీలు పొందవచ్చును. కాపీలకోసం మీరు ఏజెంట్ చుట్టూ తిరగాల్సిన అవసరం వుండదు. కాపీలు దొరకలేదనే నిరాశ, పోస్టులో పోయే సమస్య, ఎంతమాత్రం లేదు.

నెల నెలా వి. పి. తీసుకోవటం కష్టమనుకునేవారు ఏడాది పైకము రు. 120/-లు ముందుగా పంపవచ్చును.



# క్రైమ్‌లో తమాషాలు

## "స్వతంత్ర జీవితం"

కొత్తగా ఓ చిన్న తరహా పరిశ్రమ స్థాపించాడు అప్పారావు.

అతని మిత్రు డొకడు "ఎలా ఉందోయ్, జీవితం! నీకేం సర్వ స్వతంత్రుడివి. ఇప్పుడు నీకు నువ్వే బాస్‌విగా!" అని అభినందించాడు.

"అవును. నాకు నేనే బాస్‌ని! నా ఆఫీసు ముందే నా కారు ఎందుకు పార్క్ చేయకూడదో ట్రాఫిక్ పోలీసులు నాకు పాఠం చెబుతారు. సేల్స్‌టాక్స్ అధికారులు జమా ఖర్చుల పుస్తకాలు ఎలా రాయాలో చెబుతారు. ఏ కాలంలో ఎంత డబ్బు నిలవ చేయాలో బ్యాంకు వాళ్ళు చెబుతారు. ఎలాంటి వస్తువులు తయారు చేయాలో మా డీలర్లు చెబుతారు. ఉద్యోగులను ఎలా చూడాలో యూనియన్ వాళ్ళు చెబుతారు" అని తన స్వతంత్ర జీవితాన్ని వివరించాడు అప్పారావు.

—డి. మహబూబ్ బాషా, ఆదోని.

## అనుమానితుడు?

ఒకసారి కానిస్టేబుల్ రంగయ్య ఒక వీధిలో నుండి వెళ్తున్న ఒక వ్యక్తిని పట్టుకుని ఏవేవో ప్రశ్నలు వేయ

సాగాడు. అయితే ఎదుటి వ్యక్తి కంగారుగా తన జేబులు వెదుక్కోసాగాడు, రంగయ్య ప్రశ్నలకు జవాబివ్వకుండా.

రంగయ్యకి భలే కోపమొచ్చింది. అనుమానం కూడా వచ్చింది. కొంపతీసి వీడు గ్యాసు బాంబులాంటిది విసురుతాదేమో అనే భయంతో "హాండ్సప్" అని గర్జించాడు.

అయినా ఎదుటి వ్యక్తి పట్టువదలని విక్రమార్కునివలె తన ప్రయత్నమేమీ మానకుండా ఆఖరికి ప్యాంటు వెనకాల జేబునుండి ఒక కార్డుతీసి చూపించాడు. ఆ కార్డు చూడగనే రంగయ్య 'స్టన్' అయిపోయాడు.

ఆ కార్డులో యిలా వున్నది "నేను మూగవాణ్ణి."

—మూసాజీ, కాకినాడ.

## కనిపించని దొంగ!

"దొంగ!....దొంగ...." అన్న భార్య అరుపులకు వీధి గుమ్మంలో కూర్చుని పేపరు చదువుకుంటున్న రామారావు గారు ఇంటి చుట్టూ మూడుమార్లు ప్రదక్షిణం చేసి అయాస పడుతూ భార్య వద్దకు వచ్చాడు.

"ఏదే ఆ దొంగవెధవ! ఎక్కడా కనబడ్డంలేదు. ఎటు వెళ్ళాడు?!...."

"మరేం లేదండి. మీరు డ్యూటీలో వున్నప్పుడు దొంగను ఎలా పట్టుకుంటారో చూద్దామని అలా అరిచాను అంతే!" చెప్పిందా మహాఇల్లాలు.

—వాయిల రమణమూర్తి, పార్వతీపురం.

